# గ్రంథాలయ సమాచార విజ్ఞానం

## LIBRARY AND INFORMATION SCIENCE

# ఎస్. పాండురంగారెడ్డి అభినందన సంపుటి

## S. PANDURANGA REDDY FESTSCHRIFT VOLUME

# గ్రంథాలయ సమాచార విజ్ఞానం

## కొన్ని దృక్పథాలు

**Library and Information Science : Some Perspectives**

ప్రధాన సంపాదకులు

డా॥ యం. శంకరరెడ్డి

సంపాదకులు

డా॥ యం.వి. వేణుగోపాల్

యం. రాంచందర్

లింగాల పాండురంగయ్య

డా॥ ఎస్. హరికృష్ణా రెడ్డి



**వైభవ్ ఏజెన్సీస్**

బుక్ సెల్లర్స్ & డిస్ట్రిబ్యూటర్స్

బర్కత్‌పుర

హైదరాబాదు - 500027

ప్రథమ ముద్రణ . ఆగస్టు, 1998

ప్రచురణ
శ్రీ ఎస్. పాండురంగా రెడ్డి అభినందన సంఘం
హైదరాబాదు.

మెసర్స్ వైభవ్ ఏజెన్సీస్
హైదరాబాదు.

**వెల సాదా ప్రతి రూ. 175/-**
**లైబ్రరీ ఎడిషన్ రూ. 200/-**

కవర్ డిజైన్ : శీలా వీర్రాజు

For Copies
**M/s Vaibhav Agencies**
Book Sellers & Distributors
3-4-757/A Barkatpura
Hyderabad

Composed by
**Fontline Graphics**
Hyderabad-44
Ph 7660000

Printed at
**Bap Offset Printers (P) Ltd.**
Plot No 76 Mangapuram Colony
Meerpet Moula-Ali
Hyderabad - 40
Ph 7121726

# శ్రీ ఎస్. పాండురంగారెడ్డి

# అభినందన సంఘం

అధ్యక్షులు

**శ్రీ కోదాటి నారాయణరావు**

ఆం.ప్ర. గ్రంథాలయ పరిషత్తు మాజీ ఛైర్మన్

ఉపాధ్యక్షులు

**డా॥ యం.వి. వేణుగోపాల్**

ప్రొఫెసర్ (రిటైర్డ్), గ్రంథాలయ సమాచార శాస్త్ర శాఖ

ఉస్మానియావిశ్వవిద్యాలయం, హైదరాబాదు.

నిర్వాహక కార్యదర్శి

**డా॥ యం. శంకరరెడ్డి**

యూనివర్సిటీ లైబ్రేరియన్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు

సంయుక్త కార్యదర్శి

**శ్రీమతి ఎస్. విజయలక్ష్మి**

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, హైదరాబాదు

కోశాధికారి

**డా॥ ఎస్. హరికృష్ణా రెడ్డి**

సమాచార ప్రలేఖనాధికారి

జాతీయ మానసిక వికలాంగుల సంస్థ, సికిందరాబాదు



# కృతజ్ఞతా సుమాంజలి

ఈ సంపుటిని వెలువరించటంలో తమ సంపూర్ణ సహకారాన్ని అందించిన శ్రీ ఎస్. పాండురంగారెడ్డిగారి అభినందన సంఘం సభ్యులకు, అడిగిన వెంటనే వ్యాసాలను రాసి పంపి సహకరించిన వ్యాసకర్తలకు, కవితలు పంపిన కవులకు,

'అభినందన'లు తెలిపిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పార్లమెంటు సభ్యులు, పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి గారికి, 'శుభాభినందన'లు పలికిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి,

ఈ గ్రంథ ప్రచురణకు ఇతోధికంగా ఆర్థిక సహాయాన్ని సమకూర్చిన -

శ్రీ వి. రాజేశ్వరరావు, మాజీ పార్లమెంటు సభ్యులు; శ్రీమతి వి. శారద, నేషనల్ బుక్ఎంటర్ ప్రైజెస్, హైదరాబాదు; శ్రీ ఆనంద్, హైప్రోటీన్ కోల్డ్ స్టోర్స్, సికిందరాబాదు; శ్రీ పి. విజయకుమార్, మహేశ్వరి అండ్ కో., హైదరాబాదు; శ్రీ బి.వి. నాగేందర్‌రెడ్డి, హైదరాబాదు; శ్రీ ఎస్. గోపాల్ గుప్త, జె.ఎస్. గుప్త అండ్ సన్స్, హైదరాబాదు; మెసర్స్. దేవి వెబ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ హైదరాబాదు గార్లకు,

ఈ పుస్తకాన్ని ప్రచురించటానికి సమ్మతి తెలిపిన మెసర్స్ వైభవ్ ఏజెన్సీస్, హైదరాబాదు వారికి, టైప్‌సెట్టింగ్ చేసిన ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్‌వారికి, సకాలంలో అందంగా ముద్రించిన బాప్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి, అర్థవంతమైన కవర్ డిజైన్ రూపొందించిన శీలా వీర్రాజు గారికి,

మా ఈ ప్రయత్నం దిగ్విజయం కావటానికి ప్రత్యక్షంగా పరోక్షంగా సాయపడిన హితులూ సన్నిహితులూ, సహృదయులందరికీ మా కృతజ్ఞతా సుమాంజలులు

**డా॥ యం. శంకర రెడ్డి**
నిర్వాహక కార్యదర్శి

# విషయ సూచిక

## 3. గ్రంథాలు, గ్రంథాలయాలు - ప్రాముఖ్యత

## 4. గ్రంధాలయసేవలు, ఆధునికీకరణ

# సంపాదకీయం

ఒక జాతి, అట్లే ఒక భాషా వర్గం సాధించిన మేధా సంపత్తికి గ్రంథాలయాలు సరియైన తార్కాణాలు. అంతే కాదు, అవి మున్ముందు సాధించగల సాంఘిక, సాంస్కృతిక, తదితర జాతీయాభివృద్ధికి సైతం తోడవగల సాధనాలు. సామాన్యంగా గ్రంధాలయాలు విజ్ఞులకు, విద్యావంతులకు మాత్రమే ఉపయోగపడగల విద్యా సంస్థలుగా పరిగణించటం ఉంది. ఇది నిన్న మొన్నటి వరకు సబబుగానే కనిపించింది. అయితే పౌర గ్రంధాలయాలు ఏర్పడి వాటి సేవా ప్రణాళికలు విస్తరిల్లటంతో పై భావం పూర్తిగా వాస్తవం - సమంజసం అనిపించదు. విద్యావంతులు, అక్షరాస్యులతో బాటు నిరక్షరాస్యులకు సైతం పౌరగ్రంధాలయాలు ఉపయుక్తంగా రూపొందుతున్నాయి. వయోజన విద్యాభివృద్ధి, నిరక్షరాస్యతా నిర్మూలన మొదలైన సామాజిక పురోభివృద్ధి ఉద్దేశాలను పరిపూర్ణంగా సాధించటానికి పౌరగ్రంథాలయం ఒకటి మాత్రమే దోహదం చేయగలది.

నేటి పరిస్థితుల దృష్ట్యా పౌరగ్రంధాలయాలకు అత్యధిక ప్రాముఖ్యత నీయవలసిన అవసరం ఎంతయినా ఉంది. విస్తరిస్తున్న విద్యావకాశాలు, నూతన వినూతంగా విరివిగా నెలకొంటున్న విద్యాసంస్థలు, అభివృద్ధి చెందుతున్న శాస్త్ర సాంకేతికాలు, మారుతున్న రాజకీయాలు, ఎదుగుతున్న ఆర్థిక ధోరణులు, ఒడిదుడుకుల మధ్య కనిపిస్తున్న ఉద్యోగ అవకాశాలు, తదితర సామాజిక ధోరణులను సమర్థవంతంగా ఎదుర్కొని సవ్యము చేసుకోవటానికి సమాజంలో విషయ విజ్ఞాన లభ్యతా విధానం, ముఖ్యంగా గ్రంథాలయాలు, సమాచార కేంద్రాలు మొదలైన సంస్థలను ఏర్పరచి పౌరులకు అందుబాటులోకి తీసుకురావాలి. సంక్షిప్తంగా చెప్పాలంటే - విజ్ఞులైన పౌరులున్నప్పుడే ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది. మనం సాధించిన స్వాతంత్ర్యానికి స్థిరత సార్థకతలు ఏర్పడతాయి.

పౌర గ్రంథాలయాలను "పౌర విశ్వవిద్యాలయాలు"గా పేర్కొన్నారు. అయితే ప్రజాతంత్ర పరివృద్ధి కార్యాంగాలుగా కూడ గుర్తించినప్పుడు వాటి ఉపయోగం మరింతగా ఫలించగలదు. అందువల్ల ప్రభుత్వాలు అన్ని సంక్షేమ, పౌర సేవా కార్య ప్రణాళికలతో బాటు పౌర గ్రంథాలయ విధానాన్ని కూడా దృఢ పరచటానికి ఆసక్తి చూపాలి. కేవలం పౌర గ్రంథాలయ చట్టాన్ని ఆమోదించి నామమాత్రం గ్రంథాలయ సేవలను అమలు చేయటం సరిపోదు. సంకలనాభివృద్ధి, సేవా విస్తరణ, సిబ్బంది నియామకం, సాంకేతిక అనువర్తన మొదలైన విషయాల్లో సరియైన అవగాహన, విధాన నిర్ణయం అమలు కావాలి. ముఖ్యంగా, తగిన ఆర్థిక

వనరులు కల్పించాలి. పెరిగే అవసరాలకు అనుగుణంగా నిధులను పెంచాలి. ప్రస్తుతం ఉన్న శిస్తు విధానంలో గ్రంథాయాలకు చేరవలసిన సొమ్ము రాబట్టటం సమస్యాత్మకం కావటం వల్ల దీనిని పరిష్కరించాలి. గ్రంథాలయ సంస్థలకు యథావిధిగా శిస్తులు జమకావాలి. వీటికి తోడుగా అదనపు నిధులు సమకూర్చాలి.

శిస్తులు జమ కాకపోవటం ఒక సమస్య. వీటిని వినియోగించుకోవటానికున్న నిబంధనలు మరొక సమస్య. ఉదాహరణకు - మన రాష్ట్రంలో రాష్ట్ర గ్రంథాలయ పరిషత్తు ఈ నిధులను వినియోగం చేయటానికి నిర్ణయాలు తీసుకోవలసి ఉన్నది. సూచనలు చేయవలసి ఉన్నది. పరిషత్తు అమలులో లేనపుడు ఈ నిర్ణయాలు ఉండవు. ఫలితం గ్రంథాలయాలకు నిధులున్నా నిరుపయోగమే. జిల్లా గ్రంథాలయ సంస్థల విషయంలో కూడ పరిస్థితి ఇదే.

ఇది చాలదన్నట్లు తరచూ ప్రభుత్వ ఆంక్షలు అడ్డుపడతాయి. పఠన వస్తువులు కొనవీలుండదు. అవసరమైన సిబ్బంది నియామకం జరగదు. జీతభత్యాలు అందవు.మృతి చెందిన వారి కుటుంబాలకు గానీ, పదవీ విరమణ చేసిన ఉద్యోగులకు గానీ రావలసిన పరిహారాలు రావు. ఎందువల్ల? నిధుల కేటాయింపు లేకపోవటమో లేదా ప్రభుత్వ మంజూరు ఉండకపోవటమో లేదా ఆంక్షలుండటమో మొదలైనవి కారణాలు.

ఇవన్నీ పరిష్కారం కావాలి. గ్రంథాలయ సిబ్బంది సంబంధమైన విధానాలు చక్కబడాలి. ఆర్థిక, సంకలన, భవన, తదితర సదుపాయాల విషయాల్లో కనీస ప్రమాణాలు రూపొందించి అమలు చేయాలి. గ్రంథాలయ సేవా కార్యక్రమాల్లో నాణ్యతను పెంపొందించి సేవా కార్యకలాపాలను పెంపు చేయటానికి అవసరమైన నిర్ణయాలు, సూచనలు ఉండాలి.

రాష్ట్రంలో పౌర గ్రంథాలయ విధానాన్ని చక్కదిద్ది మెరుగుపరచటానికి ఏ విధమైన కృషి ఉండాలి? పుస్తక సంకలనాలు, వాటి నిర్వహణలు ఏ విధంగా చేయాలి? వీటితో బాటు ఇతర అంశాలను గూర్చిన వ్యాసాలు ఈ సంపుటిలో అనుభవజ్ఞులు, శ్రీ పాండురంగారెడ్డి గారి మిత్రులు, అభిమానులు రాయటం ముదావహం. ఈ సంపుటి పౌర గ్రంథాలయాలకు మాత్రమే పరిమితం కాలేదు. గ్రంథాలయ శాస్త్ర సమాచార సంబంధమైన విచారణ కూడా ఇందున్నది.

ఈ చిరు పొత్తాన్ని శ్రీ పాండురంగారెడ్డి గారికి అభినందన కానుకగా అందించ గలిగినందులకు మేమెంతో సంతోషిస్తున్నాం. శ్రీ పాండురంగారెడ్డి గారు ఈ చిరుకానుకను అభిమానంతో, సాదరంగా గ్రహించినందుకు వారికి మా హృదయ పూర్వక అభివందనాలు. వారి కృషికి, తపస్సుకు, వారు చేసిన సేవలకు మా జోహార్లు.

**సంపాదకులు**

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy**
M.A., Ph.D., D.Litt
CHAIRMAN
**A.P. State Cultural Council**
**Govt of A. P.**
Kalabhavan, Hyderabad - 500 004.
Phone : (0) : 212832 (R) 248451

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి**
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్
అధ్యక్షులు
**ఆం.ప్ర. రాష్ట్ర సాంస్కృతిక మండలి**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు - 500 004
ఫోన్ : (ఆ) : 212832 (ఇ): 248451

# అభినందన

"గ్రంథాలయం మౌన విద్యాలయం" అని అన్నాను అప్పుడెప్పుడో. ఇప్పటికీ నేను గ్రంథాలయాశ్రితుణ్నే. రచయితలకూ, మేధావులకూ గ్రంథాలయాలు పెట్టే అక్షర భిక్షకు వెలకట్టలేం.

గ్రంథాలయ పాలనలో, గ్రంథాలయ సమాచార సమీకరణలో నా చిరకాల మిత్రుడు శ్రీ పాండురంగారెడ్డి నిర్వహించిన పాత్ర నిరుపమానమైంది. గ్రంథాలయోద్యోగిగా అన్ని దశల్లోనూ, అన్ని స్థలాల్లోనూ పాండురంగారెడ్డి తన సేవాంకిత వ్యక్తిత్వాన్ని ముద్రించి చూపాడు.

ఎస్. పాండురంగారెడ్డిని సత్కరించడానికి శ్రీ కోదాటి నారాయణరావు గారి అధ్యక్షతలో, డా॥ యం. శంకరరెడ్డి కార్యదర్శకత్వంలో ఒక అభినందన సంఘం ఏర్పడడం, ఆ సంఘం గ్రంథాలయ సంబంధి రచనలను సేకరించి "గ్రంథాలయ సమాచార విజ్ఞానం" అనే ఉత్తమ స్థాయి గ్రంథాన్ని వెలువరించడం అభినందనీయ విషయం.

**తేది : 18-06-1998** — **సినారె**

**ఆచార్య నాయని కృష్ణకుమారి**
ఎం.ఏ., పిహెచ్.డి.
ఉపాధ్యక్షులు

**పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**
లలితాకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాదు - 500 004

# శుభాభినందన

గ్రంథాలయ సమాచార విజ్ఞానం ఉపయోగకరమైన సంప్రదింపు గ్రంథం. గ్రంథాలయ విజ్ఞానంలో పారం చూచిన అయిదుగురు విజ్ఞులు సంకలనం చేసిన ఈ గ్రంథంలో విద్యార్థులకూ, విషయ గ్రహణంలో ఆసక్తి చూపించే పరిశోధకులకూ పనికి వచ్చే సమాచారం చాలా ఉంది.

గ్రంథాలయోద్యమాలు రాష్ట్రంలో తొలి నాటి నుండీ ఏర్పడిన గ్రంథాలయాల ఉనికి, అవి విజ్ఞాన వ్యాప్తికి చేసిన కృషి, పౌర గ్రంథాలయాలను నిర్వహించడంలో అనుసరించవలసిన మౌలిక సూత్రాలు, నిర్వహణలో ఉత్పన్నమయ్యే సమస్యలు, గ్రంథ సేకరణోద్యమం - ఇటువంటి ఎన్నో అంశాలపైన మౌలికమైన సమాచారాన్ని ఈ పుస్తకం అందిస్తున్నది.

అంతేకాక పుస్తకాల మీద, వాటి ఉపయోగం మీద, అనుభవ పూర్వకంగా లబ్ధప్రతిష్ఠులైన జిజ్ఞాసువులు వ్రాసిన వ్యాసాలు మన చేత హాయిగా చదివిస్తాయి.

రాష్ట్రంలోని వివిధ విశ్వవిద్యాలయాలలోని గ్రంథాలయ శాస్త్ర ఆచార్యులు తమ అనుభవాలను వ్యాసాల్లో పొదగడం హర్షించదగ్గ విషయం.

ఈ సంపుటిని గ్రంథాలయ సమాచార సేవలో తలపండిన శ్రీ ఎస్. పాండురంగారెడ్డి గారి అభినందన సంపుటిగా వెలువరించడం మెచ్చదగిన విషయం. ఈ ప్రయత్నాన్ని సఫలీకృతం చేసిన సంపాదకవర్గాన్ని పేరు పేరునా అభినందిస్తున్నాను.

తేది : 01-07-1998

**నాయని కృష్ణకుమారి**

జెల్లా మార్కండేయ
యం ఏ., యల్.యల్ బి
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషత్
స్టేట్ సెంట్రల్ లైబ్రరీ ఆవరణ,
అఫ్జల్‌గంజ్, హైదరాబాద్ - 500 012

ఫోన్స్ : ఆఫీసు : 4615652
4619127 ఎక్స్. 73
ఇంటి ఫోన్ : 32599 (నల్గొండ)
4048171 (హైదరాబాద్)
ఇ.నెం. 4-10-32/బి/2, శ్రీరాంనగర్
నల్గొండ - 508 001

# ఆప్తవాక్యం

శ్రీ పాండురంగారెడ్డిగారు స్నేహశీలి, నిరాడంబరుడు. వారి అభినందనోత్సవం సందర్భంగా "గ్రంథాలయ సమాచార విజ్ఞానం" అనే పుస్తకాన్ని ప్రచురించటం ఆనందదాయకం. శ్రీ రెడ్డి గారు గ్రంథాలయాల అభివృద్ధికి ఎనలేని కృషి చేశారు. ముఖ్యంగా, నగర గ్రంథాలయ సంస్థ పురోభివృద్ధికి పాటుపడిన వారిలో వీరు ముఖ్యులు.

ఎందరో మహానుభావులు! గ్రంథాలయ ఉద్యమానికి పునాదులు వేసిన ప్రముఖులను ఈ సందర్భంగా జ్ఞాపకం చేసుకోవటం సముచితమని భావిస్తున్నాను. కీ.శే. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు, కీ.శే. శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య గారి లాంటి పెద్దలు నిస్వార్థ సేవా భావంతో చేసిన నిర్విరామ కృషి ఫలితంగా వికసించిన గ్రంథాలయోద్యమం నేడు నిర్వీర్యమై, నిస్తేజంగా ఉంది. సేవా భావంతో పనిచేసే కార్యకర్తలు కరువయ్యారు. ఈ ఉద్యమాన్ని పునరుద్ధరించవలసిన అవసరం ఎంతయినా ఉంది.

ప్రతి గ్రామంలోనూ గ్రంథాలయాన్ని నెలకొల్పాలనే సదాశయాన్ని ఆశగానే మిగిల్చకుండా సఫలీకృతం చేయవలసిన సమయం ఆసన్నమైంది. విజ్ఞానాన్ని వ్యాప్తి చేయటంలో గ్రంథాలయాల ప్రాముఖ్యతను గుర్తించే విధంగా గ్రంథాలయ సంస్థలు కృషిచేయాలి. ముఖ్యంగా, ప్రభుత్వపరంగా గ్రాంటులు వచ్చినా, ఇతరత్రా కూడా వనరులను సమీకరించుకొని గ్రంథాలయాల పురోభివృద్ధికి గ్రంథాలయ సంస్థలు నడుం బిగించాలి.

గ్రంథాలయ శాస్త్ర రంగంలో వస్తున్న నూతన పరిణామాలను పునశ్చరణ తరగతుల ద్వారా గ్రంథాలయ సిబ్బందికి ఎప్పటికప్పుడు ఎరుకపరచి వారిలో నైపుణాన్ని, సేవాభావాన్ని పెంపొందించాలి. అలాగే మారిన, మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా ప్రతి గ్రంథపాలకుడూ తయారు కావాలి.

ప్రజలకు గరిష్ట స్థాయిలో ఉపయోగపడినప్పుడే గ్రంథాలయం సార్థకమవుతుంది. ప్రజలు తమకు ఒక గ్రంథాలయం చాలదనీ, మరికొన్ని గ్రంథాలయాలు కావాలనీ అడిగే విధంగా గ్రంథాలయాల నిర్వహణ ఉండాలి. ఈ ఆసక్తిని గ్రంథాలయ నిర్వాహకులు ప్రజలలో కలిగించాలి. ప్రతి సంవత్సరం గ్రంథాలయ వారోత్సవాలను, జయంత్యుత్సవాలను, పాఠకులతో సదస్సులను, సాహితీ సమావేశాలను, ఉపన్యాస కార్యక్రమాలను, కవి సమ్మేళనాలను ఏర్పాటు చేసి పాఠకులకు గ్రంథాలయాల పట్ల ఎక్కువ మక్కువ కలిగేలా చూడాలి.

గ్రామీణుల అవసరాలను దృష్టిలో ఉంచుకొని గ్రంథాలయాలను నిర్వహించవలసిన అవసరం ఎంతయినా ఉంది. ముఖ్యంగా వ్యవసాయ విజ్ఞానం, కోళ్ళపెంపకం, పశుసంపద, సమతులాహారం, అలాగే స్త్రీలకు ఉపయోగపడేవిధంగా పిల్లల పెంపకం - సంరక్షణ, నేటి యువత తమ భవిష్యత్తును తీర్చి దిద్దుకునేందుకు అవసరపడే సాహిత్యాన్ని, సమాచారాన్ని గ్రంథాలయాలు అందించాలి.

ప్రజల అవసరాలకనుగుణంగా గ్రంథాలయాలను పూర్తిస్థాయి తెలుగు విజ్ఞాన సమాచార కేంద్రాలుగా తీర్చిదిద్దటానికి ప్రభుత్వం కృషి చేస్తున్నది. దీనివల్ల చదువరులకు తమ ప్రాంతం/మండలం గురించి సమగ్ర సమాచారం తెలుసుకోవటానికి వీలు కలుగుతుంది. ఇందుకుగాను, గ్రంథాలయ స్థాయిలో 'రీడర్స్ ఫోరమ్'ను, గ్రంథాలయ అభివృద్ధికి చేపట్టవలసిన కార్యక్రమాల రూపకల్పనకు 'డెవలప్‌మెంట్ కమిటీ' లను నియమించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అలాగే రాష్ట్ర స్థాయిలో 'గ్రంథాల ఎంపిక కమిటీ' ఏర్పాటుకు రూపకల్పన చేయవలసి ఉంది.

ఈ గ్రంథంలో అనుభవజ్ఞులైన రచయితలు వివిధ అంశాలపై తమ అభిప్రాయాలను, అనుభవాలను విశదీకరించారు. గ్రంథాలయ చట్టం, నిర్వహణలోని లోటుపాట్లను సవరించటం, పుస్తక ఎంపికలో తీసుకోవలసిన జాగ్రత్తలు, ఆర్థిక వనరుల పెంపుదల వంటి పలు విషయాలపై ఆయా రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు గమనించదగినవి.

శ్రీ పాండు రంగారెడ్డిగారు గ్రంథాలయోద్యమానికి గ్రంథాలయాల పురోభివృద్ధికి చేసిన సేవలకు గుర్తింపుగా వారిని అభినందిస్తూ ఈ పుస్తకాన్ని విడుదల చేయటం ముదావహం. ఈ గ్రంథాన్ని వెలువరించటంలో కృషి చేసిన ప్రతి ఒక్కరిని అభినందిస్తున్నాను.

**- జెల్లా మార్కండేయ**

# గ్రంథాలయ సమాచార క్షేత్రంలో నిరంతర కృషీవలుడు శ్రీ ఎస్. పాండురంగారెడ్డిగారు

- డా॥ యం. శంకరరెడ్డి

శ్రీ పాండురంగారెడ్డి గారు సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన రైతు బిడ్డ. అకుంఠిత దీక్ష, దానికి కృషి తోడుకావటం వల్ల లక్ష్యాన్ని సాధించి అభివృద్ధిపథంలో నడిచారు. తల్లిదండ్రులు నేర్పిన మంచితనమే వారికి శ్రీరామరక్ష పలికింది. శ్రీ పాండు రంగారెడ్డి గారు **1937** సంవత్సరం నవంబరు 12వ తేదీన మహబూబ్‌నగర్ జిల్లా, మిడ్జిల్ గ్రామంలో శ్రీమతి భీమమ్మ, శ్రీ మల్లారెడ్డి దంపతులకు జన్మించారు. వారి స్వగ్రామం రంగారెడ్డి జిల్లా, శాయిరెడ్డి గూడెం అనబడే కుగ్రామం. వీరి ప్రాథమిక విద్యాభ్యాసం ఈ గ్రామంలోనే జరిగింది. **1948** సంవత్సరంలో చెలరేగిన కమ్యూనిస్టు ఉద్యమాలు, రజాకార్ల అల్లర్ల కారణంగా వీరి పెద్దలు హైదరాబాదుకు తరలి వచ్చారు. ఆ రోజుల్లో స్వగ్రామం శాయిరెడ్డి గూడెం తదితర ప్రాంతాల్లో నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన కమ్యూనిస్టు ఉద్యమకారులకు, వారికి సానుభూతి ప్రకటించి వత్తాసు పలికిన వారికి ప్రభుత్వ నిర్బంధాలు హింసలు ఎక్కువై కష్టాలు పడవలసి రావటంతో ఎన్నో కుటుంబాలు రక్షణ కోసం దూర ప్రాంతాలకు పోయాయి. అందులో రెడ్డి గారి కుటుంబ మొకటి. ఈ అల్లర్లు దురాగతాలు పూర్తిగా సమసిన తరువాతే ఆ కుటుంబాలు మళ్లీ తిరిగి వచ్చి గ్రామంలో స్థిరపడ్డాయి.

శ్రీ రెడ్డి గారు **1948 - 51** సంవత్సరం మధ్య కాలంలో పాత హైదరాబాదు శాలిబండ ప్రాంతంలోని రిఫాయమ్ ఉన్నత పాఠశాలలో 5వ తరగతి నుండి 7వ తరగతి వరకు విద్యనభ్యసించారు. ఆనాటి నిజాం పరిపాలనలో తెలంగాణ ప్రాంతంలోని అన్ని పాఠశాలల్లోను ప్రత్యేకంగా హైదరాబాదు నగర పాఠశాలల్లో విద్యా బోధన ఉర్దూభాషలో జరిగేది. అందువల్ల శ్రీ రెడ్డిగారు ఉర్దూ భాషను చక్కగా నేర్చుకున్నారు. వారు ఉర్దూ భాషలో మాట్లాడమేకాకుండా, చదవటం, వ్రాయటం సాగించడంవల్ల ఆ భాషలో మంచి ప్రావీణ్యం సంపాదించారు. ఆ తరువాత **1953-54**లో హైదరాబాదు నగరంలోని సిటి కాలేజిలో మెట్రిక్యులేషన్ వరకు చదువుకున్నారు. ప్రతిరోజు ఇంటి నుండి దాదాపు పదికిలోమీటర్ల దూరం నడిచి కాలేజికి వెళ్ళేవారు. మెట్రిక్ పాసైన తర్వాత వారు 1955- 59 మధ్య కాలంలో బద్రుకా కాలేజిలో బి.కాం. చదివారు. ఫైనల్ పరీక్షల ముందే తను పెట్టుకున్న దరఖాస్తు ఫలితంగా ఉద్యోగానికి

ఇంటర్వ్యూ జరిగి అధికారుల మెప్పు పొంది రంగారెడ్డి జిల్లా మేడ్చల్ తాలుకాలోని పౌర శాఖా గ్రంధాలయంలో మూడవ గ్రేడు గ్రంధపాలకుడుగా నియమితులయ్యారు. ఆ విధంగా శ్రీ రెడ్డి గారు 1959లో గ్రంధాలయ వృత్తిలో ప్రవేశించారు. గ్రంధాలయంలో పనిచేస్తూ తరువాత బి.కాం. పరీక్ష వ్రాసి పట్టం పుచ్చుకున్నారు. 1960లో వారిని సికిందరాబాదు గ్రంధాలయానికి బదిలిచేసి సర్టిఫికెట్ కోర్సు చేసే నిమిత్తం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి పంపించారు. సర్టిఫికెట్ కోర్సులో ఉత్తీర్ణులయ్యాక గ్రేడ్ -2 లైబ్రేరియన్‌గా ప్రమోషన్ లభించింది. 1961 - 62 సంవత్సరాల కాలంలో వారు గ్రంధాలయ శాస్త్రంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డిప్లొమా కోర్సు విజయవంతంగా పూర్తి చేశారు. గ్రంధాలయ వృత్తి శాస్త్రంలో అప్పట్లో అది అత్యున్నత పట్టం. ఫలితంగా గ్రంధపాలకుడిగా ప్రమోషన్ వచ్చి హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయానికి బదీలి అయ్యారు. ఇంతలో ఎం.ఏ (ఫీలాసఫీ) ప్రయివేటుగా చదివి పట్టం పొందారు. ఆ విధంగా వారు ఒక్కొక్క మెట్టే అధిగమిస్తు 1964లో నగర కేంద్ర గ్రంధాలయ (లోకల్ లైబ్రరీ అధారటీ) ముఖ్య గ్రంధ పాలకుడుగా నియమింపబడ్డారు. శ్రీ రెడ్డి గారు 1964 నుండి 1970 వరకు హైదరాబాదు నగర కేంద్ర గ్రంధాలయంలో పనిచేశారు.

శ్రీ రెడ్డి గారు గ్రంథాలయ అభివృద్ధికి ఎనలేని సేవలందించారు. వీరి హయాంలో నగర కేంద్ర గ్రంధాలయ నిర్వహణలో 1969 సంవత్సరంలో మొట్టమొదట సంచార గ్రంధాలయం ప్రారంభించబడింది. నగర కేంద్ర గ్రంథాలయపురోగతికి వీరు చేసిన సేవ మరువరానిది. ముఖ్యంగా కేంద్ర గ్రంధాలయానికి స్వంత భవనం ఉండాలన్న పట్టుదలతో ఎన్నో వ్యయప్రయాసల కోర్చి నగరం నడిబొడ్డున వున్న ఆశోక్‌నగర్‌లో మూడు ఎకరాల భూమిని సంపాదించి అప్పటి భారత రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి గారి చేత 1969లో భవన నిర్మాణానికి శంఖుస్థాపన చేయించటంలో సఫలీకృతులయ్యారు. వీరు హైదరాబాదు నగర గ్రంధాలయ కార్యదర్శిగా వున్న కాలాన్ని గుప్త రాజుల కాలంలోని స్వర్ణయుగంగా పేర్కొనవచ్చు. ఇప్పటి హైదరాబాదు - సికిందరాబాదు నగర గ్రంధాలయ సంస్థలో ఏర్పాటైన వంద శాఖా గ్రంధాలయాల్లో సుమారు 70 శాఖలు వీరి నిరంతర శ్రమ, గ్రంధాలయాలను ప్రజల వద్దకు తీసుకెళ్ళి సేవలందించాలన్న సత్ సంకల్పం ఫలితమే. దాదాపు 25 పురపాలక సంస్థ ఆధ్వర్యంలోని భవనాలను నామ మాత్రం అద్దె ఒప్పందంపై కుదుర్చగలిగారు. వీరి కృషి ఫలితంగానే నగరంలో మహిళల కోసం, పిల్లల కోసం ప్రత్యేకంగా నాలుగు గ్రంథాలయాలు వెలిశాయి. నూతన గ్రంధాలయంతోపాటు వాటి నిర్వహణకు, పాఠకులకు తగు సేవలందించే నిమిత్తం సిబ్బంది విషయమై ప్రభుత్వ మంజూరును ఎన్నో అడ్డంకుల నెదుర్కొని సాధించారు.

ఇప్పుడున్న సిబ్బందిలో అధిక శాతం వీరి హయాంలో నియమింపబడ్డ వారే. జంటనగరాలలో నూతన గ్రంధాలయాలను, సిబ్బందిని నియమించిన ఘనత శ్రీ రెడ్డిగారికే దక్కుతుందనడంలో అతిశయోక్తి లేదు.

ఆ తరువాత వీరు కరీంనగర్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, మరియు వరంగల్ జిల్లా గ్రంధాలయ సంస్థల్లో ముఖ్య గ్రంథపాలకుడుగా పనిచేశారు. వీరు కరీంనగర్‌లో వున్నకాలంలోనే జిల్లా గ్రంథాలయ స్వంత భవన నిర్మాణ కోసం అరెకరం భూమిని కొనుగోలు చేసి అప్పటి ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు గారిచేత భవన నిర్మాణానికి శంఖు స్థాపన చేయించారు. అంతేగాక మహబూబ్‌నగర్, రంగారెడ్డి మరియు వరంగల్ జిల్లాల్లో గ్రంధాలయాధికారిగా వున్నప్పుడు అక్కడ కూడా గ్రంథాలయాలకు భవన నిర్మాణం కోసం వీరు చేసిన కృషిని పలువురు ప్రముఖులు, మేధావులు ప్రశంసించటం జరిగింది. శ్రీ రెడ్డిగారు గ్రంధాలయాధికారిగా పని చేసిన ప్రతి చోట గ్రంధాలయాభివృద్ధికి ఎంతో పాటుబడ్డారు.

శ్రీ రెడ్డిగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. వీరి సేవలు గ్రంధాలయాభివృద్ధికే పరిమితం కాలేదు. సాహిత్యం, సంస్కృతి, వేదాంతం మొదలయిన రంగాల్లో కూడా సముచిత సేవలందించారు. ముఖ్యంగా యువ భారతి సాహితీ సంస్థ వ్యవస్థాపకుల్లో శ్రీ రెడ్డిగారు ఒకరు. యువభారతి నిర్వహిస్తున్న వివిధ కార్యక్రమాల వెనుక వీరి కృషి ఎంతగానో వుంది. ఈ సంస్థ నిర్వహణా బాధ్యతను సమర్థవంతంగా ఎంతో కాలం నిర్వహించారు.

అంతేగాక చిన్మయామిషన్‌లో గత మూడు దశాబ్దాలుగా శాశ్వత సభ్యులు. చురుకైన కార్యకర్తగా పేరు పొందారు. స్వామి చిన్మయానంద వేదాంత బోధనలను సామాన్య ప్రజల వద్దకు తీసుకెళ్ళడంలో వీరి అకుంఠిత దీక్ష కొనియాడదగినది. వీరు లయన్స్ క్లబ్ సికింద్రాబాదు విభాగంలో శాశ్వత సభ్యులు. శ్రీరెడ్డి గారి జీవితం తెరిచి ఉంచిన మంచి పుస్తకం. పుస్తకంలోని ప్రతి పేజీలోను వారి నిర్మల మనస్తత్వం, నిజాయితీ, అకుంఠిత దీక్ష, కృషి ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తాయి. వారు ఏ అధికారులకు గాని, రాజకీయ నాయకులకు గానీ వెరువని ధైర్యశాలి. తన అభిప్రాయాలను ధైర్యంగా కుండబ్రద్దలు కొట్టినట్టుగా చెప్పడంలో వారికి వారే సాటి. ఎదుటి వారి మెప్పు పొందడం కోసం, తాను నమ్మిన సిద్ధాంతాలు, ఆదర్శాలతో ఎప్పుడూ రాజీపడలేదు. ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రంధాలయాభివృద్ధికి శ్రీ రెడ్డిగారు కావించిన సేవలు చిరస్మరణీయం. శ్రీ రెడ్డి గారు **1986** నుండి **1988** వరకు గ్రంధాలయ శాస్త్రం మరియు ప్రలేఖన అకాడమీ (అకాడమి ఆఫ్ లైబ్రరీ సైన్స్ అండ్ డాక్యుమెంటేషన్) హైదరాబాదుకి అధ్యక్షులుగా పనిచేశారు. అకాడమీ అధ్యక్షులుగా వున్న రెండేళ్లలో వీరి శ్రమ ఫలితంగా అకాడమీ జీవిత సభ్యుల సంఖ్య ద్విగుణీకృతమైంది. అకాడమీ కార్యక్రమాలు

విరివి చెందాయి. అకాడమీకి స్వంత భవనంసంపాదించడం కోసం చాల పాటుబడ్డారు. కాని ఆర్థిక వనరుల లేమి మరియు ఇతర కారణాల వల్ల భవనాన్ని సమకూర్చడం సాధ్యం కాలేదు. ఈ ఆశయం ఇంకా సిద్ధించలేదు. అయినా ఆ బాధ్యత వీరి మీదే ఉంది. సిద్ధంచగలదని ఆశిద్దాం.

వీరు **1995** నవంబరు నెలలో పదవీ విరమణ చేశారు. అయితే వారి ధ్యేయాన్ని మాత్రం విరమించలేదు. పౌర గ్రంథాలయ నిర్వహణ, భవన నిర్మాణం, సేవా నిర్వహణల్లో వీరికున్న పరిజ్ఞానం అపారం. వీరి అనుభవాలు, పరిజ్ఞానం సర్వదా గ్రంథాలయ వృత్తి పాలకులకు, పౌర గ్రంథాలయ సిబ్బందికి అందించే ప్రయత్నాలు ముందు ముందు చేయగలగాలని, వారికి ఆయురారోగ్యాలు ప్రసాదించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

# 1.1 తెలంగాణాలో గ్రంథాలయోద్యమం

- కోదాటి నారాయణరావు

హైదరాబాద్ నగరంలో స్థాపించిన ప్రథమ తెలుగు గ్రంథాలయం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయమని చెప్పవచ్చు. ఈ గ్రంధాలయం స్థాపించటానికి పూర్వం ఒక సంస్కృత గ్రంథాలయం ఉండేది. అదే ఆ తర్వాత శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంగా రూపాంతరం చెందింది. ఇంకా లోతుగా పరిశీలిస్తే 19వ శతాబ్దం ఉత్తరార్థపు ఆరంభంలోనే సికిందరాబాదు లోని శంకరమఠంలో ఒక గ్రంథాలయాన్ని ముదిగొండ శంకరారాధ్యుల వారు స్థాపించారు. బహుశా ఈ గ్రంధాలయం శివ సాంప్రదాయానికి పరిమితమై ఉండి ఉంటుంది. ఇటీవలే శతాబ్ది ఉత్సవం జరుపుకొన్న భారత గుణవర్ధక సంస్థ శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి చాలా పూర్వమే స్థాపించబడినప్పటికి ఈ గ్రంధాలయంలో ఆనాటి తెలుగు పుస్తకాలు ఉన్నట్లు లేదు.

తెలంగాణా గ్రంథాలయోద్యమంలో 20వ శతాబ్దపు ప్రారంభం నుండి 1920 వరకు ఆంధ్ర భాషా నిలయ ఉద్యమం ఒక ఉద్యమ రూపంలో జరిగిందని చెప్పవచ్చు. హైదరాబాదు తర్వాత హనుమకొండలో రాజరాజనరేంద్ర ఆంధ్ర భాషా నిలయం, మట్టె వాడలో శబ్దాను శాసన ఆంధ్ర భాషా నిలయం, ఖమ్మంమెట్టులో జ్ఞాన విద్యుత్ప్రవాహినీ ఆంధ్ర భాషా నిలయం మొదలైన గ్రంధాలయాలు స్థాపించారు. తర్వాత 1918లో తెలంగాణా అంతటా చాలా గ్రంధాలయాలు నెలకొల్పారు. వాటికి కూడా పేరు చివర "ఆంధ్ర భాషా నిలయం" అనే పెట్టారు. ఉదాహరణకు గౌలిగూడెం చమన్ వద్ద యువకులు నెలకొల్పిన గ్రంధాలయానికి కూడా బాలసరస్వతి ఆంధ్ర భాషా నిలయం అనే పేరు పెట్టారు. 1918 తర్వాత క్రమేణా ఆంధ్ర భాషా నిలయోద్యమం సాధారణ గ్రంధనిలయోద్యమంగా రూపాంతరం చెందిందని చెప్పుకోవచ్చు.

గ్రంథాలయోద్యమ ప్రస్తావన వచ్చినప్పుడు మిగతా ఆంధ్ర ప్రాంతానికంటే తెలంగాణా గ్రంధాలయోద్యమం ఏ మాత్రం వెనుకబడి ఉండలేదు. అంతేకాదు, తెలంగాణా గ్రంథాలయోద్యమం ప్రభుత్వపు నిరంకుశ శాసనాలను తట్టుకొని క్రమేణా రాజకీయోద్యమానికి దారిని సులభం చేసింది. వెనుకబడిన ప్రాంతమైన నిజామాబాద్ జిల్లాలోని బాలకొండ అనే గ్రామంలో బాలయ్య అనే ఉపాధ్యాయుడు సెలవు రోజుల్లో ఎడ్లబండి మీద సంచార గ్రంథాలయాన్ని నిర్వహించాడంటే ఆనాటికి కార్యకర్తల ఊహాపోహాలను మనం అర్థం చేసుకోవచ్చు. ఈ గ్రంథాలయోద్యమం ప్రభుత్వ కోపాగ్నికి గురియై కార్యకర్తలు శిక్షకు

పాత్రులైనారు. ఉదాహరణలు కూడా లేకపోలేదు. అయినప్పటికీ తెలంగాణాలో 600 గ్రంథాలయాలు సక్రమంగా పనిచేసినట్లు రుజువులు లభించినవి.

తెలంగాణాలోని గ్రంథాలయోద్యమంలో నాజీవితం పెనవేసుకొని పోయిందని చెప్పవచ్చు. చాలా బాల్యం నుండే నాకు గ్రంథాలయంతో సంబంధం ఏర్పడింది. మా గ్రామంలో **1918**లోనే గ్రంథాలయాన్ని స్థాపించారు. అనేక రూపాంతరాలు చెంది ఆ గ్రంథాలయం ప్రజా సేవారంగంలో నిలబడింది. తర్వాత చదువు నిమిత్తం సూర్యాపేటకు వచ్చాను. సూర్యాపేటలో అడుగుపెట్టిన నాటి నుండి స్థానిక గ్రంథాలయం ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథాలయంతో సంబంధం కలిగి ఉన్నాను. ఆ గ్రంథాలయ అభివృద్ధికై శక్తివంచన లేకుండా పాటుపడ్డాను. విశాలమైన స్థలంలో, స్వంత భవనంలో, జిల్లా గ్రంథాలయ సంస్థ శాఖా గ్రంథాలయంగా ఈనాడది దినదినాభివృద్ధి చెందింది. తర్వాత హైదరాబాదు నగరానికి విద్యాభ్యాసం నిమిత్తం వచ్చాను. హైదరాబాదు విడిచివెళ్ళే వరకు బాల సరస్వతి ఆంధ్ర భాషా నిలయం అభివృద్ధికి సేవ చేశాను. తర్వాత ఖమ్మంలో "విజ్ఞాన నికేతనం" స్థాపన చేయటం జరిగింది. ఆ గ్రంథాలయానికి యావదాంధ్ర ప్రాశస్త్యం లభించటమే గాక ఈనాటికీ చక్కగా ప్రజా సేవ చేస్తున్నది. వాస్తవానికి, గ్రంథాలయాలతో సంబంధమే కాకుండా గ్రంథాలయాలకు ఒక ఉద్యమరూపాన్ని ఇవ్వటానికి కూడా చాలా కృషి చేశాను. ఖమ్మం, మధిర తాలూకాల్లోని గ్రామాల్లో సుమారు 25 గ్రంథాలయాలు స్థాపించాను. ఈ గ్రంథాలయోద్యమం ఆధారంగానే తెలంగాణాలో నేను రాజకీయోద్యమాన్ని పురోగమింప జేశాను. మొట్టమొదటి సారిగా ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలు కీర్తిశేషులైన బూర్గుల రామకృష్ణారావు గారి అధ్యక్షతన సింగరేణి కాలరీస్‌లో జరిపాము. దానికి యావదాంధ్రదేశం నుండి సుప్రసిద్ధ నాయకులు వచ్చారు. విశాలాంధ్ర అవతరణకు పునాది అక్కడే పడిందని చెప్పవచ్చు. 26వ మహాసభ మహబూబ్‌నగర్ జిల్లా క్యాతూరులో జరిపాము. దీనికి కూడా అఖిలాంధ్ర నాయకులు వచ్చేశారు. "పోలీస్ చర్య" తర్వాత 27వ మహాసభ దిగ్విజయంగా సూర్యాపేటలో జరిగింది. ఈ విధంగా అనేక మహాసభలు తెలంగాణాలో నిర్వహించాము. ఒక్కొక్క మహాసభకు ఒక్కో ప్రత్యేకత ఉంది. జనగాంలో జరిగిన మహాసభలో ఆహ్వాన సంఘం అధ్యక్షులు అప్పటి నల్లగొండ జిల్లా కలెక్టరు కీ॥శే॥ పర్సా వెంకటేశ్వరరావు గారు. వారు తమ స్వాగతోపన్యాసంలో విశాలాంధ్ర త్వరలో ఏర్పడాలని తమ ఆకాంక్షను వెలిబుచ్చారు. సభ ప్రారంభకులు డా॥ మర్రి చెన్నారెడ్డి గారు. వారు అప్పటికే మంత్రికూడాను. ఇటువంటి సన్నివేశాలు అనేకం జరిగాయి. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే తెలంగాణా పురోభివృద్ధికి గ్రంథాలయోద్యమం ఏ విధంగా పాటుపడిందో తెలుపవలసిన ఆవశ్యకత ఈనాడు కనబడుతున్నది. ఆ ఉద్యమ అభ్యుదయానికి నా వంటి కార్యకర్తలు అనేకమంది

పాటుపడినప్పటికీ నా సేవ కూడా అల్పమైంది కాదని విన్నవిస్తున్నాను. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం హైదరాబాదు రాష్ట్రంలో గ్రంథాలయ శాసనం చేయబడింది. దీనికి ఎక్కువగా శ్రమ పడినవారు కీర్తిశేషులైన ఎస్.ఆర్. రంగనాథన్ గారి శిష్యుడైన ఉజ్లంబీకర్ గారు. ఆ శాసనం ప్రకారం ఏర్పడిన రాష్ట్ర సలహా కమిటీలో నేను కూడా సభ్యునిగా ఉన్నాను. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాత అప్పటికి ఆచరణలో ఉన్న మదరాసు గ్రంథాలయ చట్టాన్ని హైదరాబాదు గ్రంధాలయ శాసనానికి మిళితం చేసి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ శాసనాన్ని **1960** లో ఏర్పాటు చేశారు. ఆ శాసనం ఏర్పాటులో ఆనాటి గ్రంథాలయ సేవకులమైన మా పాత్ర చాలా ఉంది. ఆ శాసనం ప్రకారం ఏర్పడిన హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీకి సోదర కార్యకర్తల ప్రోత్సాహంతో ప్రథమ అధ్యక్షుడిగా నేనే ఉండటం తటస్థించింది.

ఆ కాలంలోనే మిత్రుడు శ్రీ ఎస్. పాండురంగారెడ్డి సికిందరాబాదు నగర కేంద్ర గ్రంథాలయంలో గ్రంధభాండాగారిగా పనిచేస్తున్నట్లు జ్ఞాపకం. అప్పుడు లోకల్ లైబ్రరీ అధారిటీలో పనిచేసే కార్యకర్తలను మార్చే అధికారం అధ్యక్షుడికే ఉండేది. కొన్ని కారణాల వల్ల హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయ గ్రంథ భాండాగారిని సికిందరాబాదుకు మార్చి, సికిందరాబాదులో పనిచేస్తున్న మిత్రుడు శ్రీ ఎస్. పాండురంగారెడ్డిని హైదరాబాదుకు మార్పు చేయవలసి వచ్చింది. అప్పటి నుండి ఆయనతో పరిచయం ప్రారంభమైంది. ప్రారంభపు రోజులు కాబట్టి గ్రంథాలయ అభివృద్ధికి, నగరాలలో గ్రంథాలయాల వ్యాప్తికి చాలా కష్టపడవలసి వచ్చింది. ఈ కృషిలో పాండురంగారెడ్డి తోడ్పాటు చాలా లభించింది. ఉద్యమం పట్ల ఆయనకు చాలా ఆసక్తి ఉండేది. కేవలం గ్రంథాలయ శాస్త్రాభ్యాసం మాత్రమేగాక ఆంధ్ర సాహిత్యం పట్ల కూడా ఆయనకు చాలా అభిరుచి ఉండేది. యువ భారతి సంస్థలో ఈయన ప్రముఖ సభ్యుడిగా ఉండేవాడు.

ఆ తర్వాత కీ॥శే॥ దేవులపల్లి రామానుజరావు గారు, వారి తర్వాత శ్రీ మామిడి భోజిరెడ్డి అధ్యక్షులుగా ఉన్నారు. ఎవరు అధ్యక్షులుగా ఉన్నా పాండురంగారెడ్డి కర్తవ్య నిర్వహణ యధారీతిగా కొనసాగింది. ఈ కాలంలోనూ నేను సభ్యుడిగా ఉన్నాను కాబట్టి ఆయన విధి నిర్వహణ నాకు బాగా తెలుసు.

శ్రీ పాండురంగారెడ్డి నగర కేంద్ర గ్రంధాలయం నుండి రంగారెడ్డి, వరంగల్లు, మెదక్ మొదలైన జిల్లాల్లో కూడా వెళ్లి పనిచేశారు. ఎక్కడికి వెళ్లినా గ్రంధాలయ అభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషి చేశారు. ఈనాడు ఆయన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ చీఫ్ లైబ్రేరియన్‌గా పదవీ విరమణ చేసినా గ్రంథాలయోద్యమం పట్ల ఆయన శ్రద్ధాసక్తులు సన్నగిల్లలేదని అనుకుంటాను. ఉద్యోగరీత్యా ఆయన ఈనాడు గ్రంథాభాండాగారి కాకున్నా ఉద్యమ అభివృద్ధికి గ్రంధాలయ సేవకుడిగా సముచితమైన పాత్రను నిర్వహిస్తాడని నా విశ్వాసం.

## 1.2 తెలంగాణాలో తెలుగు సంస్కృతిని పరిరక్షించిన

# పౌర గ్రంథాలయోద్యమం

**- డా॥ వెలగా వెంకటప్పయ్య**

భారత జాతీయోద్యమంలో భాగంగా ఆంధ్ర ప్రాంతంలో గ్రంధాలయోద్యమం ప్రారంభం అయితే తెలంగాణా ప్రాంతంలో తెలుగువారి ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకోడానికీ, తెలుగు సంస్కృతిని పరిరక్షించుకోడానికీ గ్రంధాలయోద్యమం నడుం కట్టింది. నిజాం పరిపాలనా కాలంలో తెలుగు భాష, తెలుగు సంస్కృతి క్రమంగా కొడిగట్టింది. "ప్రజా ఉద్యమాలు, ప్రజాసంస్థలూ ఆవిర్భవించుకుండానూ, ఆవిర్భవిస్తే ఆరంభంలో అణచివేయడానికి బ్రిటిషు ప్రభుత్వాన్ని మించిన నిరంకుశ నైజాము ప్రభుత్వం దమననీతిని ఉపయోగించేది. నలుగురు ఒకచోట కూర్చి గ్రంథాలయ రూపాన్ని సంతరించుకోడానికి సయితం ప్రభుత్వ అనుమతి అవసరమయ్యేది. సాహిత్య ప్రయోజనాల ధ్యేయాన్నీ ప్రధానంగా పేర్కొని ప్రభుత్వానుమతితో గ్రంథాలయాలను అనేకచోట్ల ఆనాటి జాతీయోద్యమ నాయకులు నెలకొల్పారు. అయితే సామాన్య ప్రజానీకంలో జాతీయ భాషలను జాగృత పరచి, వారిని దేశభక్తులుగా తయారు చేయడంలో ఈ గ్రంధాలయాలు కార్ఖానాల్లా పనిచేసినవి.[1]

## భాషాప్రచార నిలయాలుగా గ్రంథాలయాలు

ఈ శతాబ్ది తొలిపాదంలోనే ప్రజల ప్రోత్సాహంతో స్వచ్ఛందంగా పౌరగ్రంధాలయాలు ప్రారంభం అయ్యాయి. ఇలా ఏర్పడిన వాటిలో 1901లో స్థాపించిన శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం తొలి గ్రంధాలయం. ఆ తరవాత ఇదే వరుసలో హానగల్లులో ప్రతాపరుద్ర ఆంధ్ర భాషానిలయం, నాంపల్లిలో వేమన ఆంధ్రభాషా నిలయం, వరంగల్లులో రాజరాజనరేంద్ర ఆంధ్ర భాషానిలయం, గౌలీగూడ చమన్‌లో బాలసరస్వతీ ఆంధ్ర భాషా నిలయం నన్నూరులో ఆంధ్ర గ్రంథాలయం మొదలయినవి స్థాపించడం జరిగింది. ఈ గ్రంధాలయాల పేర్లలో ఆంధ్రభాషా నిలయం అనే పదాలుండడం - దీని వెనుక గల ప్రధాన ఉద్దేశాన్ని గమనించవచ్చు.

ఇలాగే కరీంనగర్ జిల్లా సిరిసిల్ల గ్రామంలో నారీ యాంధ్ర భాషా నిలయం స్థాపించినపుడు అచటి తాసిల్దారు సర్కారు వారి దస్తరములలో వ్యవహారమంతా ఉర్దూలో జరుగుతూ ఉండగా చచ్చిపోయిన తెలుగును బయటికి గుంజవలసిన పని లేదు.[2] అని అంటారు దాదాపు ఇదే పరిస్థితి మిగతా ప్రాంతాలలో కొనసాగుతూ ఉంది.

## ఆంధ్ర జనసంఘ చేయూత

తెలంగాణా ప్రాంతంలో తెలుగువారు ఎదుర్కొంటున్న దుర్భర పరిస్థితులను - ఒక సంస్థాపరంగా వ్యవస్థితమైన కృషిసల్పే నిమిత్తం మాడపాటి హనుమంతరావు, ముందుముల నరసింహారావు, ఆదిరాజు వీరభద్రరావు, కొండా వెంకట రంగారెడ్డి, బూర్గుల రామకృష్ణరావు మొ॥ తొలితరం పెద్దలు 1921 నవంబరు 12వ తేదీన ఆంధ్ర జన సంఘాన్ని ప్రారంభించారు. తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రలో ఇది సువర్ణాక్షరాలతో లిఖించ దగిన పర్వదినం. ఈ సంఘ ఉద్దేశాలు ఇలా ఉన్నాయి.

1. గ్రంధాలయాలను, పఠన మందిరాలను, పాఠశాలలను స్థాపించడం.
2. తాళపత్ర గ్రంధాలను, శాసనాల ప్రతులను సంపాదించడం, పరిశోధనలు సాగించడం
3. కరపత్రాల ద్వారా, లఘుపుస్తకాల ద్వారా కనీస విజ్ఞానాన్ని వ్యాపింప జేయడం
4. ఆంధ్ర భాషా ప్రచారాలకు కావలసిన పయత్నాలు జరపడం.
5. విద్వాంసులను గౌరవించడం -

ఈ ఉద్దేశాల ప్రకారం తెలంగాణాలో ఆంధ్రోద్యమం కొత్త చివుళ్ళు వేసింది. ఆంధ్రోద్యమంలో ఒక భాగంగా గ్రంధాలయాల స్థాపనను గురించి మాడపాటి హనుమంతరావు గారు ఇలా వివరిస్తారు.

“నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమమున గ్రంధాలయ వాచనాలయముల స్థాపనము ప్రధానస్థలము నాక్రమించెనను సంగతి తెలంగాణము వారందరికి తెలిసినదియే. దీనికి కారణము లేకపోలేదు. ఆంధ్రోద్యమము ముఖ్యోద్దేశ్యము నిజాం రాష్ట్రములోని ఆంధ్రుల యందు పరస్పర సానుభూతి కలిగించి వారి యభివృద్ధికై ప్రయత్నించుటయని మొదటి నుండియే విశాలముగా నిర్వచించబడియు, కార్యకర్తలకు గ్రంధాలయములే ప్రధాన సాధనములగుట ఏలయని ఎవరికైన సంశయము తోచవచ్చును. అప్పటి స్థితిగతులను స్మృతి పథములోనికి తెచ్చుకొన్నగాని సంశయము వీడి పోజాలదు. ఆ కాలమున సంఘ సంస్కార విషయముల ప్రచారమూ ఇక్కడి జన సామాన్యమునకు రుచించునదిగా నుండలేదు. మీదు మిక్కిలి విరోధము కలిగించగలిగియుండెను. రాజకీయ విషయముల ప్రచారము ప్రభుత్వము వారితో పోరాటం దెచ్చునది. మత విషయికములో ప్రభుత్వాధికారుల అనుమానమునకును దారితీయును కనుక తెలంగాణా ప్రజలందు ముఖ్యంగా గ్రామీణులందు అభిప్రాయ భేదములకును తావీయక అందరి యామోదమునకును, అందరి యభిమానమునకును మార్గమేర్పరచు ఉద్యమం మాతృభాషా విషయమేయనియు, అందుకు చాల వెనుక బడియున్న

తెలంగాణా వాసులగు ఆంధ్ర యువకులకు సులభముగా బోధపడు నిర్మాణ కార్యక్రమ మేదియా యని ఆలోచించగా గ్రంథాలయోద్యమమే యనియు, అప్పటి కార్యకర్తలకు స్ఫురించినదేమో అని ఊహించుచున్నాను.[3]

దీనిని గమనించి తెలంగాణాలో ఆంధ్ర జన సంఘం గ్రంథాలయాల స్థాపనను బాగా ప్రోత్సహించింది. 1925 నాటికి ఈ గ్రంథాలయాల సంఖ్య నూరుకు పైగా పెరిగింది. యువకులలో ఉత్సాహం ఉరకలు వేయించింది. "ప్రభుత్వ ప్రమేయం లేకుండా పైపెచ్చు ప్రభుత్వం కల్పించే అవరోధాలను ఎదుర్కొంటూ ప్రజలు తమ అభిమాన ఉద్యమంగా తమకు తామై సాగించిన ఆంధ్రుల గ్రంథాలయోద్యమం ఒక విధంగా చూస్తే ప్రభుత్వం అర్థ బలంతోను, దండనాభయంతోను వ్యాపింప చూచిన గ్రంథాలయోద్యమాలకంటే కూడ ఐచ్ఛికంగా ప్రజలు వ్యాప్తి చేసుకున్న గ్రంథాలయోద్యమము సజీవమై చైతన్యయుతమై స్వాతంత్ర్య ఉద్యమంలో కూడా ప్రధాన భూమిక ధరించింది. భారతదేశంలో అపురూప దృష్టాంతరమైన ఈ మహోద్యమంలో తెలంగాణా ప్రముఖ పాత్ర కాదు. ప్రముఖతర పాత్ర నిర్వహించింది"[4]

ఐనప్పటికీ ఈ గ్రంథాలయాలు తెలుగు వారి సంప్రదింపులకు, సభలు సమావేశాలు బహిరంగంగా, కొన్ని సందర్భాలలో రహస్యంగా నిర్వహించు కోడానికి గ్రంథాలయాలు బాగా తోడ్పడ్డాయి. ఈ తరుణంలో రాష్ట్రం నలుమూలలా ఏర్పాటౌతున్న గ్రంథాలయాల తాలూకు కార్యకర్తల కృషిలో సమన్వయం సమకూర్చేందుకు, సేవాభావం పెంచేందుకు తొలిసారిగా తెలంగాణా ప్రాంతంలో మహాసభ ఏర్పాటయింది.

## తొలి మహాసభ

తెలంగాణా ప్రాంతంలో గ్రంథాలయాల పని తీరును సమీక్షించి, వాటిని మెరుగు పరచేందుకు, ఉద్యమ దిశగా గ్రంథాలయాలను మళ్ళించేందుకు 1925 ఫిబ్రవరి 22 వతేదీన ఖమ్మం జిల్లా మధిరలో నిజాంరాష్ట్ర ఆంధ్ర జన సంఘ సమావేశంతో బాటు ప్రథమ నిజాం రాష్ట్రాంధ్ర గ్రంథాలయ మహాసభ జరిగింది. ఈ మహాసభకు పింగిలి వెంకట్రామారెడ్డి అధ్యక్షత వహించారు. ఈ సభకు నూరుమంది ప్రతినిధులు హాజరయ్యారు. శ్రీధర్ వామన్ నాయక్, ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు, అఖిలభారత పౌర గ్రంథాలయ సంఘ కార్యదర్శి సూరి వెంకటనరసింహంగారు ఈ మహాసభలో ప్రముఖపాత్ర నిర్వహించారు. ఈ మహాసభ తెలంగాణా ప్రాంతంలో గ్రంథాలయ ప్రచారాలకు విశేషంగా తోడ్పడింది. ఈ మహాసభ నిజాం రాష్ట్రంలో ప్రత్యేకంగా గ్రంథాలయ సంఘ అవసరాన్ని గమనించింది.

## చారిత్రాత్మకమైన రెండవ సభ

ఆంధ్ర జన కేంద్ర సంఘం తమ చతుర్ధ సమావేశంతో బాటు రెండవ నిజాం రాష్ట్రాంధ్ర గ్రంధాలయ మహాసభ, యువక సభ, సంఘ సంస్కార సభ మొదలైన సభలను నల్గొండ జిల్లా సూర్యా పేటలో నిర్వహించడానికి ఏర్పాట్లు జరిగాయి. గ్రంథాలయ సభలు, గ్రంథాలయాలు విప్లవ కేంద్రాలుగా నివురు గప్పిన నిప్పులా పని చేస్తున్నాయని నిజాం ప్రభుత్వం గమనించి ఈ మహాసభలను నిషేధించింది.

"1335 ఫసలీలో సూర్యాపేటలో జరుగ వలసిన ఆంధ్ర జనకేంద్ర సంఘ సమావేశము ద్వితీయ గ్రంధాలయ మహాసభ, నల్గొండలో జరగవలసిన మరికొన్ని సభలు జరుగకుండ ప్రభుత్వం నిషేధించింది. నిషేధించటానికి కారణం రాజకీయ ఫలితాలు కలుగగలవనే అనుమానం ప్రభుత్వానికి కలుగటమే. అందుపై సభా నిర్వహకులు ఫర్మాను ప్రకారం రాజకీయ ఫలితాలు కలుగ గలవనే ఊహించి సభల నాపగల అధికారం ప్రభుత్వానికి లేదని హైకోర్టులో వ్యాజ్యం వేసి గెలిచారు. 1337 వఫసలీలో భగీరథ ప్రయత్నంతో సూర్యాపేటలో తిరిగి సభలు జరిగినవి. అదే సందర్భంలో దేశభక్త వామన నాయక్ అధ్యక్షతన రెండవ గ్రంధాలయ మహాసభ జరిగింది."[5]

ఈసభ పలు తీర్మానాలు చేసి నిజాం ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చింది. ఆనాటి పరిస్థితిని అవగాహన చేసుకునేందుకు మచ్చుకు కొన్ని తీర్మానాలను ఈ దిగువ జత పరుస్తున్నాను.

1. గ్రంధాలయముపైన సర్కారి నిగరాని ఉంచవలయునని ప్రభుత్వము వారు జారీ చేసిన గస్తీనిషాన్ 22 వాక్కే 23 అబాక్ 1330ఫసలియును, దానిలో ఉల్లేఖింపబడిన గస్తీని × వాక్కే 16 దై 1321 ఫసలియును గ్రంథాలయోద్యమాభివృద్ధికి భంగకరములుగా నున్నవి కనుక పై గస్తీలను గ్రంథాలయములకు సంబంధించిన వరకు రద్దు చేయుటకీ సభ వారు మహాఘనత వహించిన నిజాము ప్రభుత్వము వారిని వినయ పూర్వకముగా ప్రార్థించుచున్నారు.
2. ప్రజలయందు విజ్ఞాన ప్రసారమునకై ప్రభుత్వము యొక్క వివిధ శాఖల వారిచే ప్రకటింపబడుచున్న నివేదికలను, ఇతర ప్రచురణములను గ్రంధాలయములకు ఉచితముగా నందజేయు నేర్పాటు చేయుటకీ సభవారు ప్రభుత్వము వారిని ప్రార్థించుచున్నారు.
3. హైదరాబాదులో నున్న స్టేటు లైబ్రరీ (ప్రభుత్వము వారి గ్రంథాలయము)లో సంస్కృతాంధ్ర మహారాష్ట్ర కర్నాటక గ్రంధములు గూడ నుంచుట కేర్పాటు

చేయవలయునని ప్రభుత్వము వారిని ఈ సభవారు వినయ పూర్వకముగ ప్రార్థించుచున్నారు.

4. హైదరాబాదులో నున్న స్టేటు లైబ్రరీ ప్రభుత్వము వారి గ్రంధాలయము సెలవులయందు మూయబడుట వలన గ్రంథ పఠనాభిలాషులకు తగినంత లాభము కలుగు కుండుటచే నీ సభవారు సెలవుల యందు కూడ గ్రంథాలయమును తెరచియుంచుట కేర్పాటు చేయగలందులకు ప్రభుత్వము వారిని ప్రార్థించుచున్నారు.
5. చారిత్రక పరిశోధనకుపయోగపడుటకై శాసనముల ప్రతులను అముద్రిత గ్రంధములను సేకరించి ఆంధ్ర పరిశోధక సంఘము (హైదరాబాదు) వారికి పంపుటకీ సభవారు గ్రంధాలయ కార్య నిర్వాహకులను ప్రార్థించుచున్నారు.[6]

చివరి తీర్మానాను సారం సేకరించి తాళ పత్రాలు, శాసనాలతో హైదరాబాదులో లక్ష్మణ రాయ పరిశోధక మండలి ఏర్పడింది. ఈ తీర్మానాలన్నీ ప్రభుత్వానికి పంపాము. ప్రభుత్వనిరంకుశ ధోరణి వలన వీటిని ఖాతరు చేయలేదు. పైపెచ్చు గ్రంథాలయాలపై నిఘా పెంచింది.

## జరగని మూడవ మహాసభ

మధిర, సూర్యాపేటలో జరిగిన గ్రంధాలయ మహాసభలు యువకులలో నూతనోత్తేజం పరవళ్ళు తొక్కించింది. పలు నూతన గ్రంధాలయాల స్థాపనకు ప్రేరేపించింది. క్రమంగా గ్రంథాలయాల పెరుగుదల, ప్రజలలో కలుగుతున్న చైతన్యం, ఆంధ్ర సంస్కృతి పట్ల ఆసక్తి, తెలుగు పండుగల ఎడ అభిమానం - నిజాం ప్రభుత్వానికి కనుగుట్టింది. ఈ వాతావరణానికి మరింత దన్ను ఇచ్చేందుకు మూడవ నిజాం రాష్ట్రాంధ్ర గ్రంథాలయ మహాసభను ఖమ్మంలో జరిపేందుకు మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణరావుగారలు నిజాంప్రభుత్వ పోలీసు మంత్రి కర్నల్ ట్రెంచి వద్దకు వెళ్ళినపుడు అంతకు ముందు 1931లో దేవరకొండలో జరిగిన ఆంధ్ర మహాసభపై అనేక అక్షేపణలు లేవదీశారు. అందుకు బూర్గులవారు "మా ఉద్యమం కేవలం రాజకీయేతరమైనది. విశేషంగా గ్రంధాలయాల మూలంగా విజ్ఞానం వ్యాపింపజేసే ఉద్యమం" అని నచ్చజెప్ప ప్రయత్నించారు. అపుడు అక్కడ ట్రెంచ్‌తోపాటు ఆశీనులైయున్న పోలీసు ఇనస్పెక్టర్ జనరల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అనే విదేశీయుడు "గ్రంధాలయోద్యమం అంటే ఏమిటో నాకు బెంగాలులో మంచి అనుభవం కలిగింది. గ్రంథాలయాలంటే విప్లవ సంఘాలు అంతే, మరేమీ కావు" అన్నాడు. దాదాపు ఇదే వైఖరిని నిజాం ప్రభుత్వం ప్రదర్శించింది. దీన్ని సుప్రసిద్ధ గ్రంధాలయ కార్యకర్తలు శేషాద్రి రమణకవులు ఈ తీరుగా

వివరించారు. "ప్రభుత్వం వారు గ్రంథనిలయములపై అనుమాన దృష్టి ప్రసరించుచున్నారు. భాషా సంస్థలగు గ్రంథనిలయములు రక్షకభటుల నిగురానా క్రిందికి వచ్చుచున్నవి. భాషా విషయకమగు వార్షికోత్సవాలు జరిగెనా! విచ్చుకత్తులతో పోలీసులు సిద్ధం. కొన్ని గ్రంథాలయములను వార్షికోత్సవములను పోలీసు మారు మాన్పించిరి." ఈ పరిస్థితిని సమీక్షించి నిజాం ప్రభుత్వం స్వాతంత్ర్య నిరోధకపు ఫర్మానా గస్తీ నిషాన్-53 అమలు పరచింది. ఇందు వలన కొత్త గ్రంథాలయాలు ప్రారంభించరాదు. గ్రంథాలయ సభలు, వార్షికోత్సవాలు నిర్వహించరాదు. తాలంఖానాలు మూసేయాలి. ఈ ఫర్మానా ఆంధ్రుల ఆత్మ గౌరవాన్ని గాయ పరచింది. సంస్కృతీ వికాసానికి ప్రతి బంధకం అయింది.

## మాడపాటి రాయబారం

ఆంధ్రుల స్వేచ్ఛను దెబ్బతీసే ఈ ఫర్మానాను రద్దు చేయాలని ఆంధ్ర జన కేంద్ర సంఘం తరపున కార్యదర్శి మాడపాటి హనుమంతరావు నిజాం రక్షణ శాఖా మంత్రికి స్వయంగా విన్న వించారు.

"మహాఘనత వహించిన నిజాము ప్రభుత్వము వారు మా రాయబారము యొక్క రాక నంగీకరించి ప్రజలకు గల కష్టములను తెలిసికొనుటకై తమ సంసిద్ధతను చూపినందుకు రాయబారము యొక్క సభాసదులమగు మేము మనవి పూర్వకముగా కృతజ్ఞులమైయున్నాము.

మేము తమ వద్దకు గస్తీనిషాన్ - 53 తా॥ 17 దై 1339ను గురించి మనవి చేయుటకై వచ్చియున్నాము. ఈ గస్తీ మ, ఘ. వ నిజాము ప్రభుత్వం వారి యొక్క ప్రజలకు వారి జన్మ సిద్ధమగు వాక్స్వాతంత్ర్యమును నిరాకరించుచున్నది. యదార్ధమేమనగా ఈ స్వాతంత్ర్యము దేశమునందైనను సరే ప్రజలయొక్క నైసర్గికములగు హక్కులలో నొకటియని ప్రపంచములోని ప్రతినాగరిక ప్రభుత్వమును అంగీకరించి యున్నది. నిజాము ప్రభుత్వము వారు కూడ ప్రజలకీ హక్కు గలదని అంగీకరించియే యుండిరి. 11 మొహర్రరు 1340 హ.జి. (9 ఆబాక్ 1330 ఫ) నాటి ఫర్మాను జారీ అగువర్కు రాష్ట్రపు ప్రజలు ఈ హక్కును నిరాటంకముగా అనుభవించుచునే యుండిరి. ఈ ఫర్మానైనను అన్ని విధములగు బహిరంగ సభల విషయమున నిర్బంధముల గల్పించియుండలేదు. సాంఘిక మత విద్యా విషయాది ఇతర సభలతోను ఆ ఫర్మానున కెట్టి జోక్యము లేకుండెను. కాని ప్రస్తుతపు గస్తీ - 53 బహిరంగ సభ యెట్టిదైనను సరే దానికి ప్రభుత్వాంగీకారము తప్పక కావలయును. ఈ గస్తీ నైసర్గిక హక్కులలో నొకటియగు వాక్స్వాతంత్ర్యమును ఈ రాష్ట్రపు ప్రజలకు లేకుండ జేసినది. ఇట్టి హక్కు ఈ దేశపు ప్రజలకు లేకుండ జేసినది. ఇట్టి హక్కు ఈ దేశపు ప్రజలలోని ప్రతి వ్యక్తికి

కలదని మన ప్రభువుగారి ఉన్నత న్యాయస్థానము (హైకోర్టు) వారు ఒక ప్రక్కన తీర్మానించి యుండగా (దక్కనులారి పోర్టు : నం. 21 పుట 305 ప్రభుత్వం షముద్దీను అనువభియోగము) వేరొక ప్రక్కన మన ప్రభుత్వము వారే ఈ గస్తీ ద్వారా ఈ హక్కును నిరాకరించుచున్నారు."[7] ఈ రాయబారాన్ని నిజాం ప్రభుత్వం ఖాతరు చేయలేదు. ఈ ఫర్మానా దుష్ప్రభావం వలన పలు గ్రంథాలయాలు మూతపడ్డాయి వార్షికోత్సవాలు ఆగిపోయాయి. పోలీసు జులుం పెరిగింది. గ్రంథాలయాలలో వచ్చే చదువరులపై నిఘా వేసి ఉంచారు. రెహబరే దక్కన్ అనే ఉర్దూ పత్రిక ఉర్దూ మాత్రమే రాజభాషగా ఉండాలని విశేష ప్రచారం చేసింది.

## గోల్కొండ పత్రిక తోడ్పాటు

ప్రజాహిత సంస్థల ఎడల నిజాం ప్రభుత్వం అనుసరించే దుర్నీతిని ఎదుర్కొనేందుకు సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు సురవరం ప్రతాపరెడ్డి సంపాదకత్వంలో 1926 నుంచి వెలువడుతున్న గోల్కొండ పత్రిక ముందుకు వచ్చింది, ఈ పత్రిక వార్తలు, వ్యాఖ్యల ద్వారా, పలు సంపాదకీయాల ద్వారా గస్తీనిషాన్‌ఫర్మానా ను తీవ్రంగా వ్యతిరేకించింది, ప్రజాభిప్రాయాన్ని కూడ గట్టింది. రెహబరే దక్కన్ పత్రిక పిచ్చి రాతలను తీవ్రంగా ఖండించింది. ప్రభుత్వం నిరంకుశ ధోరణులకు గోల్కొండ పత్రిక ఒక అంకుశంలాగ పని చేసింది.[8] అనేక ప్రజా ఉద్యమాలకు ప్రత్యేకించి గ్రంథాలయోద్యమాలకు అండగా నిలచింది. కొన్ని దినాలు బాక్సుకట్టి గ్రంథాలయాల గురించి, గస్తీనిషాన్ దురంతాల గురించి వార్తలు ప్రచురించింది. ఎట్టకేలకు నిజాం ప్రభుత్వం దిగివచ్చి నిషేధ ఉత్తర్వులు సవరించింది. గ్రంథాలయాలకు స్వల్పంగా గ్రాంటులు విడుదల చేయడం ప్రారంభించింది.

## కొత్త వెలుగు

దీనికి తోడు 1935లో స్వామీ రామానంద్‌తీర్థ నాయకత్వంలో ఏర్పడిన హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్, వందేమాతరం ఉద్యమం, ఇతర ప్రజాఉద్యమాలు ప్రజలలో చైతన్యం అంకురించడానికి తోడ్పడ్డాయి. క్రమంగా నూతన గ్రంథాలయ స్థాపన ప్రారంభమైంది. 1944లో సింగరేణి కాలరీస్‌లో జరిగిన 25వ, ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ గ్రంథాలయ కార్యకర్తలలో నూతన ఉత్తేజాన్ని పాదుకొల్పింది.[9] తెలుగు సంస్కృతికి పారాణి పెట్టింది. తెలుగువారి ఆత్మ గౌరవాన్ని అనేక ఆటుపోటులకు తట్టుకుని నిలబెట్టింది.

1914 నుంచి జరిగిన ప్రతి గ్రంథాలయ మహాసభలోను ఆంధ్ర, తెలంగణా కార్యకర్తలు కలసి మెలసి పని చేశారు. ప్రాంతీయ భేదాలు వారెరుగరు. వారి దృష్టిలో ఉంది అందర్ని కలిపే సంపూర్ణమైన విశాలాంధ్ర మాత్రమే. అదే ఆంధ్రప్రదేశ్.

## రెఫరెన్సులు


1. గాయత్రి, తెలంగాణాలో గ్రంథాలయోద్యమం సాధించిన ప్రగతి. ఆంధ్రజ్యోతి దిన పత్రిక, డిశంబరు 8, 1968. 11పు.
2 రామలింగం, డి., ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు జీవిత చరిత్ర, హైదరాబాదు, శత జయంత్యుత్సవ సంఘం, మార్చి 1985, 20 పుట.
3. హనుమంతరావు, మాడపాటి. ఆంధ్రోద్యమం - గ్రంథాలయోద్యమము. 25వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ నివేదిక, 1946. 68 పుట.
4 నారాయణరావు, కోదాటి. తెలంగాణాలో గ్రంథాలయోద్యమం. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవ సంచిక, 1956, 171 పుట.
5. నిజాం రాష్ట్ర గ్రంథాలయ మహాసభ, మధిర, 1925, గ్రంథాలయ సర్వస్వము - ఏప్రిల్ 1925, 96 పుట.
6. 2వ రెఫరెన్స్‌వలె
7. గోల్కొండ పత్రిక - ఫిబ్రవరి 15, 1933
8. వెంకటప్పయ్య, వెలగా. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం. విజయవాడ. నవరత్న బుక్ సెంటర్, 1985. 124 పుట
9. 25వ, ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, సింగరేణి కాలరీస్, నివేదిక, విజయవాడ, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం, 1947. 14 పు.

## 1.3 IYYANKI'S DEDICATION TO NATION'S CAUSE

**- Dr. G. V. S. L. Narasimha Raju**

A century back a child, who was named later as Venkata Ramanayya, was born on 24th July of 1890 in Iyyanki family in a small village called Konkuduru in East Godavari District. At the age of 17 he vowed to dedicate all his life for the cause of the country and for the propagation of knowledge. He lived upto the ripe old age of 89 years leading popular movements and pleading for public library cause.

Born to the parents, Sri Iyyanki Venkataratnam and Smt. Mangamamba he had his primary education at Attili and Ganapavaram in West Godavari District and high school education at Taylor High School of Narsapuram. Moving with the prevailing spirit of the times - the Freedom Movement, Non-cooperation Movement,Nationalist Movement and the like he inspired the youth of the day by pioneering public library movement as people's movement.

His indomitable will and courage, dedication and commitment to a cause; leadership traits and organising abilities were his great assets. The spirit he left behind will beholden the young and old even now. Without his asking he won laurels from the people and the nation. Felicitations were plenty. Titles like Grandhalayoddaraka, Grandhalaya Pitamaha; Saraswati Samrajya Pratistapanacharya, were bestowed on him. Government of India honoured him with PADMASRI title in 1972 and Professor Kaula International Gold Medal was awarded to him in 1977 for his pioneering work in public library field. A Gold Medal was instituted in his name for the award every year to the First class First student of Bachelor in Library and Information Science of Andhra University by the Department of Library and Information Science of the University. In his name a professional who dedicated himself for library service was honoured by the Iyyanki Library Awards Committee - a small group of his devoted admirers.

Even as a school child, Ramanayya cultivated the habit of buying books, magazines and newspapers. During his high school days he organised a small library for his age group by encouraging his friends to part with a monthly subscription of two annas per head. With a part of this amount he was subscribing for the paper, "Vandemataram", edited by Aravind Ghosh. At such an young age he was sending his views and opinions to Telugu papers of his time.

Bipin Chandra Pal, a nationalist leader founded the newspaper 'Young India'. He was going across the country to guage the sentiments and views of the people on 'Freedom Movement' and other nationalist movements. In 1907 he visited Rajahmundry. His speeches inspired many a young persons in Andhra who gave up their studies and joined the nationalist movements. Young Iyyanki who was in his 17th year happened to hear the enthralling speech of Pal at Rajahmundry. That very moment he took a bath in the river Godavari and vowed himself to dedicate the rest of his life for the service of the people and the cause of the nation. From then on till he last breathed, he was holding firm to his commitment.

The list of his activities was astonishing. He was associated with the Indian National Congress as a member of the state committee. He was an active member of the 'Andhra Mahasabha' and 'Andhra Mahajana Sabha'. He was Public Relations and Publicity Secretary at Vijayawada for the Theosophical Society and for the All India Naturopathy Association. He was leader of the 'Back to Nature' Training Centres and was Secretary, Welfare League, Vijayawada. He was Member of the State Scout Commission and Indian Scout Movement. He worked with Andhra Ratna Duggirala Gopala Krishnayya and participated in movements known as 'Rama Dandu,' 'Ghosti', 'Sadhana' and 'Andhra Sodara Samiti'.

Iyyanki Venkata Ramanayya's love for learning and knowledge made him more popular as a pioneer of public library movement. Dr. C. R. Reddy, former Vice-Chancellor of Andhra University said at the time of conferring the title, 'Grandhalaya Pitamaha' on Iyyanki that "The Viswaroopa he exhibited in the library movement overwhelms him with astonishment." The International Science Trust while presenting the Gold Medal and the scroll of honour

said : "Shri Iyyanki Venkata Ramanayya has been the live-wire of the Public Library Movement in India." He has founded Library Associations, organised Library Conferences and created stir for library consciousness in several states and in India as a whole. The first state library association, the first National Library Association, the first professional journal, the first floating library service, the first library pilgrimage and the first rural bias to library movement have been all due to his great organising capacity, untiring energy and dedication as a selfless social worker."

The modus operandi of his library pilgrimage is worthy of emulation even for the modern youth. A team of 12 volunteers is divided into 6 groups for the pilgrimage. The first group would go to a village a day in advance of the actual visit by the team and paste posters and inform the village of the forthcoming visit by the team. Next day as the rest of the team came to the village the second group would go round the village singing Bhajans and inviting people to the evening function. The third group would make arrangement for the display of the material brought by the team near the meeting venue. The fourth would concern itself with playing music on the gramaphone. Fifth group articulate in public speaking which would plead for setting up a library in the village if there was none. If there was a library already the team would give suggestions for its development and regular functioning. The last group of the team would organise a Magic Lantern show that evening. How wonderful and effective it would be if voluntary organisations of the present day take up such pilgrimages for literacy movement and rural uplift programmes.

Iyyanki's childhood zeal for literary writings and craving for magazines and journals made him start several journals. Many of them were successful for quite some time. **Andhra Bharati, Grandhalaya Sarvaswam, Indian Library Journal, Korada Prakriti, Indian Naturapathy, Sahakaram, Divyagnana Deepika** were all started by him. He was also associated with several other journals of that time.

To encourage publication and to popularise Telugu literature he

was involved in publication series like "Andhra Parishat", "Kalapitham" and "Divya jnana Chandrika Mandali". The famous novel 'Malapalli' of Wunnava Laxminarayana was first published by Iyyanki. Works of Mahatma Gandhi were translated and published in the same Andhra Parishat series.

Through his literary jounal **Andhra Bharati, Korada** and for some time through **Grandhalaya Sarvaswam** he encouraged budding writers and poets to publish their writings. Great names in Telugu literature like Gurajada Appa Rao, Basavaraju Apparao, Rayaprolu Subba Rao, Kavikondala Venkata Rao, Tirupati Venkata Kavulu, Nalam Krihsna Rao, Veluri Sivarama Sastry, Vajjahala China Seetaramaswamy Sastry had their writings - first attempts in most cases - published by Iyyanki.

Besides library and literary movements and participation in political movements, Iyyanki got himself involved in several other activities with a commitment. He took part in adult education and youth programmes, collected and sent books to soldiers on the war front during the first world war, saw to it that libraries were thrown open to Harijans and the down trodden. He organised relief work when river Krishna flooded several villages on the 1st of November, 1916.

It was no wonder that on the advice of Annie Besant, Mahatma Gandhi Father of the Nation, came all the way to Vijayawada in 1916 to meet Iyyanki and know from him about the rural library movement and its achievements.

However, much one talks about this multifaceted personality, still many more aspects of his life and works, remain untouched. Acharya Mamidipudi Venkatarangayya names Iyyanki Venkata Ramanayya as a leader of the stature of Kandukuri Veeresalingam. Great Sanskrit scholar and one time State Laureate Shri Kasi Krishnamacharyulu called him a 'Saka purusha' or an epoch maker for libraries and library service.

The centenary year celebrations of Padmasri Iyyanki Venkata Ramanayya were held in 1991, but the torch he lit, Grandhalaya Jyoti, must however, continue forever.

(Courtesy : AIR Visakhapatnam)

# 2.1 ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ వ్యవస్థ: ప్రభుత్వ పుస్తక సంపాదన

- ఆచార్య ఎ.ఎ.ఎన్.రాజు

## పౌర గ్రంథాలయ వ్యవస్థ

ఆంధ్రప్రదేశ్ సమగ్ర గ్రంథాలయ చట్టం (1960) ఏప్రిల్ 1960లో రాష్ట్రమంతటా అమలులోనికి వచ్చింది[1] ఈ చట్టం ద్వారా మన రాష్ట్రంలో పౌర గ్రంథాలయ వ్యవస్థ ఏర్పడి క్రమబద్ధంగా పౌరగ్రంథాలయాల అభివృద్ధికి తోడ్పడింది. రాష్ట్రంలో పౌర గ్రంథాలయ వ్యవహారాలను చూసేందుకు ప్రత్యేకంగా పౌర గ్రంథాలయాల శాఖ ఏర్పరచబడింది. ప్రస్తుతం మన రాష్ట్రంలో వివిధ స్థాయిలలో పలురకాల పౌర గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి. ఈ గ్రంథాలయాలు నగర, పట్టణ, గ్రామీణ ప్రాంతాల వాసులకు సమాచార సేవలు అందిస్తున్నాయి.

రాష్ట్రంలోని ప్రభుత్వ గ్రంథాలయాలు, జిల్లా గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలు పౌర గ్రంథాలయ శాఖ అజమాయిషీ క్రింద పనిచేస్తున్నాయి. ఈ గ్రంథాలయ వ్యవస్థను 'పిరమిడ్' ఆకారంతో పోల్చవచ్చును. ఈ వ్యవస్థలో ఉన్నత స్థానంలో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, దీనిక్రింద ప్రాంతీయ గ్రంథాలయాలు తరువాత జిల్లా కేంద్రగ్రంథాలయాలు వీటి క్రింద శాఖా గ్రంధాలయాలు, గ్రామీణ గ్రంధాలయాలు, పుస్తక నిక్షేప కేంద్రాలు, సంచార గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి. వీటికి తోడుగా సహాయాధార, పంచాయితీ, సహకార సంస్థల గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి.[2]

## గ్రంథాలయాల సంఖ్య

మన రాష్ట్రంలో 1991-92 సంవత్సరాంతానికి 4,588 వివిధ రకాల పౌర గ్రంధాలయాలు పనిచేస్తున్నాయి. క్రింది పట్టికలో ఈ గ్రంథాలయాలకు సంబంధించిన సంఖ్యా వివరాలు తెలియచేయబడ్డాయి.

| గ్రంథాలయ రకాలు | సంఖ్య | మొత్తం |
|---|---|---|
| **1. ప్రభుత్వ గ్రంథాలయాలు** | | |
| 1.1 రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం | 1 | |

| | | |
|---|---|---|
| 1.2 ప్రాంతీయ గ్రంథాలయాలు | 6 | |
| 1.3 సంచార గ్రంథాలయం | 1 | 8 |
| **2. జిల్లా గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలు** | | |
| 2.1 జిల్లా కేంద్ర గ్రంథాలయాలు | 22 | |
| నగరకేంద్ర గ్రంథాలయం | 1 | |
| 2.2 శాఖా గ్రంథాలయాలు | 1422 | |
| 2.3 సంచార గ్రంథాలయాలు | 3 | |
| 2.4 గ్రామీణ గ్రంధాలయాలు | 338 | |
| 2.5 పుస్తక నిక్షేప కేంద్రాలు | 517 | 2303 |
| **3. సహాయాధార గ్రంథాలయాలు** | | |
| 3.1 గ్రామపంచాయితీ గ్రంథాలయాలు | 1520 | |
| 3.2 సహకార సంఘాల గ్రంధాలయాలు | 40 | |
| 3.3 స్వచ్ఛంద గ్రంథాలయాలు | 717 | 2277 |
| | **మొత్తం** | 4588 |

ఆధారం : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపౌర గ్రంథాలయ శాఖ కార్యాలయం

## పుస్తక / పత్రిక నిలువలు

మన రాష్ట్రంలో గల ప్రభుత్వ, జిల్లా గ్రంధాలయ సంస్థల, సహాయాధార గ్రంధాలయాల్లో 31-3-91 నాటికి గల పుస్తక నిలువలు 1,00,60,802. పత్రికల సంఖ్య 42,965. వీటి వివరాలు క్రింది పట్టికలో చూడవచ్చు.

| | గ్రంధాలయ రకాలు | గ్రంధాలయాల సంఖ్య | పుస్తక సంఖ్య | పత్రికల సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | ప్రభుత్వ గ్రంథాలయాలు | 8 | 7,20,823 | 1,048 |
| 2. | జిల్లా గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలు | 1709 | 85,67,061 | 39,488 |
| 3. | సహాయాధార గ్రంధాలయాలు | 330 | 7,72,918 | 2,429 |
| | **మొత్తం** | 2047 | 1,00,60,802 | 42,965 |

330 సహాయాధార గ్రంథాలయాలకు సంబంధించిన దత్తాంశం మాత్రమే అందుబాటులో ఉంది.

ఆధారం : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌర గ్రంథాలయాల శాఖ కార్యాలయం

పై పట్టికల ద్వారా వివిధ రకాల పౌర గ్రంథాలయాల్లో గల పుస్తక, పత్రిక సంపదను తెలుసుకొనవచ్చును. ఆధునిక పౌర గ్రంధాలయ ప్రమాణాల ప్రకారం గ్రంథాలయాల్లో లభించే పుస్తక, పత్రికల సంఖ్య అంత ప్రోత్సాహకరంగాలేదు. ఇందుకు ఎన్నో కారణాలు ఉండవచ్చును. ప్రధానంగా, ప్రభుత్వ పుస్తక సంపాదన విధానం ఒక ముఖ్యకారణంగా పేర్కొనవచ్చును.

## పౌర గ్రంథాలయాల పుస్తక సంపాదన విధానం

భారత ప్రభుత్వంచే 1959లో నియమించబడిన సిన్హా కమిటి పౌర గ్రంథాలయాలకు అవసరమైన ఎటువంటి పుస్తక సంపాదన విధానం సూచించలేదు. పుస్తకాల ఎంపిక, సంపాదన బాధ్యతను రాష్ట్ర గ్రంథాలయ పాలకునకు అప్పగించింది. పుస్తక ఎంపిక కమిటి సలహాపై రాష్ట్ర గ్రంథాలయ పాలకుడు కార్యక్రమాన్ని నిర్వర్తించాలని సిఫారసు చేసింది.[3] డాక్టర్ ఎస్.ఆర్. రంగనాధన్ అధ్యక్షతన ఏప్రెల్, 1962లో రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగిన "పౌర గ్రంథాలయాల వ్యవస్థీకరణ - పరిపాలన" సదస్సులో ఈ విషయం చర్చకు వచ్చింది. ఈ సదస్సు వార్షిక పుస్తక గ్రాంట్ల కేటాయింపు, పుస్తకాల ఎంపిక, కొనుగోలు విషయాలపై అనుసరించవలసిన కార్యపద్ధతి నిర్ణయించింది. అలాగే, స్థానిక గ్రంథాలయ అథారిటీలు పుస్తక కొనుగోలుకు అవసరమైన ఆర్థిక వనరుల కేటాయింపు, విధానాల రూపకల్పనకు పుస్తక ఎంపిక కమిటీ వ్యవస్థాపనపై కొన్ని సూచనలు చేసింది.[4]

## ప్రభుత్వ పుస్తక సంపాదన విధానం

ప్రభుత్వ, జిల్లా గ్రంధాలయ సంస్థల గ్రంథాలయాల్లో పుస్తకాల ఎంపిక, సేకరణ, అభివృద్ధికి ప్రభుత్వం నిర్దిష్టమైన విధానం రూపొందించి అమలు పరచలేదు. పౌర గ్రంథాలయ చట్టం సెక్షన్ 13(1)బి ప్రకారం "గ్రంథాలయాలు పుస్తకాలు, పత్రికలు, దినపత్రికలు, వ్రాత ప్రతులు, చిత్ర పటాలు, కళలు, శాస్త్రాలకు సంబంధించిన కళాఖండాలు, ఫిల్ములు, స్లైడ్లు, సినీమా ప్రొజెక్టర్లు, రికార్డులు సంపాదించవలయును" అని మాత్రమే నిర్దేశించబడింది.[5] ఉప నిబంధన ప్రకారం జిల్లా గ్రంధాలయ సంస్థల అధికారులు తమ గ్రంధాలయాలకు ముందు పేర్కొన్న పఠన సామాగ్రి సంపాదించవలసి వుంటుందని భావించారు. ప్రభుత్వ గ్రంథాలయాలు, జిల్లా గ్రంధాలయ సంస్థలు తమకు తోచిన పుస్తక ఎన్నిక, సంపాదన విధానాలను, కార్య పద్ధతులను రూపొందించుకున్నాయి.

నిర్దిష్ట, సుస్పష్ట, ఏకరూప పుస్తక సంపాదన విధానలోపం వలన పౌరగ్రంథాలయ వ్యవస్థలో పుస్తక సంపాదనాభివృద్ధి సక్రమంగా జరుగలేదు. గ్రంథాలయాల్లో పుస్తకాల ఎంపిక, సేకరణ, కొనుగోలు విధానంలో అవకతవకలు చోటుచేసుకున్నాయి. ఉపయోగకర, సమతుల్య పుస్తక సంపద గ్రంథాలయాల్లో కనిపించకుండా పోయింది. ఈ పరిస్థితిని గమనించి రాష్ట్ర ప్రభుత్వంచే 1976లో నియమించబడిన ఎక్బోటే కమిటి 'పుస్తకాల ఎంపిక, కొనుగోలు విషయంలో ప్రమాణాలకు తిలోదకాలిచ్చిన కొందరు అధికారుల ప్రవర్తన మా దృష్టికి ఎందరో తీసుకు వచ్చారు. ఇటువంటి పరిస్థితిని తక్షణం చక్కదిద్దే అవసరం ఎంతైనా వుంది'- అని తమ నివేదికలో పేర్కొంది.[6]

పౌర గ్రంథాలయ వ్యవస్థలో చోటుచేసుకున్న చీడను అరికట్టడానికి ప్రభుత్వం సదుద్దేశంతో 1969లో పౌర గ్రంథాలయ చట్టం సెక్షన్ 13(1)బికి ఉపనిబంధన చేర్చింది. ఈ ఉపనిబంధన ప్రకారం జిల్లా గ్రంథాలయ సంస్థలు తమకు కావలసిన పుస్తకాలు ప్రభుత్వంచే రూపొందించి, ఆమోదించి, జారీ చేయబడే పుస్తకాల పట్టికల నుండి ఎన్నుకొనవలసివుంది.[7]. పుస్తకాల ఎంపిక, సంపాదన విధానం చక్కదిద్ది, సరియైన మార్గంలో పెట్టే ఉద్దేశంతో ప్రభుత్వ పౌర గ్రంథాలయ చట్టం సెక్షన్ 13(1)బి కి రెండవ ఉపనిబంధన జోడించింది. ఈ రెండవ ఉపనిబంధన పౌర గ్రంథాలయాలు ఎటువంటి పుస్తకాలు, పత్రికలు సేకరించాలో, ఎప్పటికప్పుడు తగు ఆదేశాలు యివ్వడానికి అధికారం ఇవ్వబడింది. వీటిని సేకరించుటకు గ్రంథాలయ సంస్థల బడ్జెట్‌లో 25 శాతం తగ్గకుండా నిధులు కేటాయించాలని స్పష్టపరచబడింది.[8]

## పుస్తక ఎంపిక కమిటి ఏర్పాటు

గ్రంథాలయ చట్టంలోని సెక్షన్ 13(1)బికి అనుగుణ్యంగా రాష్ట్ర ప్రభుత్వం G.O.Ms.No.2740 Education. dt. 23-11-1969 ద్వారా ఉన్నతాధికార కమిటీని ఏర్పాటు చేసింది. ఈ కమిటీకి పుస్తక, పత్రికల పట్టికల తయారి బాధ్యత అప్పగించబడింది. ఈ పట్టికల నుండే గ్రంథాలయ సంస్థలు తమకు కావలసిన పుస్తకాలు, పత్రికలు కొనవలసి వుంది. రాష్ట్ర పౌర గ్రంథాలయాల శాఖామంత్రి ఈ కమిటీకి అధ్యక్షులు. ఈ కమిటీలో ఇతరులే కాకుండా విద్యాశాఖ కార్యదర్శి, పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టర్ సభ్యులు. పౌర గంధాలయ శాఖ డైరెక్టర్ ఈ కమిటీకి కన్వీనరు. వివిధ భాషల్లో ప్రచురించబడే పుస్తకాల ఎంపికకు కేంద్ర కమిటి ఉపకమిటీలను ఏర్పాటు చేసే అధికారం ఇవ్వబడింది.

## గ్రంథాలయ పరిషత్తు ఏర్పాటు

పౌర గ్రంథాలయ చట్టానికి ఏప్రెల్ 1989లో సవరణ తీసుకు వచ్చి గ్రంథాలయ పరిషత్తు ఏర్పాటుకు ప్రభుత్వం చర్యలు గైకొంది.[9] చట్టంలో గల రెండవ పరిచ్ఛేదం ప్రకారం

గ్రంథాలయ పరిషత్తు ఏర్పాటుకు వీలు కల్పించబడింది. రాష్ట్రంలోగల పౌర గ్రంథాలయాలకు సంబంధించి ఈ పరిషత్తు ప్రధాన విధాననిర్ణయ సంస్థ. స్వల్ప, దీర్ఘకాలిక ప్రణాళికలను రూపొందించి రాష్ట్రంలో పౌర గ్రంథాలయ వ్యవస్థను అభివృద్ధి పరచడం ఈ పరిషత్తు ముఖ్యోద్దేశం. పౌర గ్రంథాలయ వ్యవస్థలో అగ్ర విధాననిర్ణయ సంస్థగా ఈ పరిషత్తుకు గ్రంథాలయ సేవల నాణ్యత, ప్రమాణాలు నిర్ణయించే అధికారం కల్పించబడింది. ప్రభుత్వం జారీ చేసే మార్గదర్శక సూత్రాల కనుగుణంగా అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించి అమలు పరచే బాధ్యత ఈ పరిషత్తుపై వుంది.

సవరించబడిన పౌర గ్రంథాలయ చట్టంలోని సెక్షన్ 5(1)ఎల్ ప్రకారం పౌర గ్రంథాలయాలకు అవసరమైన పుస్తకాల ఎంపిక, కొనుగోలు విధానం నిర్ణయించి అమలు పరచుట పరిషత్తు కార్యక్రమాల్లో ఒకటి. ఈ విధానం అమలు పరచుటకు ఉపకమిటీలను ఏర్పాటు చేసి అందులో సభ్యులుగా ప్రముఖ వ్యక్తులు, విషయ నిపుణులు, భాషావేత్తలను నియమించవలసి వుంది.[10]

## పుస్తక ఎంపిక, పట్టికల తయారీకి మార్గదర్శక సూత్రాలు

గ్రంథాలయ చట్టంలో సెక్షన్ 13(1)బి ప్రకారం ప్రభుత్వం G.O Ms No 1580 Education dt. 14-8-1970 ద్వారా గ్రంథాలయ సంస్థలకు అవసరమైన పుస్తకాల ఎంపిక, పట్టికల తయారీకి మార్గదర్శక సూత్రాలు, కార్య పద్ధతిని రూపొందించింది. ఈ జి.వో. ప్రకారం పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టర్ రాష్ట్రంలో ప్రచురించబడిన పుస్తకాల ఆధారంగా పట్టికలు తయారు చేయాలి. ఈ పట్టికలలో విజ్ఞాన శాస్త్ర శాఖలకు సంబంధించిన ప్రామాణిక గ్రంథాలు, మహాగ్రంథాలు, బాల సాహిత్యం, వ్యవసాయం, నూతన అక్షరాస్యులకు అవసరమైన జనప్రియ విజ్ఞాన శాస్త్రం, సాహిత్యానికి సంబంధించిన పుస్తకాలకు తగిన స్థానం కల్పించాలి. ఎప్పటికప్పుడు ప్రభుత్వం ఈ విషయంలో సూత్రాలను నిర్దిష్టపరుస్తుంది. వివిధ ఉపకమిటీల సహాయంతో ఈ పట్టికలను తయారుచేసి ప్రభుత్వ ఆమోదం పొందాలి. సదరు జి.వొ.లో పుస్తక పట్టికల తయారి, జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాల మధ్య నిధుల పంపకం, వివిధ భాషలకు కేటాయించవలసిన నిధులు మొదలగు అంశాలపై వివరణ సహితంగా మార్గదర్శక సూత్రాలు ఉన్నాయి.

## నిధుల కేటాయింపు

జిల్లా గ్రంథాలయ సంస్థల వార్షిక బడ్జెట్‌లో పుస్తక కొనుగోలుకు కేటాయించిన నిధులను జిల్లాకేంద్ర గ్రంథాలయం, శాఖా గ్రంథాలయాలకు కేటాయించాలి. ఈ కేటాయింపు 35:65 నిష్పత్తిలో ఉండాలి. దీనిని తరువాత 20:80కి మార్చటం జరిగింది. నగర కేంద్ర గ్రంథాలయం, జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలకు కావలసిన వివిధ భాషలలో ప్రచురించబడే పుస్తకాల కొనుగోలు, పత్రికల చందాలు కట్టుటకు అవసరమైన నిధుల కేటాయింపు సదరు జి.వొ.లో స్పష్టపరచబడింది. (చూడుడు : అనుబంధం-1)

## పుస్తక పట్టికల రకాలు

ముందు ఉటంకించిన జి.వొ. ప్రకారం కేంద్ర పుస్తక ఎంపిక కమిటి నిర్బంద పట్టిక, సాధారణ పట్టిక అనే రెండు విధాల పుస్తక పట్టికలను తయారుచేయాలి. సాధారణ పట్టికలో గల పుస్తకాలు కొనుట ఐచ్ఛికం. మొత్తం పుస్తక బడ్జెట్ నుండి 25% నుండి 30 వరకునిర్బంధ పట్టికలలో గల పుస్తకాలు కొనటానికి గ్రంథాలయ సంస్థలు వెచ్చించాలి. నిర్బంధపట్టికల నుండి నగర కేంద్ర గ్రంథాలయ సంస్థ, జిల్లా గ్రంధాలయ సంస్థలువివిధ విషయాలకు సంబంధించిన పుస్తకాల కొనుగోలుకు ఎంత మొత్తం కేటాయించాలో సదరు జి.వొ.లో నిర్దేశించబడింది. (చూడుడు: అనుబంధం-2) సంస్థాపర ప్రచురణకర్తల జాబితా కూడ ఈ జి.వొ. రెండవ షెడ్యూల్‌లో ఈయబడింది. సంస్థాపర ప్రచురణలను నిర్బంధ పట్టికలో తప్పకుండా చేర్చాలి. (చూడుడు. అనుబంధం -3)

సాధారణ పట్టికలలో చేర్చవలసిన సంస్థాపర ప్రచురణకర్తల జాబితా కూడ మూడవ షెడ్యూల్లో తెలుపబడింది. ఈ సంస్థాపర ప్రచురణలకు సాధారణ పట్టికలలో ప్రాధాన్యత ఇవ్వాలి. అంతేకాకుండా రాష్ట్రంలోగల విశ్వవిద్యాలయాలు తమ పార్యాంశాలలో ఉటంకించబడిన పుస్తకాలు, రాష్ట్రమాధ్యమిక విద్యామండలి తమ పార్యాంశాలలో నిర్దేశించబడిన పుస్తకాలు కూడా ఈ సాధారణ పట్టికలలో చేర్చాలి. (చూడుడు. అనుబంధం -4). ఈ పట్టికలలో చేర్చబడిన పుస్తకాలకు ఇండెక్స్ నంబరు ఇచ్చే విధానం, విషయాధార వర్గీకరణ, ప్రచురణ కర్తలనుండి తీసుకోవలసిన ముదరా పట్టికలలో చేర్చబడని కొత్త పుస్తకాల సంపాదన మొదలగుఅంశాలపై నిర్దిష్ఠ కార్య పద్ధతి ఈ జి.వొ. లో వివరించబడింది. ప్రభుత్వం మెమో నం.2864/ E 81.4 Education Department dt. 17.6.82. ద్వారా రెండు పట్టికలలో చేర్చబడిన పుస్తకాల్లో ఒక్క ప్రతిని మాత్రమే జిల్లా గ్రంధాలయ సంస్థలు కొనేటందుకు అవకాశం కల్పించబడింది. ఇటువంటి కొనుగోళ్ళకు గ్రంథాలయ శాఖ డైరెక్టర్ ఆమోదం పొందవలసి ఉంటుంది. మొత్తం పుస్తక బడ్జెట్‌లో 25% మించకుండా కొత్త పుస్తకాలు కొనుటకు గ్రంధాలయ సంస్థలకు వీలు కల్పించబడింది.

## ప్రభుత్వ గ్రంథాలయాలు

ప్రభుత్వ గ్రంథాలయాలు - రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం ఆరు ప్రాంతీయ గ్రంథాలయాలు ఏలూరులో గల సంచార గ్రంథాలయం ముందు ఉటంకించబడిన జి.వొ. నం. 1580 పరిధిలోనికి రావు. ఈ గ్రంథాలయాల పుస్తక ఎంపిక, కొనుగోలు విధాన రూపకల్పనలో గ్రంధాలయ పరిషత్తుకు ఎటువంటి అధికారం లేదు. ప్రభుత్వంచే తయారు చేయబడి, సరఫరా చేసే రెండు పట్టికలనుండి పుస్తకాల ఎన్నిక, కొనుగోలు ఆదేశన ఆవశ్యకత కూడ ఈ

గ్రంథాలయాలకు లేదు. ఈ గ్రంథాలయాలకు ప్రత్యేక పుస్తక ఎంపిక కమిటీలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ గ్రంధాలయాలకు అవసరమైన పుస్తకాల ఎన్నికను-ఈ కమిటీలు చేస్తాయి. అవసరమైతే ఈ కమిటీలు కేంద్ర పుస్తక ఎంపిక కమిటి తయారుచేసే రెండు పట్టికలను పరిశీలించి ఎంపిక చేయవచ్చును.

## ప్రస్తుత పుస్తక ఎంపిక ఏర్పాటు

సవరించబడిన గ్రంథాలయ చట్టం 1989, నం.11 సెక్షన్ 5(1)ఎల్ ప్రకారం జిల్లా గ్రంథాలయ సంస్థలకు పుస్తకాల ఎంపిక, కొనుగోలు విధానం నిర్ణయించే అధికారం గ్రంధాలయ పరిషత్తుకు అప్పగించబడింది. ఈ విధాన రూపకల్పన అమలు చేయటానికి కేంద్ర పుస్తక ఎంపిక కమిటీకి ఉపకమిటీలను ఏర్పాటు చేసే బాధ్యత అప్పగించబడింది.[11] పౌర గ్రంథాలయ వ్యవస్థకు ప్రస్తుత పుస్తక ఎంపిక ఏర్పాటు క్రింది విధంగా వుంది.




## పుస్తక పట్టికల ప్రవాహం

ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ ఆక్టు 1867 (కేంద్రచట్టం) మరియు ఏ.పి. ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ అఫ్ బుక్స్ రూల్స్ 1960కి గల ఉపబంధనలు అమలు పరచుటకు ప్రభుత్వం

ప్రచురణల రిజిస్ట్రార్‌ను అధికారిగా గుర్తించింది. పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టర్ పదవిరీత్యా ప్రచురణల రిజిస్ట్రార్‌గా వ్యవహరిస్తున్నాడు. ఏ.పి. ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ రూల్స్ 1960 ప్రకారం మన రాష్ట్రంలో ముద్రించి ప్రచురించబడే ప్రతీ పుస్తకం, పత్రికకు మూడు ప్రతులను రిజిస్ట్రార్ కార్యాలయంలో దాఖలు చేయవలసి వుంది.

గ్రంథాలయ పరిషత్తు కార్యాలయానికి ప్రచురణ రిజిస్ట్రార్ తన కార్యాలయంలో దాఖలు చేయబడిన పుస్తకాలు పంపబడుతాయి. అందిన పుస్తకాలను గ్రంథాలయ పరిషత్తు రాష్ట్రస్థాయి పుస్తక ఎంపిక కమిటీ ముందు పరిశీలనకు ఉంచుతుంది. ఈ రాష్ట్ర కమిటి, ఇతర ఉప కమిటీల సహాయంతో జి.వొ. 1580లో నిర్దేశించిన సూచనల ప్రకారం రెండు రకాల పుస్తక పట్టికలు తయారుచేయబడుతాయి. పట్టికలలో చేర్చబడిన ప్రతీ పుస్తకానికి సైటేషన్ నంబరు ఇవ్వబడుతుంది. గ్రంథాలయ పరిషత్తు ఈ పట్టికలను ఆమోదించిన తరువాత వాటిని జిల్లా గ్రంథాలయ సంస్థలకు పంపిస్తుంది. గ్రంథాలయ సంస్థలు ఈ పట్టికలనుండి తమకు అవసరమైన పుస్తకాలను ఎంపికచేసి కొనవలసి వుంటుంది. రాష్ట్రేతర ప్రచురణ కర్తలు తమ ప్రచురణలను గ్రంథాలయ పరిషత్తు పరిశీలన కొరకు పంపవచ్చును. ఈ ప్రక్రియ ప్రవాహ పటం క్రింది విధంగా వుంటుంది.



## నిధుల కేటాయింపుకు పునరీక్షిత ప్రమాణాలు

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషత్తు 16-7-93 నాడు జరిపిన సమావేశంలో క్రింద వివరించిన నిధుల కేటాయింపు పునరీక్షిత ప్రమాణాలను ఆమోదించింది. గ్రంథాలయ సంస్థ పుస్తక బడ్జెట్ నుండి జిల్లా కేంద్ర గ్రంథాలయానికి, శాఖా గ్రంథాలయాలకు ఎంత శాతం నిధులు కేటాయించవలసి వస్తుందో ఈ పట్టిక ద్వారా స్పష్టమవుతుంది.

| జిల్లా గ్రంథాలయ సంస్థ యొక్క శాఖా గ్రంథాలయాల సంఖ్య | ప్రతిపాదిత నిధుల కేటాయింపు | |
|---|---|---|
| | జిల్లా కేంద్ర గ్రంథాలయం | శాఖా గ్రంథాలయాలు |
| 50 శాఖా గ్రంథాలయాల వరకు | 20% | 80% |
| 60 " | 18% | 82% |
| 70 " | 16% | 84% |
| 80 " | 14% | 86% |
| 90 " | 12% | 88% |
| 100 లేదా అంతకంటే ఎక్కువ | 10% | 90% |

ఈ ప్రతిపాదిత నిధుల కేటాయింపు వలన ఒక విషయం తేటతెల్లమవుతుంది. శాఖా గ్రంథాలయాల్లో పుస్తక సంపద అభివృద్ధి పరచుటయే గ్రంథాలయ పరిషత్తు విధానం. ఈ శాఖా గ్రంథాలయాలు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోనే ఎక్కువగా ప్రారంభించ బడుతున్నాయి. గ్రామీణ ప్రాంతంలో చదువరుల అవసరాలు తీర్చుటకు ఈ విధానం ఎంతగానో తోడ్పడుతుంది. రెండు దశాబ్దాల ముందు జారీచేయబడిన జి.వొ నెం. 1580లో వివరించబడిన ప్రమాణం కంటే ఈ నూతన ప్రమాణం ఎంతో మెరుగ్గా వుంది. ఈ విధానం అమలు పరచి కేటాయించబడిన నిధులు సక్రమంగా వినియోగించి చదువరులకు కావలసిన పుస్తకాలు, పత్రికలుసరియైన సమయంలో తక్కువ వ్యయంతో సేకరిస్తేమన రాష్ట్రంలో గ్రామీణ గ్రంథాలయ సేవలు మూడు పువ్వులు - ఆరుకాయలుగా అభివృద్ధి చెందుతాయి.

## పుస్తక సంపాదన విధాన ప్రభావం

కేంద్ర పుస్తక ఎంపిక కమిటీ కొరకుజి.వొ.నం. 1580లో స్పష్టపరచిన సుదీర్ఘ, నిర్ణీత పుస్తక ఎంపిక విధాన కార్యపద్ధతి ఎన్నో విమర్శలకు గురైంది. ముఖ్యంగాగ్రంథాలయ వృత్తికారుల గ్రంథాలయ వ్యవస్థను అజమాయిషీచేసేవారు, ప్రచురణకర్తలు, పుస్తక విక్రేతలు ఈ సుదీర్

కార్యపద్ధతిని విమర్శించారు. కేంద్ర పుస్తక ఎంపిక కమిటీ ఏర్పాటు వలన స్థానిక గ్రంథాలయ వృత్తికారులుకేంద్ర పుస్తక ఎంపిక ప్రక్రియలో పాల్గొనే అవకాశం లేదు. జి.వొ.లో నిర్దేశించబడిన సుదీర్ఘ కార్యపద్ధతి, పుస్తకాల ఎంపిక, సంపాదన కార్యక్రమాన్ని ఎంతో ఆలస్యం చేస్తుంది. పుస్తక ఎంపిక విధానంలో జిల్లా గ్రంథాలయ సంస్థలకు ఏమాత్రం పాత్ర లేకపోవటం వలన తమ స్థానిక అవసరాలకు అనుగుణంగా పుస్తకాల ఎంపికకు అవకాశం లేకుండా పోయింది.

## పుస్తక పట్టికల జారీలో జాప్యం

జి.వొ.నం. 1580 ప్రకారం కేంద్రపుస్తక ఎంపిక కమిటి సంవత్సరంలో రెండుసార్లు సమావేశం కావాలి. అయితే, వాస్తవానికి ఈ కమిటిఎప్పుడూ క్రమబద్ధంగా సమావేశాలు జరుపలేదు. కేంద్ర పుస్తక ఎంపిక కమిటి తయారుచేసిన పుస్తకపట్టికలు ప్రభుత్వం తమ ఆమోదం తెలుపటానికి రెండు సంవత్సరాలు తీసుకున్న దృష్టాంతాలు లేకపోలేదు. ఈ కేంద్ర కమిటి వ్యవధి 1988లో తీరిపోయింది. తిరిగి దీనిని జనవరి 1993లో పునర్ వ్యవస్థీకరించారు. అంటే సుమారు ఐదు సవంత్సరాలు పౌర గ్రంథాలయ వ్యవస్థలో పుస్తకాల ఎంపిక, కొనుగోలు కార్యక్రమం స్థభించిపోయింది. పుస్తక సంపాదన కొరకు కేటాయించబడిన నిధులు వినియోగించబడలేదు. కొత్తగా ప్రచురించబడిన పుస్తకాల ఎంపిక, సేకరణకు అవకాశం లేకుండాపోయింది. గ్రంథాలయ వ్యవస్థలోగల పుస్తక సంపద పాతచింతకాయ పచ్చడిలా తయారైంది. చదువరులకు చేయవలసిన కనీస పుస్తక సేవలకు అవరోధం ఏర్పడింది.

## అసమగ్ర పుస్తక సంగ్రహాలు

జి.వొ.నం. 1580లో నిర్దేశించిన రెండు రకాల పుస్తక పట్టికలు తయారుచేయుటకు ముఖ్య ఆధారం ప్రచురణల రిజిస్ట్రార్ కార్యాలయంలో ప్రచురణకర్తలు, ముద్రాపకులు సమర్పించే పుస్తక, పత్రికల సముదాయం. అయితే రాష్ట్రంలో ప్రచురించబడే పుస్తకాలన్ని రిజిస్ట్రార్ కార్యాలయానికి అందడంలేదు. చాలామంది ముద్రాపకులు ప్రెస్ అండ్ రిజిస్ట్రేషన్ ఆఫ్ బుక్స్ రూల్స్ 1960లోగల ఉప బంధనలను పాటించటంలేదు. మన రాష్ట్రంలోనే కాకుండా ఇతర రాష్ట్రాలలో కూడా అంగ్లంలోను, ఇతర భాషలలోను వివిధ విషయాలపై ప్రఖ్యాత ప్రచురణకర్తలు ఉత్తమ గ్రంధాలను ప్రచురిస్తున్నారు. రాష్ట్రేతర ప్రచురణకర్తలు తమ ప్రచురణలను పుస్తక పట్టికలలో చేర్చుటకు గ్రంథాలయ పరిషత్తుకు పంపకపోతే ఆ ప్రచురణలు కేంద్ర పుస్తక ఎన్నిక కమిటీ తయారుచేసే రెండు పట్టికలలో నమోదు కావటానికి

వీలుపడదు. అందుచేత ఈ పట్టికలు అసమగ్రంగా ఉంటాయి. ఫలితంగా పౌర గ్రంథాలయ వ్యవస్థలో చేర్చబడే పుస్తక సంగ్రహాలు అసంపూర్తిగా, అసమగ్రంగా, అప్రచలితంగా ఉండి చదువరుల అవసరాలు తీర్చకుండా మిగిలిపోతాయి.

## సూచించిన పరిష్కారాలు

ఎక్స్‌పైటె కమిటీ రాష్ట్రంలో అమలులోనున్న పుస్తక ఎంపిక సంపాదన విధానాన్ని సమగ్రంగా, నిశితంగా పరిశీలించింది. ఈ ప్రక్రియలోఎదురౌతున్న సమస్యల పరిష్కారానికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. అవి: 1. కేంద్ర పుస్తక ఎంపిక కమిటీలో వివిధ భాండాగారులకు, విషయ నిపుణులకు, భాషావేత్తలకు స్థానం కల్పించాలి, 2. అవసరాలకు అనుగుణంగా ఈ కమిటి తరచుగా సమావేశం జరపాలి, 3. కమిటీ ఆమోదించిన పుస్తకాల పట్టికలు ప్రభుత్వ ఆమోదానికి పంపనవసరం లేదు, 4. వీటిని తుది ఎంపికగా గుర్తించాలి, 5. పుస్తక పట్టికలు తయారు చేసి గ్రంథాలయ సంస్థలకు బట్వాడా చేయుటలో జరిగే ఆలస్యం నివారించాలి.[12]

## ఉప సంహారం

రాష్ట్ర ప్రభుత్వం సదుద్దేశంతో రెండు దశాబ్దాలకు పూర్వం పౌర గ్రంథాలయ వ్యవస్థలో సరియైన, ఉపయోగకర పుస్తక వనరులను వృద్ధి పరచుటకు పుస్తక సంపాదన విధానాన్ని రూపొందించింది. దురదృష్టవశాత్తు అనవసర, ప్రతిబంధకరమైన కార్య నిర్వహణ వలన విధానం సరిగ్గా అమలు పరచబడలేదు. ఆశించిన ఫలితాలు సాధించబడలేదు. ప్రభుత్వ పరిపాలనలో కరడుగట్టిన జాప్యం, అనిశ్చితత్వం వలన జిల్లా గ్రంథాలయ సంస్థలలో పుస్తక ఎంపిక ప్రక్రియ, పుస్తక సంగ్రహాల అభివృద్ధి కార్యక్రమాలు కుంటుబడ్డాయి. పుస్తక ఎంపిక, సంపాదన విధానం, కార్యనిర్వహణలో గల లోటుపాట్లను స్వార్థపరులైన కొందరు ప్రచురణకర్తలు, పుస్తక విక్రేతలతో చేతులు కలిపి కేటాయించబడిన నిధులను దుర్వినియోగం చేసి, ఉపయోగంలేని, అనవసరమైన, పనికిరాని పుస్తక సంపదను పౌర గ్రంథాలయ వ్యవస్థలో వృద్ధిపరచసాగారు. ఫలితంగా పౌర గ్రంథాలయల్లో ఎక్కువ శాతం పుస్తక నిలువలు చదువరుల అవసరాలను తీర్చలేకపోతున్నాయి.[13]

పౌర గ్రంథాలయ వ్యవస్థలో విధాన రూపకల్పన అమలు పరచుటలో అత్యున్నత స్థానంలో ఉన్న గ్రంథాలయ పరిషత్తు ప్రస్తుతం అమలులోనున్న పుస్తక ఎంపిక, సంపాదన విధానాన్ని పునః పరిశీలించి, లోపాలను తొలిగించి పరిస్థితిని బాగుపరిచే చర్యలు తీసుకొనే అవసరంఎంతైనా వుంది. ఈ కార్యక్రమంలో గ్రంథాలయ పరిషత్తు, పౌరగ్రంథాలయ

వృత్తికారుల, గ్రంథాలయ సమాచార శాస్త్రజ్ఞుల, పరిపాలనాదక్షుల సహకారం స్వీకరించి అభ్యుదయ, ఉపయోగకర పుస్తక ఎంపిక, సంపాదన విధానాన్ని రూపొందించవలసి వుంది. అప్పుడే పౌర గ్రంథాలయ వ్యవస్థలో ఆధునిక, ఉపయోగకర, సంతులిత పుస్తక సంపదను వృద్ధి పరచుటకు వీలుపడుతుంది.[14]

## నిర్దేశాలు


1. Andhra Pradesh Public Libraries Act, 1960,Hyderabad, Law Public, 1968.
2. రాజు, ఎ.ఎ.ఎన్. సమస్యల వలయంలో గ్రంథాలయ వ్యవస్థ. ఆంధ్రభూమి, 18-2-1991, 25-2-1991.
3. Report of the Advisory Committee for Libraries, New Delhi, Ministry of Educationn Govt. of India, 1961 P. 76.
4. Ranganathan, S.R., Ed. Andhra Pradesh Seminar on the organisation and Administration of Public Libraries (1962), Findings, Hyderabad, Director of Printing, Govt. of A.P., 1965. PP. 15-21
5. A.P. Public Libraries Act, 1960 Opcit. P.7
6. Report of the committee appoinied by Government of Andhra Pradesh in February 1976, Hyderabad, Department of Public Libraries, 1978 P. 69.
7. Andhra Pradesh Act. No. 7 of 1967.
8. Ibid
9. Andhra Pradesh Act no. 11 of 1989.
10. Ibid P.6.
11. Ibid P.7.
12. Report of the Committee appointed by Government of Andhra Pradesh in Feb. 1976. Opcit. P. 70.
13. రాజు, ఎ.ఎ.ఎన్. సమస్యల వలయంలో గ్రంథాలయ వ్యవస్థ opcit.
14. Raju, A.A.N. what ails library service in Andhra Pradesh. The Hindu, Friday, April 15, 1991, P. 19.

## అనుబంధం -1

**(ఎ) నగరకేంద్ర గ్రంథాలయం**, హైదరాబాదులో, భాషలవారిగా పుస్తక సేకరణకు కేటాయించబడిన నిధుల శాతం.

| | | |
|---|---|---|
| 1. తెలుగు | 40% | తక్కువ కాకుండా |
| 2. ఉర్దూ | 15% | " |
| 3. ఆంగ్లం | 25% | " |
| 4. హింది | 10% | " |
| 5. సంస్కృతం, ఇతర భాషలు | 5% | " |

**(బి) జిల్లా కేంద్ర గ్రంథాలయాలు**

| | | |
|---|---|---|
| 1. ఆంగ్లం | 15% | ఎక్కువ కాకుండా |
| 2. హింది | 10% | " |
| 3. సంస్కృతం, ఇతర భాషలు | 5% | " |
| 4. తెలుగు | 55% | " |

**(సి) శాఖా గ్రంథాలయాలు**

| | | |
|---|---|---|
| 1. ఆంగ్లం | 10% | తక్కువ కాకుండా |
| 2. హింది | 5% | " |
| 3. సంస్కృతం, ఇతర భాషలు | 5% | " |
| 4. తెలుగు | 65% | " |

ఆధారం : G.O.Ms.No. 1580 dt. 14-8-1970, Education Dept. Govt. of A.P. P. 2.

## అనుబంధం - 2

నగర గ్రంధాలయ సంస్థ, జిల్లా గ్రంధాలయ సంస్థలు విషయాల వారిగా పుస్తక సేకరణకు కేటాయించబడిన నిధుల శాతం.

| | |
|---|---|
| 1. రెఫరెన్సు పుస్తకాలు | 10% – 15% |
| 2. ప్రాచీన-మధ్యయుగ పద్యకావ్యం | 50% - 10% |
| 3. ఆధునిక పద్యకావ్యం | 50% - 10% |
| 4. సాహిత్య విమర్శ, పరిశోధన, చరిత్ర | 50% - 10% |

| | |
|---|---|
| 5. నవల, కథ | 50% - 10% |
| 6. నాటకం, ఏకాంకికలు | 50% - 10% |
| 7. గద్య ఇతర రూపాలు, వ్యాసాలు, యాత్రావర్ణనలు | 50% - 10% |
| 8. చరిత్ర, జీవితచరిత్ర | 50% - 10% |
| 9. మానవీయ శాస్త్రాలు, సమాజ శాస్త్రాలు ఆర్థిక శాస్త్రం, తత్త్వశాస్త్రం, మతం, రాజకీయ శాస్త్రం, లలితకళలు, హస్తకళలు, మొ॥ | 200% - 30% |
| 10. విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలు | 10% - 15% |
| 11. గాంధీ సాహిత్యం | 50% - 10% |
| 12. బాల సాహిత్యం, వయోజన విద్య | 10% - 15% |

ఆధారం : G.O.Ms.No. 1580 dt. 14-8-1970, Education Dept. Govt. of A.P. P. 6.

## అనుబంధం - 3

సంస్థాపర ప్రచురణ కర్తలపట్టిక, ఈ సంస్థల ప్రచురణలు నిర్బంద పట్టికలో తప్పక చేర్చవలసి వుంది.

| | |
|---|---|
| ఆం.ప్ర. సాహిత్య అకాడమి | అన్ని పుస్తకాలు |
| ఆం.ప్ర. విజ్ఞాన పరిషత్తు | తెలుగు పుస్తకాలు |
| జాతీయ పుస్తక ట్రస్టు, న్యూఢిల్లీ | తెలుగు పుస్తకాలు |
| కేంద్ర సాహిత్య అకాడమి, న్యూఢిల్లీ | తెలుగు పుస్తకాలు |
| ఆం.ప్ర సంగీత నాటక అకాడమి | తెలుగు పుస్తకాలు |
| తెలుగు అకాడమి, హైదరాబాదు | జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు అన్ని పుస్తకాలూ, శాఖా గ్రంధాలయాలకు పాఠ్య పుస్తకాలు మినహా ఇతర పుస్తకాలు. |

ఆదారం: G.O.Ms.No. 1580 dt. 14-8-1970, Education Dept. Govt. of A.P. P. 6.

## అనుబంధం - 4

ఈ సంస్థల ప్రచురణలుసాధారణ పట్టికలలో చేర్చవలసి ఉంది.

| | |
|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం | అన్ని పుస్తకాలు |
| 2. రాష్ట్రంలో గల విశ్వవిద్యాలయాలు | అన్నిపుస్తకాలు |
| 3. కేంద్ర ప్రభుత్వం | అన్ని పుస్తకాలు |
| 4. ఆంధ్రప్రదేశ్ విజ్ఞాన పరిషత్తు | తెలుగు మినహా ఇతర భాషలలో పుస్తకాలు |
| 5. జాతీయ పుస్తకట్రస్టు, న్యూఢిల్లీ | " |
| 6. కేంద్ర సాహిత్య అకాడమి, న్యూఢిల్లీ | " |
| 7. ఆం. ప్ర. సంగీత నాటక అకాడమి | " |
| 8. రాష్ట్ర విశ్వవిద్యాలయాలు నిర్ణంయించబడిన పాఠ్య, రిఫరెన్స్ పుస్తకాలు | ఆయా విశ్వవిద్యాలయాల పరిధిలో గల అన్ని పుస్తకాలు |
| 9. రాష్ట్ర మాధ్యమిక విద్యామండలిచే నిర్ణయించబడిన పాఠ్య, రిఫరెన్స్ పుస్తకాలు. | అన్ని పుస్తకాలు |

ఆధారం: G.O.Ms.No. 1580 dt. 14-8-1970, Education Dept. Govt. of A.P. P. 7.

# 2.2 ఆంధ్రప్రదేశ్‌లో పౌర గ్రంథాలయ వ్యవస్థ: ఆర్థిక వనరులు

- అల్ల రాఘవయ్య

ఆంగ్లేయులు రాక పూర్వమే భారతదేశంలో గ్రంథాలయాలు ఆవిర్భవించాయి. అయితే సామూహికంగా ప్రజలు వాటివలన పొందిన ప్రయోజనం లేదనే చెప్పాలి. 1808 సంవత్సరంలో బొంబాయి ప్రభుత్వం సాహిత్య ప్రోత్సాహక నిధులు పంపిణీ చేసే ఉద్దేశంతో గ్రంథాలయాలను రిజిస్టరు చేసే కార్యక్రమానికి అంకురార్పణ చేసింది. 1812 సంవత్సరంలో మదరాసు సొసైటీ లైబ్రరీ ఏర్పడింది. 1835లో ప్రైవేటు యాజమాన్యం నిధులతో కలకత్తా నగరంలో ప్రథమ పౌర గ్రంథాలయం స్థాపించబడింది.

19వ శతాబ్దం నాటికి దేశవ్యాప్తంగా ఏదోరకంగా గ్రంథాలయాలు పనిచేయసాగాయి. 20 శతాబ్ద ప్రారంభం నుండి సర్వాంగ సముచితమైన పౌర గ్రంథాలయ వ్యవస్థ బరోడా సంస్థానంలో ఏర్పడింది. ఇందుకు బరోడా మహారాజు శాయాజీరావు గాయక్‌వాడ్‌ను అభినందించాలి. ప్రాథమిక విద్యకు, పౌరగ్రంథాలయాలకు 1906 నుండి 1911 వరకు విశేష ఆదరణ లభించింది. ఈ కాలాన్ని స్వర్ణయుగంగా చెప్పుకోవచ్చు. 1914 సంవత్సరంలో జరిగిన విజయవాడ సమావేశంలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్యక్షులుగా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం స్థాపించిన ఘనత ఆంధ్రులకే దక్కింది. సంఘ స్థాపన అనంతరం ఆంధ్రదేశంలో గ్రంథాలయ ప్రచారం ముమ్మరంగా సాగింది. గ్రామాల్లో అనేక గ్రంథాలయాలు వెలిశాయి. స్వచ్ఛంద సేవకులు ప్రజలనుండి వసూలు చేసిన విరాళాలతోను, వదాన్యులైన పెద్దల సహకారంతోను ఆనాడు గ్రంథాలయాలు నడిచాయి. 1920 సంవత్సరం నుండి మదరాసు ప్రభుత్వం గ్రంథాలయాలకు గ్రాంటు-ఇన్-ఎయిడ్ ఇచ్చే విధానం ప్రవేశపెట్టింది. ముఖ్యంగా ఆంధ్రదేశంలో గ్రామీణ గ్రంథాలయాలు స్వాతంత్ర పోరాటానికి ఊపును, ఉత్సాహాన్ని కలుగజేశాయి. ప్రజల్లో చైతన్య ప్రేరణకు దోహదం చేశాయి.

## గ్రంథాలయ చట్టం

నగర గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలకు పుస్తకాలను ఉచితంగా అందుబాటులో ఉంచాలన్న కోరిక ప్రబలంగా ప్రచారం పొందింది. 1850లో విలియం ఇవార్ట్ కృషి ఫలితంగా బ్రిటిష్ పార్లమెంటు గ్రంథాలయ శాసనం చేసింది. అవిభక్త మదరాసు ప్రభుత్వం గ్రంథాలయ శాసనం చేయాలని డాక్టర్ రంగనాథన్ ముమ్మరంగా ప్రయత్నించారు. నాటి మదరాసు

రాష్ట్రంలో భాగంగా ఉన్న ఆంధ్రప్రాంతంలో గ్రంథాలయ శాసనం ఆవశ్యకత గురించి ప్రచారం చేయబడింది. భారతదేశంలో ప్రథమంగా మదరాసు రాష్ట్ర శాసనసభ **1948** సంవత్సరంలో పౌర గ్రంథాలయ శాసనం చేసింది. దీని ప్రకారం ప్రతిజిల్లాకు ఒక లోకల్ లైబ్రరీ అథారిటీ ఏర్పడింది. లోకల్ లైబ్రరీ అధారిటీ ఆధ్వర్యంలో తాలూకాపట్టణాల్లోను, ఐదువేల జనాభాగల గ్రామాల్లోను శాఖా గ్రంథాలయాల స్థాపనకు వీలు కల్పించబడింది. **1955**లో గోపాల్‌రావు ఎక్బోటేగారు విద్యామంత్రిగా ఉన్నప్పుడు హైదరాబాదురాష్ట్ర శాసనసభ గ్రంథాలయచట్టం చేసింది. విశాలాంధ్ర అవతరణ తర్వాత ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల చట్టం **(1960)** చేయబడింది. **1960** శాసనం ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక పౌర గ్రంథాలయ శాఖ ఏర్పడింది. రూపాయికి **4** పైసలు చొప్పున ఇంటి పన్ను - ఆస్తి పన్నుపై గ్రంథాలయ సెస్సు వసూలు చేయటానికి నిబంధన రూపొందింపబడింది. జిల్లాలోని మునిసిపాలిటీలు, పంచాయతీలు గ్రంథాలయ సెస్సు వసూలు చేసి సంబంధిత జిల్లా గ్రంథాలయ సంస్థకు జమ చేయాలని నిర్దేశింపబడింది. ఈ విధంగా జమ చేయబడిన సెస్సుకు సమానమైన మొత్తాన్ని ప్రభుత్వం మ్యాచింగ్ గ్రాంటు రూపంలో ఇవ్వాలని కూడ చట్టంలో నిబంధన చేర్చబడింది. గ్రంథాలయ సంస్థకు జమచేయబడిన గ్రంథాలయ సెస్సు; ప్రభుత్వ గ్రాంటు కలిసి ఏర్పాటయిన 'లైబ్రరీ ఫండు' నుండి గ్రంథాలయాల నిర్వహణ ఖర్చు ప్రతి గ్రంథాలయ సంస్థ భరించాలి.

గ్రంథాలయ సంస్థలకు జమ పడుతున్న సెస్సు మొత్తం తగ్గిపోవటం, గ్రంథాలయాల సంఖ్య పెరగటం కారణంగా సంతృప్తికరమైన గ్రంథాలయ సేవ ప్రజలకు అందించటం కష్టమైపోయింది. సిబ్బంది జీతాలకే ఆదాయం సరిపోని పరిస్థితి ఏర్పడింది. మూడేసి నెలలు సిబ్బంది జీతాలు నిలిచిపోయాయి. ఉద్యోగులు ఆందోళన చేశారు. తమను ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తించి, వారు అనుభవించే అన్ని సౌకర్యాలను వర్తింపజేయాలని కోరారు. వెంగళరావు ప్రభుత్వం జి.ఓ.యం.యస్.నెం. **915** ఎడ్యుకేషన్, తేదీ **29** జూలై **1975**, జారీ చేసింది. ఈ ప్రభుత్వ ఉత్తర్వులో గ్రంథాలయ సంస్థల సిబ్బందికి స్థానిక సంస్థల సిబ్బందితో సమానంగా సౌకర్యాలు; జీతాలతోపాటు పెన్షన్ సౌకర్యాలు ప్రభుత్వమే గ్రాంటు-ఇన్-ఎయిడ్ రూపంలో చెల్లించగలదని స్పష్టం చేయడింది. ప్రభుత్వం మ్యాచింగ్ గ్రాంటుఇచ్చే విధానానికి స్వస్తి చెప్పబడింది.

## గ్రంథాలయ సెస్సు

దురదృష్టవశాత్తు తాము వసూలు చేసిన గ్రంథాలయ సెస్సును కార్యనిర్వహణాధికారలైన మునిసిపల్ కమిషనర్లు గ్రంథాలయ సంస్థలకు సకాలంలో జమ చేయటం లేదు. గ్రంథాలయ

సంస్థ అధికారులు ఎన్నో విజ్ఞప్తులు చేసుకున్న తర్వాత పాక్షిక చెల్లింపులు మాత్రం చేస్తున్నారు. మేజరు పంచాయితీలు సెస్సు చెల్లింపు విషయంలో కొంత శ్రద్ధ వహిస్తున్నప్పటికీ మైనరు పంచాయితీలు శ్రద్ధ వహిస్తున్న పరిస్థితి కానరావటం లేదు.లక్షలాది రూపాయల వినోదపన్ను, స్టాంపు డ్యూటీ మొత్తాలను వాణిజ్య పన్నులు రిజిస్ట్రేషన్ శాఖల నుండి ఎప్పటికప్పుడు తెచ్చుకుంటున్న మునిసిపాలిటీలు, వారు గ్రంధాలయ సంస్థలకు చెల్లింపవలసిన సెస్సు విషయంలో నిర్లక్ష్యం చేయటం దురదృష్టం. పరిస్థితిని పై అధికారుల దృష్టికి తెచ్చినప్పటికీ ప్రయోజనం లేకపోవటం అంతకన్నా దురదృష్టం. మునిసిపాలిటీలు, పంచాయితీలు వసూలు చేసిన గ్రంధాలయ సెస్సు గ్రంథాలయ సంస్థలకు జమ చేయటంలో జాప్యం జరిగితే సంబంధిత అధికారులపై చర్య తీసుకునే అధికారం ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంధాలయాల రూల్స్ 1961లోని రూల్ 18 (3) ప్రకారం మునిసిపల్ పరిపాలన శాఖ డైరెక్టరుకు, జిల్లా కలెక్టర్లకు ఇవ్వబడింది. ఈ నిబంధనలో ప్రస్ఫుటంగా దిగువ విధంగా పేర్కొనబడింది.

"18(3) The Director of Municipal Administration and the Collector shall take disciplinary action against person or persons responsible for the delay in the remittance of the cess to the Zilla Grandhalaya Samasthas".

ఒకప్పుడు ప్రభుత్వం మునిసిపాలిటీలు తాము వసూలు చేసిన గ్రంధాలయ సెస్సును జిల్లా గ్రంధాలయ సంస్థల ఖాతాకు నెలకొకసారి చెల్లించాలని ఉత్తర్వులిచ్చింది. తరువాత సర్క్యులర్ మెమోరాండం 30.2072/యమ్2/73-7 యమ్.ఎ. తేదీ 4-5-1974లో ప్రతి మూడు నెలలకొకసారి చెల్లించాలని ఆదేశాలు ఇచ్చింది. విద్యా శాఖ జి.ఓ.యం.యస్.నెం. 915 తేదీ 29-7-1975లో గ్రంధాలయ సెస్సు రూపాయకు 4 పైసల నుండి 6 పైసలకు పెంచబడింది. ప్రభుత్వం మళ్ళీ విద్యా శాఖ జి.ఓ.యం.యస్.నెం., 1217 తేదీ 28-10-1981లో గ్రంథాలయ సెస్సును రూపాయకు ఆరు పైసల నుండి ఎనిమిది పైసలకు పెంచింది. జి.ఓ.యం.యస్.నెం. 409 ఎడ్యుకేషన్, తేదీ 8-11-1994 ప్రకారం ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ లైబ్రరీ రూల్స్ 1961లో సవరింపబడిన 18 రూల్ ననుసరించి స్థానిక సంస్థలు సెస్సు వసూలు చేసిన నెలలోపల జిల్లా గ్రంధాలయ సంస్థ ట్రెజరీ అకౌంటుకు పూర్తిగా చెల్లించాలని నిర్దేశింపడింది.

గ్రంథాలయాల పనితీరు, పురోభివృద్ధి కుంటుపడుతున్న కారణంగా గ్రంథాలయ సెస్సు చెల్లింపజేయటానికి గట్టి చర్యలు గైకొనాలన్న తలంపుతో ప్రతిజిల్లాలో పై రూల్ ప్రకారం ఒక అధికార కమిటీ ఏర్పాటు చేయబడింది. గ్రంథాలయ సెస్సు వసూళ్ళ గురించి సమీక్షించి, స్థానిక సంస్థలు సెస్సు సకాలంలో చెల్లించేట్లు చూడటం ఈ కమిటీ పని. దిగువ అధికారులు ఈ కమిటీలో ఉంటారు.

| | | |
|---|---|---|
| జిల్లా జాయింట్ కలెక్టర్ | - | ఛైర్మన్ |
| జిల్లా పంచాయితీ ఆఫీసర్ | - | మెంబర్ |
| జిల్లాలోని అందరు మునిసిపల్ కమీషనర్లు | - | మెంబర్ |
| జిల్లాలోని లోకల్ ఫండు అకౌంట్సు ఆడిటు ఆఫీసరు | - | మెంబర్ |
| జిల్లా గ్రంథాలయ సంస్థ సెక్రటరీ | - | కన్వీనర్ |

ఈ కమిటీ వారు ప్రతినెలా సమావేశం కావాలి. సెస్సు వసూళ్ళ గురించి సమీక్ష చేయాలి. జిల్లా గ్రంధాలయ సంస్థకు సెస్సు చెల్లింపజేయటానికి పకడ్బందీ చర్యలు గైకొనాలి. కన్వీనర్ సమావేశం వివరాలను (minutes) పౌర గ్రంధాలయ శాఖ డైరెక్టర్‌కు సమర్పించాలి. డైరెక్టర్ సమీక్షా కార్యక్రమం చేపట్టాలి.

## పీనల్ క్లాజ్

ప్రతి జిల్లాలో వసూలైన గ్రంథాలయ సెస్సును గ్రంధాలయ సంస్థ ట్రెజరీ అకౌంటుకు సకాలంలో జమ చేయని మునిసిపల్, పంచాయితీ, అధికారులపై చర్య గైకొనాలని చట్టంలో పీనల్ క్లాజ్ చేరిస్తే పరిస్థితి మెరుగు కాగలదన్న సూచన తరుచు చేయబడుతూ ఉంది. ఇది అవసరం కూడ. 9 ఫిబ్రవరి 1990 తేదీన ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ రాజారామ్‌మోహన్ రాయ్ లైబ్రరీ ఫౌండేషన్ సహకారంతో గ్రంథాలయ శాసనంపై న్యూఢిల్లీలో ప్రథమ జాతీయ సదస్సు నిర్వహించింది. ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ మాజీ ఉపాధ్యక్షులు డాక్టర్ వెలగా వెంకటప్పయ్య రూపొందించిన మాదిరి గ్రంథాలయ శాసనంపై (Model Act) ఈ సదస్సులో చర్చ జరిగింది. అన్ని రాష్ట్రాలు ఈ మాదిరి శాసనం ప్రాతిపదికగా గ్రంథాలయ శాసనం చేయాలని సిఫార్సు చేయబడింది. ఈ మాదిరి శాసనంలో గ్రంధాలయ సెస్సు నిర్ణీత కాలంలో చెల్లించని వారిపై చర్య గైకొనాలని పీనల్ క్లాజ్ చేర్చబడింది.

మరల 12 ఆగస్టు 1995 తేదీన తెనాలిలో ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ గ్రంథాలయ శాసనం సెక్షనల్ కమిటీ ఛైర్మన్ డాక్టర్ వెలగా వెంకటప్పయ్య నేతృత్వంలో గ్రంథాలయ శాసనంపై 2వ జాతీయ సదస్సు జరిగింది. ఈ సదస్సు అనంతరం ప్రచురింపబడిన డాక్టర్ వెంకటప్పయ్య గ్రంధాలయ శాసనం డ్రాఫ్టులో కూడ పీనల్ క్లాజ్ ఉంది. ఈ క్లాజ్ అవసరాన్ని పలువురు పెద్దలు నొక్కి చెప్పటం జరుగుతున్నది. ఏది ఏమైనా వసూలైన సెస్సు ప్రతి జిల్లాలో గ్రంథాలయ సంస్థ అకౌంటుకు సకాలంలో జమ పడటంలేదు. ప్రతి మునిసిపాలిటీ లక్షలాది సెస్సు బకాయి పడుతూనే ఉంది. మేజర్ పంచాయితీలు కొంత మెరుగైనా మైనరు పంచాయితీల పరిస్థితి మారలేదు.

నిబంధనల ప్రకారం గ్రంథాలయ సంస్థల సిబ్బంది జీతాలు గ్రాంటు-ఇన్-ఎయిడ్ రూపంలో ప్రభుత్వం చెల్లించాలి. అలాగే రిటైర్డు సిబ్బంది గ్రాట్యుయిటీ, శెలవు జీతం, కమ్యుటేషన్ విలువ కూడ ప్రభుత్వమే చెల్లించాలి. గ్రంథాలయ సంస్థలకు ఆదాయం వచ్చే మార్గం గ్రంథాలయ సెస్సు మాత్రమే. సెస్సు సకాలంలో జమ పడనందున గ్రంధాలయ సంస్థలు ఆర్థిక సంక్షోభం ఎదుర్కొంటున్నవి. మూలిగే నక్కమీద తాటి కాయ పడినట్లు ప్రభుత్వం గ్రంధాలయ సంస్థల నిధులు నుండి పెన్షన్ సౌకర్యాలు చెల్లింపవలసిన పరిస్థితి కల్పించింది. బడ్జెట్టులో సిబ్బంది జీతాల పద్దుక్రింద సరిపోయినంత మొత్తాన్ని ప్రభుత్వం కేటాయించటం లేదు. ప్రతి నెల ప్రభుత్వ నిధులనుండి ఇస్తున్న అడ్వాన్సు సేలరీ గ్రాంటుకు మరి కొంత మొత్తం వాటి నిధుల నుండి కలిపి గ్రంథాలయ సంస్థలు సిబ్బంది జీతాలు చెల్లించే పద్ధతిని కూడ ప్రభుత్వం అమలు చేస్తున్నది. ప్రభుత్వం విధించిన ఆంక్షలతో పాటు ఈ కారణాల వలన గ్రంథాలయ సంస్థలు నాలుగు సంవత్సరాల నుండి పుస్తకాలు కొనలేని స్థితిలో చిక్కుకున్నవి. నిధుల కొరత వలన గ్రంధాలయ సంస్థలు పత్రికల బడ్జెట్టులు కూడ గణనీయంగా తగ్గించివేశాయి. పాఠకులకు కొత్త పుస్తకాలు లేకుండా పోయాయి సరికదా చాలినన్ని పత్రికలు చదువుకునే సౌకర్యం కూడ అంతంత మాత్రంగానే ఉంది. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, ప్రాంతీయ గ్రంధాలయాల నిర్వహణతోపాటు సిబ్బంది జీతాలు తదితర సౌకర్యాల ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం నేరుగా భరిస్తున్నది.

## పెన్షన్ రూల్స్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జి.ఓ.యం.యస్.నెం. 1161 తేది 6-12-1978లో గ్రంధాలయ సంస్థల సిబ్బందికి పెన్షన్-కమ్-గ్రాట్యుయిటీ ఫండు రూల్స్ జారీ చేసింది. ఈ నిబంధనల ప్రకారం ప్రభుత్వమే పెన్షన్ సౌకర్యాల ఖర్చు భరింపవలసి ఉంది. 1975 జూలై నుంచి అమలులోనికి వచ్చిన ఈ పెన్షన్ రూల్స్ ప్రకారం సేలరీ గ్రాంటు అడ్వాన్సుగా ఇస్తున్నట్లు గానే పెన్షన్ గ్రాంటు కూడ అడ్వాన్సుగా ఇచ్చే అవకాశం ఉంది. ఈ విధంగా ప్రభుత్వం ఇచ్చే గ్రాంటులతో ప్రతి జిల్లా గ్రంధాలయ సంస్థ పెన్షన్-కమ్-గ్రాట్యుయిటీ ఫండు నిర్వహించాలని షెడ్యూల్-2లోని రూల్ 5లో నిర్దేశింపబడింది.

"5. The grants-in-aid to be sanctioned by government for each year towards meeting the expenditure on pension in respect of each employee of Zilla Grandhalaya Samstha shall be claimed by each Zilla Grandhalaya Samstha in advance. The expenditure on pensions incurred by Zilla Grandhalaya Samstha in excess of the grants sanctioned by government in a year shall be claimed by Zilla Grandhalaya Samstha by way of additional grants in the first quarter of the succeeding year".

ఆచరణలో చూస్తే నిబంధనల్ నిర్దేశించిన ప్రకారం జరగటం లేదు. ముందుగా జిల్లా గ్రంథాలయ సంస్థలు అన్ని పెన్షన్ సౌకర్యాలు చెల్లిస్తున్నవి. ప్రభుత్వం అడ్వాన్సు సేలరీ గ్రాంటు కూడ నెలనెలా సిబ్బంది జీతాలకు సరిపోయినంత ఇవ్వటంలేదు. ప్రభుత్వం ఇస్తున్న సేలరీ గ్రాంటుకు తమ నిధుల నుండి కొంత మొత్తం కలిపి గ్రంథాలయ సంస్థలు సిబ్బంది జీతాలు చెల్లిస్తున్నాయి. గ్రంథాలయ సంస్థలు పెన్షన్ చెల్లింపుకు, జీతాలు చెల్లించుటకు ఖర్చు చేసిన మొత్తాలను గ్రంథాలయ సంస్థలకు కనీసం ఆర్థిక సంవత్సరం ఆఖరులో ఆడిట్ కాగానే 'రీ ఇంబర్స్' చేయటం సముచితంగా ఉంటుంది. అలా జరగటం లేదు.

1991-92 వరకు గ్రంథాలయ సంస్థలు జీతాలు, పెన్షన్ సౌకర్యాలపై ఖర్చు చేసిన మొత్తం మూడు కోట్ల పదమూడు లక్షల పదమూడు వేల రూపాయలను విజయభాస్కర్‌రెడ్డి ప్రభుత్వం జి.ఓ.ఆర్.టి. నె. 599 ఎడ్యుకేషన్ ది. 27-3-1993 జారీ చేసి చెల్లించింది. తర్వాత గత 5 సంవత్సరాల గ్రంథాలయ సంస్థలు ఖర్చు చేసిన మొత్తాలను వాటికి చెల్లించలేదు. గ్రంధాలయ సంస్థలు ఆర్థిక సంక్షోభంలో చిక్కుకున్నవి. 1993 నుండి రిటైరయిన వారికి కూడ గ్రాట్యుయిటీ, కమ్యుటేషన్ కొన్ని జిల్లాల్లో చెల్లించనేలేదు. వారికి రావలసిన సౌకర్యాలు రాకుండానే కొందరు రిటైర్డు సిబ్బంది చనిపోయారు. పుంఖాను పుంఖంగా విజ్ఞప్తులు చేసుకున్నప్పటికి ప్రభుత్వం అర్రియర్ గ్రాంటు ఇన్ ఎయిడ్ రిలీజ్ చేయనే లేదు. ఉద్యోగుల పక్షాన లోకాయుక్త ముందు పిటీషన్ ఫైలు చేయబడింది. గ్రంధాలయ సంస్థలకు నిధులు విడుదల చేయాలని, పెన్షన్ కమ్ గ్రాట్యుయిటీ ఫండు ఏర్పాటు చేయాలని లోకాయుక్త ఉత్తర్వులు జారీ చేశారు. నిబంధనల ప్రకారం ప్రభుత్వమే గ్రంధాలయ సంస్థల్లో రిటైరయిన వారికి చెల్లింపవలసిన మొత్తాలు చెల్లించాలి. ప్రభుత్వేతర పాఠశాలల ఉపాధ్యాయులకు, బోధనేతర సిబ్బందికి పెన్షన్ల చెల్లింపు పద్దుక్రింద 1997-98 బడ్జెట్టులో (విద్యా శాఖ బడ్జెట్ ఎస్టిమేట్స్ వాల్యూమ్ 3/7) 51 కోట్ల రూపాయలు పైగా కేటాయింపబడింది. కాని గ్రంధాలయ సంస్థల్లో రిటైరయిన వారికి ఆ విధంగా కేటాయింపు జరగనే లేదు.

గ్రంథాలయ సంస్థలకు ప్రభుత్వం అదనంగా తన స్వంత నిధులనుండి ఏమీ ఇవ్వనవసరం లేదు. కాకపోతే పనిచేస్తున్న సిబ్బందికి, రిటైరయిన సిబ్బందికి గ్రంథాలయ సంస్థలు చెల్లించిన మొత్లాను మాత్రం నిబంధనల ప్రకారం ప్రభుత్వం వాటికి తిరిగి చెల్లించాలని కోరటం జరుగుతున్నది.

## సూచనలు

గ్రంథాలయ సంస్థలు ఆర్థికంగా పుష్టిని, తుష్టిని చేకూర్చుకోవటానికి దిగువ చర్యలు ప్రభుత్వం సత్వరం తీసుకోవాలి.

1. గ్రంథాలయ సంస్థలకు అర్రియర్ సేలరీ; అర్రియర్ పెన్షన్ గ్రాంటు కాలహరణం లేకుండా పూర్తిగా చెల్లించాలి.
2. గ్రంథాలయ సెస్సును మునిసిపాలిటీలు, పంచాయితీలు నిబంధనల ప్రకారం గ్రంథాలయ సంస్థలకు సకాలంలో చెల్లించునట్లు కట్టుదిట్టమైన చర్యలు గైకొనాలి.
3. ఎయిడెడ్ విద్యా సంస్థల్లో ఉపాధ్యాయులకు, బోధనేతర సిబ్బందికి జీతాలు చెల్లింపుకు పూర్తి సేలరీ గ్రాంటు-ఇన్-ఎయిడ్ బడ్జెట్టులో కేటాయించి అడ్వాన్సుగా చెల్లిస్తున్నట్లు, గ్రంథాలయ సంస్థల సిబ్బందికి కూడ విధిగా చెల్లించాలి.
4. గ్రంథాలయ సంస్థల్లో రిటైరయిన ఉద్యోగుల పింఛను సౌకర్యాలు చెల్లింపుకు కూడ వార్షిక బడ్జెట్టులో చాలినంత మొత్తం కేటాయించాలి.
5. గతంలో గ్రంథాలయ పరిషత్ సిఫార్సు చేసిన విధంగా గ్రంథాలయ సంస్థల్లో రిటైరయిన సిబ్బందికి ప్రభుత్వ ట్రెజరీలు/బ్యాంకుల ద్వారా పెన్షన్ సౌకర్యాలు చెల్లించాలి.
6. కాదంటే పెన్షన్ నిబంధనల్లో నిర్దేశించిన ప్రకారం ప్రతి జిల్లా గ్రంథాలయ సంస్థలో పెన్షన్ కమ్ గ్రాట్యుయిటీ ఫండు ఏర్పాటు చేయాలి.
   ఈ ఫండు ఏర్పాటు చేయాలని ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త ఉత్తర్వు ఇచ్చిఉండటం గమనార్హం.
7. జీతాల చెల్లింపుకుగాని, పెన్షన్ సౌకర్యాల చెల్లిపుకుగాని గ్రంధాలయ సంస్థల నిధులు ఏమాత్రం ఖర్చు చేయరాదు.

గ్రంథాలయ సంస్థలు ఆర్థికంగా బలం పుంజాకుని ప్రజలకు సమర్ధవంతమైన గ్రంధాలయ సేవను అందించటానికి ఈ చర్యలు విధిగా చేపట్టాలి.

# 2.3 గ్రంథాలయశాస్త్ర పంచసూత్రాలూ, పౌర గ్రంథాలయాలూ

- అబ్బూరి ఛాయాదేవి

## గ్రంథాలయాల ఆవశ్యకత

గ్రంథాలయాలు కేవలం పుస్తక భాండాగారాలు మాత్రమే కావు. గ్రంథాలయ నిర్వహణ అంటే ఏవో కొన్ని పుస్తకాలనూ పత్రికలనూ సేకరించి ఒక చోట అలమార్లలో పదిలపరిచి, అప్పుడప్పుడు దుమ్ము దులుపుతూ, పుస్తకాలు కావాలని వచ్చిన వారిని అనుమానాస్పదులుగా చూస్తూ, ఎలాగో విధిలేక పుస్తకాలను వెతకి ఇవ్వడం, ప్రతి ఏటా సమ కూడిన కొద్దిపాటి నిధులను ఆర్థిక సంవత్సరం పూర్తయే ముందు హడావిడిగా ఖర్చుపెట్టడానికి ఏవో కొన్ని పుస్తకాలను కొని అలమార్లలో చేర్చడమూ కాదు. కొంత మంది గ్రంథాలయ నిర్వాహకులకూ, యాజమాన్యానికీ, కొందరు ప్రభుత్వాధికారులకూ ఇటువంటి దృక్పథం ఉండటం వల్లనే గ్రంధాలయాలపట్ల సదవగాహన లేకపోవడం, వాటి పట్ల చిన్న చూపు ఏర్పడటం, వాటి అభివృద్ధికి అవసరమైనంతగా పాటు పడక పోవడం జరుగుతోంది. ఇది ఏనాటి మాటోకాదు. ఇరవై ఒకటవ శతాబ్దంలో ప్రవేశించచున్న తరుణంలో కూడా దేశంలో దాదాపు అదే పరిస్థితి కనిపిస్తుంది. జనంలో చైతన్యాన్నీ, విజ్ఞానాన్నీ పెంపొందించాలంటే గ్రంథాలయ నిర్వహణ శాస్త్రబద్ధంగా జరగాలనీ, గ్రంథాలనూ, ఇతర సమాచార సాధనాలనూ క్రమబద్ధంగా ప్రజలందరికీ అందుబాటులోకి తేవలసిన అవసరం ఉందనీ చాలా మంది పెద్దలు గుర్తించరు. మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి అర్ధ శతాబ్దం అవుతున్నా ఇంకా అక్షరాస్యతా ప్రచార కార్యక్రమానికి ఓనమాలు దిద్దే స్థితిలోనే ఉన్నాం!

## భావి దర్శకుడు

ప్రపంచ జనాభాతో పాటు విజ్ఞానం కూడా విపరీతంగా పెరుగుతోంది. ఆ విజ్ఞానాన్ని గురించిన సమాచారాన్ని ప్రజలకు అందించాలంటే గ్రంధాలయాలు సమాచార కేంద్రాలు కావలసి ఉంది. అందువల్లనే గ్రంధాలయ శాస్త్రం నేడు గ్రంధాలయ, సమాచార శాస్త్రంగా రూపొందింది. ఈ పరిణామాన్ని ముందుగానే ఊహించిన మహామేధావి డాక్టర్ ఎస్.ఆర్. రంగనాథన్. గ్రంథాలయ పంచసూత్రాలను ప్రవచించిన గ్రంధాలయశాస్త్ర జనకుడు రంగనాధన్.

## గ్రంథాలయ పితామహుడు

అయితే, డా. రంగనాథన్ కన్న ముందుగానే గ్రంథాలయాల ఆవశ్యకతని గుర్తించి, పౌర గ్రంథాలయాల వ్యాప్తికి కృషి చేసి, ఆంధ్ర దేశంలోనే కాకుండా భారత దేశంలోనే గ్రంధాలయ పితామహుడిగా పేరు పొందిన మహావ్యక్తి శ్రీ అయ్యంకి వేంకట రమణయ్యగారు. మానవ వికాసానికి - ముఖ్యంగా అస్వతంత్రంగా ఉన్న ఆనాటి మనదేశ ప్రజలలో చైతన్యం కలిగించడానికి గ్రంధాలయాలు ఎంత అవసరమో ఈ శతాబ్దం మొదటి దశాబ్దంలోనే గ్రహించిన అయ్యంకిగారు గ్రంథాలయోద్యమాన్ని ప్రారంభించారు.

"గ్రంధాలయము సాంఘిక సంక్షేమ కేంద్రముగ నుండునట్లు ఎట్లు రూపొందింప గలను? దానిని జ్ఞాన పరిశోధనకు నిలయమగునట్లు చేయుటెట్లు అనుచింతన..."తోనే అయ్యంకి తమ జీవితాంతం గ్రంథాలయోద్యమాన్ని కొనసాగించారు. గ్రంధాలయ నిర్వహణ ఏ విధంగా ఉండాలో, పౌరులను పాఠకులుగా చేయడం ఎలాగో తమ మాటల్లో అయ్యంకి ఈ క్రింది విధంగా సూచించారు -

"చదువరులను ఆకర్షించడం ఎలా?"

1. గ్రంథభాండాగారి ఉత్సాహవంతుడై ఇతరులనుత్సాహ పరచుచు నుండవలెను.
2. ఇతరుల యెడ సహనముతో మెలగవలెను.
3. గ్రామము నందును, సంఘ కార్యకలాపములలోను గ్రంథాలయాధికారి ఉచిత పాత్ర నిర్వహించ వలెను.
4. పుస్తకముల కొరకు పాఠకులు వచ్చినప్పుడు పుస్తకము నిచ్చుటకు వాయిదా వేయరాదు.
5. పాఠకుడు కోరిన గ్రంధము లేనియెడల ఆ గ్రంథ విషయమునకు సన్నిహితమైన మరియొక గ్రంథమును సూచించవలెను.
6. పాఠకులకు కావలసిన గ్రంథములు లేని యెడల సమీప గ్రంధాలయము నుండియు తెప్పించి ఇవ్వవలెను. గ్రామస్థులతో, ముఖ్యంగా పాఠకుల యెడ గ్రంథ భాండాగారి ఆదరాభిమానములతో మెలగవలెను.
7. తన కంటె వయస్సులో పెద్దవారి యెడల వారు నిరక్షరాస్యులైనను వినయముగా మెలగవలెను. చిన్నల యెడ ప్రేమ, ఆదరములను ప్రదర్శించవలెను.
8. చదువరులలో గల బిడియమును పోగొట్టి వారిలో ఉత్సాహము కలుగునట్లు ప్రవర్తింపవలెను.
9. చదువరుల అభిరుచులను, కోర్కెలను గ్రహించుచు క్రమముగా వారి మనస్తత్వమును

గ్రంథభాండాగారి అర్థము చేసి కొనుటకు ప్రయత్నించవలెను. వారి అభిరుచులకు అనుగుణ్యమైన పుస్తకములను అందించుచు, క్రమేణా వారి అభిరుచిని ఉన్నత స్థాయికి తీసుకొని పోవలెను.

10. చదువరి ప్రశాంతముగా చదువు కొనుటకు గ్రంథాలయములో తగు ఏర్పాట్లు చేయవలెను.
11. పాఠకుల దృష్టినాకర్షించు పటములు, చార్టులు, ప్రదర్శనములు ఏర్పాటు చేయవలెను.
12. నిర్ణీత సమయములందు రేడియోల ద్వారా వార్తలను, ఇతర ముఖ్య విషయములను వినిపించునట్లు చేయవలెను. ప్రతి గ్రంథాలయములోను ఆ గ్రామము, జిల్లా, రాష్ట్రము, దేశములకు సంబంధించిన పటములుంచవలెను. ప్రతి గ్రంథాలయములోను ముఖ్యమైన దేశనాయకుల పటములను గూడ నుంచవలెను.

కృష్ణాజిల్లా గ్రంథాలయ సదస్సు అధ్యక్షోపన్యాసము నుండి, 1963".

'అయ్యంకి వారి వాణి...' అనే శీర్షికతో పై సూత్రాలను డా. వెలగా వెంకటప్పయ్యగారు 'గ్రంథాలయ పితామహ, భారత పౌరగ్రంథాలయ శిల్పి అయ్యంకి వెంకటరమణయ్య (1907-1979)' అనే గ్రంథంలో పొందుపరిచారు.

## డా. ఎస్. ఆర్. రంగనాథన్

అదే విధమైన తపనతో డా. ఎస్.ఆర్. రంగనాథన్ 1931లో 'గ్రంధాలయశాస్త్ర పంచసూత్రాలు' అనే గ్రంథాన్ని రచించారు. అప్పటికి రంగనాథన్‌కి అయ్యంకి గారితో పరిచయం ఏర్పడినప్పటికీ ఆంధ్రదేశంలోని గ్రంథాలయ స్థితిగతుల గురించి అంతగా తెలియక వాటి గురించి వ్యతిరేకంగా వ్యాఖ్యానించారు తమ గ్రంధంలో. ఆంధ్రదేశంలో గ్రంథాలయాలు క్షీణదశలో ఉన్నవన్న వ్యాఖ్యని అయ్యంకి వారు ఖండించడంతో పాటు, '15వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ' వారు కూడా తీర్మాన రూపంలో తీవ్ర అభ్యంతరం తెలిపారు. చివరికి, ఆగ్రంథం ద్వితీయ ముద్రణలో (1933) ఆ అభ్యంతరకర వ్యాఖ్యల్ని రంగనాథన్ తొలగించారు. ఆ తరవాత చాలా కాలానికి హైదరాబాదులో 1962 లో 'ఆంధ్ర వాఙ్మయ సంగ్రహసూచిక' ఆవిష్కరణోత్సవంలో ఆ గ్రంథాన్ని రంగనాథన్‌కి అంకితం చేసిన సందర్భంలో, రంగనాథన్ తమకు చేసిన సన్మానానికి ప్రతిస్పందిస్తూ, తాను ఇదివరలో చేసిన పొరపాటును సభాముఖంగా ఒప్పుకుని తన భవిష్యత్తును మలచుకోవటానికి అప్పటివరకూ ఆంధ్రులు ఇచ్చిన చేయూతకి కృతజ్ఞతలు తెలియజేస్తూ, అయ్యంకి వారికి ప్రత్యేకంగా అభినందనలు తెలిపారుట.

అటువంటి రంగనాథన్ మహామేధావిగా, భారత దేశంలో గ్రంథాలయ శాస్త్ర జనకుడిగా, గ్రంథాలయరంగంలో అగ్రగణ్యుడిగా ఎలా రూపొందారో సంగ్రహంగానైనా స్మరించుకోవాలి.

## రంగనాథన్ వికాసం : ప్రథమ దశ

రంగనాథన్ మద్రాసు రాష్ట్రంలో తంజావూరు జిల్లాకి చెందిన శియాలి అనే చిన్న పట్నంలో 1892 ఆగస్టు 9న జన్మించారు. అక్కడే మెట్రిక్యులేషన్ వరకూ చదువుకున్నారు. కాలేజి చదువు మద్రాసు క్రిష్టియన్ కాలేజిలో సాగింది. గణిత శాస్త్రంలో ప్రథమ శ్రేణిలో ఎం.ఎ.డిగ్రీ పొందారు. ఆయన గురువు ప్రొ. ఎడ్వర్డ్ బి.రాస్. ఆయన రంగనాథన్‌ని చాలా ప్రభావితుల్ని చేశారు. మహామేధావిగా వికసించేందుకు దోహదం చేశారు. ఎం.ఎ. తరవాత రంగనాథన్ కొంత కాలంపాటు సైదాపేటలోని టీచర్స్ కాలేజిలో అధ్యాపకుడిగా పని చేశారు. కొద్దిపాటి నత్తి ఉన్నప్పటికీ పట్టుదలతో ఆ లోపాన్ని త్వరలో అధిగమించ గలిగారు. ఆ కాలేజిలో పనిచేసిన సంవత్సరంలోనే సంస్థ నిర్వహణలో అనుభవాన్ని పొందారు. ఆ కాలేజి గణితశాస్త్ర విభాగానికి కార్యదర్శి అయ్యారు. అధ్యాపక విధానాల్లోనూ, విద్యార్థులలో ఉత్సాహం కలిగించడంలోనూ ఎన్నో ప్రయోగాలు చేసేవారు. ఆ అనుభవాలే భావి గ్రంథాలయ శాస్త్ర వికాసానికి పునాదులయాయి. కొన్నాళ్లు మంగుళూరులోని ప్రభుత్వ కళాశాలలో పనిచేశాక, 1921లో మద్రాసులోని ప్రెసిడెన్సీ కాలేజిలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా చేరారు. అక్కడ కూడా గణిత విజ్ఞాన శాస్త్ర విభాగానికి కార్యదర్శి అయారు. సంస్థ నిర్వహణలో ప్రావీణ్యాన్ని సంపాదించారు. దేన్నైనా క్రమశిక్షణతో పట్టుదలగా నిర్వహించడం ఆయన ప్రవృత్తి. గణిత శాస్త్రంలో గణనీయమైన పరిశోధనా వ్యాసాలు రాసి సదస్సుల్లో పాల్గొనే వారు. అదే రంగంలో నిమగ్నులై ఉన్న తరుణంలో మద్రాసు యూనివర్సిటీలో లైబ్రేరియన్ కోసం ఒక ప్రకటన వెలువడింది. ఆ ఉద్యోగానికై ప్రయత్నించమని తోటి అధ్యాపకులు రంగనాథన్‌ని ప్రోత్సహించారు. అనాసక్తికరంగానే ప్రయత్నించినప్పటికీ, ఇంటర్వ్యూలో ఆయన చూపించిన చొరవనీ, గణితశాస్త్రంపై పరిశోధనా వ్యాసాలు రాయగలిగిన ప్రతిభనీ ప్రశంసించి, ఆ లైబ్రేరియన్ ఉద్యోగానికి రంగనాథన్ ఒక్కరినే అర్హులుగా ఎంచడం జరిగింది.

## రంగనాథన్ - గ్రంథాలయ నిర్వహణ అధ్యయనం

1924 జనవరిలో మద్రాసు యూనివర్సిటీలో లైబ్రేరియన్‌గా చేరారు. అప్పటికి రంగనాథన్‌కి గ్రంథాలయ నిర్వహణ గురించి బొత్తిగా తెలియదు. అక్కడ పనిచేసే కింది ఉద్యోగిని ప్రతీదీ అడగవలసి వచ్చేది. పుస్తకాలను స్వయంగా కేటలాగ్ చేయడం నేర్చుకున్నారు. తరవాత

'లైబ్రేరియన్‌షిప్' అధ్యయనం చేయడానికి యూనివర్సిటీ వారు రంగనాథన్‌ని లండన్ పంపించారు. ఒక సంవత్సరం పాటు లండన్‌లో విద్యాభ్యాసం చేశారు. అక్కడే ఆయనకు క్రోయ్‌డన్ పబ్లిక్ లైబ్రరీ ప్రధాన గ్రంథాలయాధికారీ, లండన్ యూనివర్సిటీ స్కూల్ ఆఫ్ లైబ్రేరియన్‌షిప్‌లో అధ్యాపకుడూ అయిన డబ్ల్యూ.సి. బెరివిక్‌సేయర్స్ గురువుగా, మార్గదర్శిగా, స్నేహితుడిగా లభించారు. ముఖ్యంగా పౌర గ్రంథాలయోద్యమానికి స్ఫూర్తి దాయకులయారు. రంగనాథన్ లండన్ యూనివర్సిటీ కాలేజిలో శిక్షణ పూర్తిచేసి డిప్లొమా పొందారు. శిక్షణ తరగతిలో మొదటి రోజునే ఆయనకి "గ్రంథాలయ శాస్త్రం" అనాలనే ఉద్దేశం కలిగింది. గణితశాస్త్రానికి స్వస్తి చెప్పి, తన జీవితమంతటినీ గ్రంథాలయ రంగానికే అంకితం చేసుకోవాలని నిర్ణయించుకున్నారు.

అప్పటికే ప్రసిద్ధి కెక్కిన 'డెసిమల్ క్లాసిఫికేషన్' పద్ధతి రంగనాథన్‌కి నచ్చలేదు. అది తృప్తికరంగా అనిపించలేదు. అంతకంతకు రూపొందుతున్న నూతన విజ్ఞాన విషయాలకు దశాంక విషయ విభజనలో సముచిత స్థానాలు లభించలేదన్న సత్యాన్ని గ్రహించారు. అప్పటికి అమలులో ఉన్న కేటలాగింగ్ పద్ధతితో కూడా ఆయన తృప్తి చెందలేదు. 'డిక్షనరీ కేటలాగ్' తో సంతృప్తి పడలేదు. 'కోలన్ క్లాసిఫికేషన్' పద్ధతినీ, 'క్లాసిఫైడ్ కేటలాగ్ కోడ్'నీ స్వయంగా రూపొందించడానికి పూనుకున్నారు.

ఆ రోజుల్లో మన దేశంలో అప్పటికింకా గ్రంథాలయ శిక్షణ అనేది లేదు. మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీలో పని చేయడానికి దరఖాస్తు పెట్టిన వారిలో (1925 ప్రాంతంలో) 16 సంవత్సరాల వయస్సు వారి నుంచి 80 సంవత్సరాల వయస్సు వారి వరకూ ఉన్నారుట! అంటే, అదొక కాలక్షేపంగా మాత్రమే పరిగణించేవారనీ, గ్రంథాలయ వృత్తిపట్ల సరియైన అవగాహన లేదనీ అర్థమవుతుంది.

గ్రంథాలయ పితామహులు శ్రీ అయ్యంకి భావించినట్లుగానే డా. రంగనాథన్ కూడా గ్రంథాలయం కేవలం పుస్తక భాండాగారం మాత్రమే కాదనీ, అదొక విద్యాలయం, సాంఘిక, సాంస్కృతిక కేంద్రం కావాలనీ విశ్వసించారు, ఆశించారు. ఆ ఆశయం కోసం కృషి చేశారు. గ్రంథాలయ నిర్వహణ వృత్తిని సంఘసేవా ధర్మంగా పరిగణించారు. సంపాదనకు కాకుండా సేవాధర్మానికే ప్రాధాన్యాన్నిచ్చారు. అందుకే పౌరగ్రంథాలయాభివృద్ధికి పూనుకున్నారు. విశ్వవిద్యాలయ గ్రంథాలయాన్ని కూడా ప్రజలకు అందుబాటులోకి తెచ్చారు.

విద్యాభివృద్ధీ, గ్రంథాలయ వికాసం వ్యక్తిగత చైతన్యానికీ, దేశ స్వాతంత్ర్యానికీ మూలమని గ్రహించి పౌర గ్రంథాలయోద్యమాన్ని తమ జీవిత పరమార్థంగా ఎంచిన అయ్యంకితో కలిసి రంగనాథన్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ వార్షిక సమావేశాల సందర్భంగా అఖిల భారత పౌర

గ్రంథాలయాల సమావేశాలు ఏర్పాటు చేసేవారు. పౌర గ్రంథాలయాలు ప్రజాస్వామ్యానికి ప్రతీకలుగా భావించేవారు. 1928లో 'మద్రాసు గ్రంథాలయ సంస్థ'ని ఏర్పరిచారు. గ్రామాలకు గ్రంథాలయాలను అందుబాటులోకి తీసుకు వెళ్ళాలనే ప్రయత్నంలో రెండెడ్లబండితో సంచార గ్రంథాలయాన్ని ప్రారంభించారు. 194౯లో వారణాసికి తరలి వెళ్ళే వరకూ రంగనాథన్ మద్రాసు గ్రంథాలయ సంస్థకు కార్యదర్శిగా కొనసాగారు.

(రంగనాథన్ గ్రంథాలయ జీవితంలో ప్రథమ దశని మాత్రమే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. జీవితమంతా గ్రంథాలయ రంగానికి అంకితం చేసిన రంగనాథన్ వృద్ధాప్యంలో అనారోగ్య దశలో ఉంటూ కూడా సమాచార విస్తరణ గురించీ, ఆధునిక సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి అనుగుణంగా పాఠకుల అవసరాలను గుర్తించి, నూతన సమాచార సేవా మార్గాలను రూపొందించడం గురించీ రాత్రీ పగలూ ఆలోచిస్తూ, శిష్యులతో నిత్యం చర్చలు జరుపుతూ ఉండేవారు. బెంగుళూరులో ఉన్న డాక్యుమెంటేషన్ రీసెర్చ్ అండ్ ట్రెయినింగ్ సెంటర్‌కి ఒక సదస్సులో పాల్గొనడానికి ఇండియన్ స్కూల్ ఆఫ్ ఇంటర్‌నేషనల్ స్టడీస్ లైబ్రరీ నుంచి వెళ్ళినప్పుడూ, మరొక సారి జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ లైబ్రరీ తరపున కొద్దికాలం శిక్షణ పొందడానికి వెళ్ళినప్పుడూ నాకు డా. రంగనాథన్‌తో ప్రత్యక్ష పరిచయం ఏర్పడే అదృష్టం కలిగింది. 'కోలన్ క్లాసిఫికేషన్' పద్ధతిని అనుసరించే ప్రసిద్ధ గ్రంథాలయంలో రెండు దశాబ్దాల పాటు పనిచేసే భాగ్యం కలిగింది నాకు).

## గ్రంథాలయశాస్త్ర పంచసూత్రాల ప్రచురణ

రంగనాథన్ రచించిన 'గ్రంథాలయశాస్త్ర పంచసూత్రాలు' అనే గ్రంథం మొదటిసారిగా 1931లో ప్రచురింపబడింది. గ్రంథాలయాల ప్రయోజనానికీ, గ్రంథాలయాల నిర్వహణకీ, గ్రంథాలయాల భవితవ్యానికీ సంబంధించిన, మార్గదర్శక మైన మౌలిక సూత్రాలివి :

.... - పుస్తకాలు ఉపయోగం కోసం

.... - ప్రతి పాఠకుడికీ తన పుస్తకం

.... - ప్రతి పుస్తకానికీ తన పాఠకుడు

.... - పాఠకుడి సమయాన్ని పొదుపు చెయ్యాలి.

.... - గ్రంథాలయం వర్ధమాన సజీవ సంస్థ

గ్రంథాలయశాస్త్రంలో పంచసూత్రాలను మొట్టమొదటిసారిగా 1928లో చిదంబరంలోని మీనాక్షి కాలేజిలో ప్రాంతీయ సమావేశంలో 1000 మంది అధ్యాపకుల నుద్దేశించి చేసిన 10 ఉపన్యాసాలలో ప్రతిపాదించి, దృశ్య శ్రవణ మార్గాల ద్వారా వివరించారు. ఫలితంగా 1929లో

మద్రాసు గ్రంథాలయ సంస్థ ద్వారా వేసవి సెలవుల్లో గ్రంథాలయ శాస్త్రాన్ని బోధించే తరగతులను ఏర్పాటు చేశారు. ఆ తరవాత ఆకార్యక్రమం గ్రంథాలయ కళాశాల స్థాపనకి దారి తీసింది. మొత్తం దేశంలో 'లైబ్రరీ స్కూల్స్' ఏరర్పడటానికి నాంది అయింది. 1933లో 'కోలన్ క్లాసిఫికేషన్' గ్రంధాన్ని ప్రచురించారు.

'డెసిమల్ క్లాసిఫికేషన్' పద్ధతిని రూపొందించి, అప్పటికే ఇంగ్లీషు దేశాల్లో ఖ్యాతి గడించిన మెల్‌విల్ డ్యూయీ రంగనాథన్‌ని హెచ్చరించాడు - 'కోలన్ క్లాసిఫికేషన్' పద్ధతిని కొత్తగా ప్రవేశపెట్టడం సులభం కాదు, ఎన్నో ఇబ్బందుల్నీ విమర్శల్నీ ఎదుర్కోవలసి వస్తుంది అని. అయినా రంగనాథన్ చెక్కుచెదరలేదు. విజయమో, పరాజయమో, దేన్నైనా ఎదుర్కోవడానికి సంసిద్ధులయారు. ఈ సంగతిని ఆయన తన "Prolegomena to library classification" అనే గ్రంథం (ద్వితీయ ముద్రణ, 1952) లో వివరించారు.

## విజ్ఞాన విభజన - పుస్తక విభజన

వివిధ రకాల విజ్ఞానాన్ని అందించే పుస్తకాలను వాటిలోని సూక్ష్మాంశాలతో సహా విభజించగలిగేలా 'కోలన్ క్లాసిఫికేషన్' పద్ధతిని రూపొందించారు రంగనాథన్. నిరంతరం అనేక కోణాల్లో అభివృద్ధి చెందుతున్న విజ్ఞానానికి అనుగుణంగా పుస్తక విభజన చేసి ఒక క్రమంలో ఏర్పాటు చేయగల సామర్థ్యాన్ని ప్రదర్శించారు. వివిధ విషయాల లక్షణాలను బట్టి విషయ విభజన చేయడం, 'విశ్లేషణ - సమన్వయ పద్ధతి' Analytico synthetic method ని అనుసరించి వివిధ విషయాల మధ్యా, అంశాల మధ్యా సంబంధాలను నిర్ణయించి, వాటిని నిర్ణీత పద్ధతిలో కూర్చి, వాటిని అక్షరాలతో, అంకెలతో - వాటిని కోలన్‌తో కలిపి సూచించడం 'కోలన్ క్లాసిఫికేషన్' ప్రత్యేకత. విశ్వవిజ్ఞాన సముదాయంలో ఎన్ని కొత్త విషయాలూ, కొత్త అంశాలూ చేరినా, వాటి వాటి సంబంధాలను పుస్తకాలలో ఆవిష్కరింపబడిన విధంగా అక్షరాలు - అంకెలతో సూచిస్తూ పుస్తకాలను సూక్ష్మంగా విభజించగలగడం, వివిధ విషయాలకూ అంశాలకూ మధ్య సంబంధాలను ఒకే వరుసలో ప్రదర్శించగలగడం రంగనాధన్ సాధించిన విలక్షణత, విశిష్టత.

## పంచలక్షణాలుగా విభజన

విషయ విభజనకు రంగనాధన్ సూచించిన సామాన్య లక్షణాలు అయిదు - 1 మూర్తిమత్వం, 2. పదార్థం 3. క్రియాశక్తి, 4. స్థలం 5. సమయం. మన వాక్య నిర్మాణంలో 'కర్త, కర్మ, క్రియ' అనే భాగాల్లాగ ప్రతి విజ్ఞాన విషయాన్నీ అయిదు లక్షణాల ప్రకారం విభజించవచ్చు. ప్రతి

ముఖ్య విజ్ఞాన విషయాన్నీ ప్రతిసారీ విశ్లేషించి విభజించనక్కర్లేకుండా ఇంతవరకు విజ్ఞాన ప్రపంచంలో వాడుకలో ఉన్న విభజనని అనుసరించి రంగనాథన్ స్వయంగా వర్గీకరించి వాటికి అక్షరాలనూ అంకెలనూ సూచించారు. గణితశాస్త్రం, భౌతికశాస్త్రం, మతం, తత్త్వశాస్త్రం, విద్య, చరిత్ర, సాంఘిక శాస్త్రం - ఇలా గుర్తింపు పొందిన విజ్ఞాన విభాగాలను వాటి వాటి ప్రత్యేకతలను బట్టి వాటి లక్షణాల ప్రకారం విభజించారు. స్థలం, సమయం అనే లక్షణాలను అవసరమైన ప్రతి విషయానికీ జోడించుకోవచ్చును. కొత్త విజ్ఞాన విషయాలను గాని, కొత్త అంశాలను గాని అంతకు ముందు ఉన్న పట్టికలకు జోడించవలసి వస్తే పరిశోధకులూ, విజ్ఞానవేత్తలూ గ్రంథాలలో వ్యవహరిస్తున్న విధానానికి అనుగుణంగా వాటి స్థానాలకు నిర్ణయించి జోడించవచ్చు.

కంప్యూటర్లను గ్రంథాలయాలకు ఉపయోగించ వచ్చునని ఊహించని రోజుల్లోనే అందుకు తగినట్లుగా బహుముఖీనమైన 'విశ్లేషణ - సమన్వయ పద్ధతి'ని రూపొందించి ఎన్నిరకాల అంశాలనైనా సూక్ష్మంగా వర్గీకరించగలనేర్పుని ప్రదర్శించారు రంగనాథన్. ఏ సూక్ష్మ అంశం మీద సమాచారాన్ని కోరిన పాఠకుడినైనా సంతృప్తి పరచగల వర్గీకరణను సుసాధ్యం చేశారు. పత్రికలలోని వ్యాసాలనూ, రిపోర్టులనూ, గణాంక వివరాలనూ వేటినైనా వర్గీకరించే పద్ధతిని సృష్టించారు. గణితశాస్త్రంలోనూ, తర్కశాస్త్రంలోనూ ఆయనకున్న పాండిత్యం వల్ల ఈ రకమైన వర్గీకరణ పద్ధతిని సులభ గ్రాహ్యంగా పాఠకుల రకరకాల అవసరాలను దృష్టిలో పెట్టుకుని రూపొందించారు.

ఈ పద్ధతిలో శిక్షణ పొందడం వల్ల, నిత్య జీవితంలో ఏ సమస్యనయినా తార్కికంగా విశ్లేషించి సమన్వయ దృష్టితో దాని సముచిత స్థానాన్ని నిర్ణయించగలగడం అలవడుతుంది. చెల్లా చెదురుగా ఉన్న అనేక వస్తువులను ఒక క్రమంలో ఏర్పరచాలంటే, వాటి వాటి ప్రయోజనాన్ని బట్టీ, ఆకారాన్ని బట్టీ, అవసరాన్ని బట్టీ, ప్రాముఖ్యాన్ని బట్టీ, ఇంకా ఎన్నోరకాలుగా విభజించవచ్చు. మళ్ళీ వాటన్నిటినీ వాటి మధ్య ఉన్న సంబంధాలను బట్టి ఒక క్రమంలో ఏర్పాటు చేయవచ్చు. ఆ విధంగా ప్రతి విషయాన్నీ విభజించడంలో 'విశ్లేషణ - సమన్వయ పద్ధతి'ని అనుసరించి సులభంగా అవగాహనతో వ్యవహరించవచ్చు.

## గ్రంథ సూచికలు

పుస్తకాల సూచికలను కార్డులపై తయారు చేయడానికి కూడా రంగనాథన్ పుస్తక విభజనకి అనుగుణంగా, పాఠకులకు మరింత సహాయకరంగా ఉండేటట్లు 'క్లాసిఫైడ్ కేటలాగ్ కోడ్'ని రూపొందించారు. ఈ కేటలాగ్‌లో మూడు భాగాలుంటాయి - 1 పుస్తకాలు

ఏ విధంగా వర్గీకరింప బడి అలమార్లలో ఏర్పాటై ఉన్నాయో అదే క్రమంలో నంబర్ల ప్రకారం (పుస్తకాలపై ఉన్న వర్గీకరణ నంబర్లు) కార్డులు కూడా ఏర్పాటై ఉంటాయి. వాటిలో పుస్తకాల తాలూకు, ముఖ్య వివరాలన్నీ - ప్రతి పుస్తకానికీ ఉంటాయి 2. గ్రంథకర్తల పేర్లతోనూ, గ్రంథాలపేర్లతోనూ, ఇతర శీర్షికలతోనూ అకారాది క్రమంలో కార్డులు ఏర్పాటయి ఉంటాయి, వీటిలో కూడా పుస్తకాల ముఖ్య వివరాలు ఉంటాయి; 3. విషయ సూచిక కార్డులు అకారాది క్రమంలో ఉంటాయి - ఏ విషయానికి, ఏ అంశానికి ఏ వర్గీకరణ నంబరు ఇచ్చినదీ, ఆ విషయంపై పుస్తకాలు ఎక్కడ ఏ వరసలో దొరికేదీ తెలుస్తుంది. ఈ సూచిక ద్వారా ఈ విధంగా ఎక్కడా కలగలుపు లేకుండా స్పష్టంగా వేటికవి తెలిపే పద్ధతిని రూపొందించారు రంగనాథన్.

అంతేకాదు. ఏ పుస్తకంలోని విషయం అయినా ఏ అంశాలను తీసుకుని రాసినదీ, ఏ దేశానికి, ఏ ప్రాంతానికి సంబంధించి రాసినదీ, ఏ కాలపరిధి వరకు రాసినదీ కూడా పరిగణనలోకి తీసుకుని పుస్తకాలు, పత్రికల్లోని వ్యాసాలు, మొదలైన వాటిని సూక్ష్మంగా వర్గీకరించి వాటికి తగిన సూచికలను తయారు చేయడం వల్ల మేధావులూ, పరిశోధకులూ, పండితులూ మొదలుకుని సామాన్యుల వరకూ ఎవరికి ఏ రకం సమాచారం కావాలన్నా సమయం వృధా కాకుండా లభిస్తుంది.

## అరువు పద్ధతి

పుస్తకాలను పాఠకులు ఇంటికి తీసుకు వెళ్లడానికీ, తిరిగి ఇవ్వడానికీ సంబంధించిన రికార్డులను ఏర్పాటు చెయ్యడంలో కూడా కొత్త పద్ధతిని ప్రవేశపెట్టారు రంగనాథన్. పుస్తకాలు తీసుకున్న తారీఖుల ప్రకారం సభ్యుల టిక్కెట్లను 'బుక్ కార్డు'లతో సహా ఒక వరసలో అమర్చడమే కాకుండా, పుస్తకాల వర్గీకరణ నంబర్ల ప్రకారం (తాత్కాలికంగా నంబర్లూ, తేదీలూ రాసిన కార్డులు) మరో వరుసలో ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఈ నంబరు కింద ఏ తేదీన పాఠకుడు ఆ నంబరు గల పుస్తకాన్ని అరువు తీసుకుని వెళ్లినదీ రాసి ఉంటుంది. ఎవరైనా పాఠకుడు ఫలానా వర్గీకరణ నంబరుగల పుస్తకం ఎవరికైనా అరువు ఇచ్చారా, ఎవరికి ఇచ్చారు, ఎప్పుడు ఇచ్చారు - అనే వివరాలు అడిగినప్పుడు వెంటనే సమాధానం చెప్పడానికి వీలవుతుంది. సిబ్బంది సమయంతో పాటు పాఠకుడి సమయమూ వృధా కాకుండా ఉంటుంది.

## పంచసూత్రాల అన్వయం

గ్రంథాలయ నిర్వహణకి సంబంధించిన ప్రతి అంశంలోనూ స్పష్టమైన మార్గదర్శక సూత్రాలను వివరించారు రంగనాథన్. ఆయన గ్రంథాలయ నిర్వహణకి సంబంధించినవి

62 పుస్తకాలూ, మూడు వందలకు పైగా వ్యాసాలూ, ప్రసంగ వ్యాసాలూ, ఇంకా ఎన్నో రాశారు. ఇవన్నీ తాను ప్రతిపాదించిన 'గ్రంథాలయశాస్త్ర పంచసూత్రాల'కు అనుగుణంగా గ్రంథాలయ నిర్వహణను మెరుగు పరచడానికీ, పాఠకుల అవసరాలను తీర్చగలగడానికీ ఉద్దేశింపబడినది.

## మొదటి సూత్రం

"పుస్తకాలు ఉపయోగం కోసం" అనే మొదటి సూత్రం మొత్తం గ్రంథాలయాల ప్రాధాన్యాన్ని తెలిపే మూలసూత్రం. పైకి ఎంతో స్వల్పమైనదిగా, సర్వసామాన్యంగా కనిపిస్తుంది. కాని, దాని అంతరార్థాలు అనంతం. రంగనాథన్ ఆ సూత్రాన్ని న్యూటన్ ప్రప్రథమంగా ప్రతిపాదించిన 'చలన సూత్రం' తోనూ, ఉపనిషత్తుల్లోని ప్రధమ నీతి సూత్రం 'సత్యం వచించు' అనే దానితోనూ పోల్చారు - 'గ్రంథాలయశాస్త్ర పంచసూత్రాలు' గ్రంథంలో. గ్రంథాలయాలు నిరంతరం అభివృద్ధికరంగా ఉండేటట్లు నిర్వహించడానికి గ్రంథాలయ శాస్త్ర పంచసూత్రాలు మార్గదర్శకమవుతాయని గ్రహించవచ్చు.

## సూత్రాలు 2, 3, 4

ఈ సూత్రాలు మూడూ పాఠకులకు పట్టం కట్టేవీ, పుస్తకాలనూ పాఠకులనూ సన్నిహితం చేసేవీ. 'ప్రతి పాఠకుడికీ తన పుస్తకం', 'ప్రతిపుస్తకానికీ తన పాఠకుడు', 'పాఠకుడి సమయాన్ని పొదుపు చెయ్యాలి' అనడంలో ఉద్దేశం - ఏ పుస్తకాన్ని పాఠకుడు కోరినా (ఏ సమాచారాన్ని కోరినా) దాన్ని గ్రంథాలయం నుంచి పొంద గలగాలి; ఏ పుస్తకమూ పాఠకుడు లేకుండా, ఉపయోగం లేకుండా గ్రంథాలయంలో దుమ్ము కొట్టుకొని పడి ఉండకూడదు, ఆ పుస్తకానికి తగిన పాఠకుల దృష్టికి తీసుకు రావలసిన బాధ్యత గ్రంథాలయ నిర్వాహకులది; పాఠకులకు కావలసిన పుస్తకాన్ని/సమాచారాన్ని అందజేయడంలో ఎటువంటి ఆలస్యం, అశ్రద్ధా ఉండకూడదు అని.

ఇక్కడ 'పుస్తకం' అంటే పుస్తకం ఒక్కటే అని కాదు. పత్రికలైనా, పత్రాలైనా, ఏ సమాచారాన్నిచ్చేదైనా దాన్ని గ్రంథాలయాలు పాఠకులకు అందజేయ గలగాలి. అన్ని రకాల సమాచారం ఒకే గ్రంథాలయం అందజేయాలి అని కాదు. అది వాస్తవికంగా అసంభవం. గ్రంథాలయాల మధ్య పరస్పర సహకారం పెంపొందించుకోవడం అవసరం. పాఠకులకు సంతృప్తి కలిగించడం, వారి విజ్ఞాన సముపార్జనకి దోహదం చెయ్యడం గ్రంథాలయాల బాధ్యత. ముఖ్యంగా పౌర గ్రంథాలయాలు తీసుకోవలసిన బాధ్యతలు అనేకం. సామాన్య ప్రజలకు, ముఖ్యంగా గ్రామీణ ప్రజలకు విజ్ఞానాన్ని అందించి వారిని చైతన్యవంతుల్ని చేయవలసిన బాధ్యత వాటిదే.

ముఖ్యంగా బాలల కోసం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది. పాఠశాలల్లోని గ్రంధాలయాలు ఆర్థిక కారణాల వల్ల అన్ని సదుపాయాలూ కలుగజేయలేకపోవచ్చు. కాని, పౌర గ్రంధాలయాల్లో బాలల శాఖను ఆదర్శప్రాయంగా నిర్వహించవలసి ఉంటుంది. ప్రస్తుతం మనకి తెలుగులో అందుబాటులో ఉన్న బాలల సాహిత్యమే అంత ఎక్కువగా లేదు. బొమ్మలతో, పెద్ద పెద్ద అక్షరాలతో ఆకర్షణీయంగా అచ్చువేయడానికి ప్రచురణ ధరలు అనుకూలంగా లేక, ఒక వేళ ఎలాగో ప్రచురించినా వాటిని కొనేవాళ్ళు లేక బాలల పుస్తక రచయితలకు పరిస్థితులు ప్రోత్సాహకరంగా లేవు. అయితే, ప్రస్తుతం ఉన్న వాటిని కూడా సేకరించి, అడిగిన వెంటనే అందుబాటులోకి తీసుకురాలేని పరిస్థితులు నెలకొని ఉన్నాయి. అనేక పౌర గ్రంథాలయాల్లో. అలమార్లలో ఒక క్రమ పద్ధతిలో పుస్తకాలను ఎప్పటికప్పుడు ఉంచకపోవడం, పుస్తకాల వివరాలను సూచించే కార్డులు లేకపోవడం, ఫలానా పుస్తకం ఉందో లేదో కూడా చెప్పలేని పరిస్థితిలో రికార్డులూ కార్డులూ ఉండడం, పిల్లలు కూర్చుని చదువుకోవడానికి తగిన ఎత్తులో కుర్చీలూ బల్లలూ లేకపోవడం. తగినంత వెలుతురు లేకపోవడం, ఆకర్షణీయమైన పరిసరాలూ, పుస్తకాల ప్రదర్శనలూ లేకపోవడం మొదలైన లోపాలవల్ల బాలలకు పుస్తక పఠనానికి తగిన ప్రోత్సాహం లభించడం లేదు.

పిల్లలకే కాదు, పండితులకూ, పరిశోధకులకూ, వయో వృద్ధులకూ అందరికీ అవసరమైన పుస్తకాలనూ, ఇతర సమాచార సాధనాలనూ అందించగలిగి ఉండాలి పౌర గ్రంథాలయాలు.

## సత్వరసేవ

పాఠకులకు మార్గదర్శనం చేయించడం, కావలిసిన పుస్తకాన్ని గాని ఇతర సమాచార సాధనాన్ని గాని సత్వరం అందించగలగడం ముఖ్యం. దీన్నే 'ఆచూకీ సేవ' అంటారు. 'పాఠకుడి సమయాన్ని పొదుపు చెయ్యాలి' అనే నాల్గవ సూత్రం నీతి సూత్రం. గ్రంథాలయ నిర్వాహకుల, ఉద్యోగుల ప్రథమ కర్తవ్యం పాఠకులను ఆదరించడమే. ఎన్ని పుస్తకాలను సేకరించారన్నది గాని, ఎంత ఖర్చుపెట్టారన్నది గాని కాదు ముఖ్యం - వాటిని ఎంత సమర్థవంతంగా ఏర్పాటు చేశారు, ఎంత సమర్ధవంతంగా పాఠకులకు అందించగలుగుతున్నారు అన్నది ప్రధానం. గ్రంధాలయానికి పేరు వచ్చినా పోయినా - ఆ గ్రంధాలయం ప్రజలకు విజ్ఞాన సేవచేసే విధానాన్ని బట్టి ఉంటుంది. పాఠకుల కోసమూ, పుస్తకాల వినియోగం కోసమే గ్రంథాలయాలను నడపాలి అనే మౌలిక సత్యాన్ని గుర్తించినప్పుడే గ్రంథాలయాల ప్రయోజనం నెరవేరుతుంది.

## అయిదవ సూత్రం

గ్రంథాలయ శాస్త్రంలో అయిదవ సూత్రం "గ్రంథాలయం వర్ధమాన సజీవ సంస్థ" అనేది. ఒక గ్రంథాలయాన్ని ఒక చోట స్థాపించి, కొన్ని పుస్తకాలూ పత్రికలూ కొని ఉంచగానే

సరిపోదు. సజీవమైన ప్రాణిని ఎలా నిత్యం శ్రద్ధగా పోషిస్తూ ఉండాలో అలాగే జీవం ఉన్న సంస్థ అయిన గ్రంథాలయానికి నిరంతరం పోషణతో పాటు ముందు జీవితానికి తగిన ప్రణాళికలు రూపొందించి వాటికి తగిన ఏర్పాట్లు చేయడం అవసరం. కొత్త పుస్తకాలను సేకరించడంతో పాటు, మధ్య మధ్య శిథిలావస్థలో ఉన్న వాటినీ, నిరుపయోగమైన వాటినీ బాగు చేయించడమో, బహిష్కరించడమో లేదా వాటిలో అవసరమైన వాటిని వేరే చోటికి తరలించి పరిరక్షించడమో చెయ్యవలసి ఉంటుంది. మానవ శరీరానికీ, మనస్సుకీ ఎన్ని అవసరాలుంటాయో గ్రంథాలయానికి కూడా అటువంటి అవసరాలుంటాయి. పురోభివృద్ధి కోసం నిత్యం చేయవలసిన పోషణనే (Sustainable development) అంటున్నారిప్పుడు.

## గ్రంథాలయ గణితం

గ్రంథాలయాల వినియోగాన్ని ప్రయోజనకరంగా తీర్చిదిద్ది మధ్య మధ్య సమీక్షించి మెరుగుపరచాలంటే, గ్రంథాలయంలో లభించే సమాచార సాధనాలు ఎంత వరకు వినియోగ పడుతున్నాయో, వినియోగ దార్ల (పాఠకుల) అవసరాలు ఏ విధంగా ఉంటున్నాయో, సేవా కార్యక్రమాలు ఏ విధంగా ఎంతవరకు నిర్వహించబడుతున్నాయో, ఏవిధమైన సమాచారం ఎంతవరకు సేకరించబడుతోందో, ఎటువంటి సమాచారం ఏయే విధాల ఎంత వరకు లభిస్తోందో, వివిధ గ్రంథాలయాల మధ్య సహకారం ఎంత వరకు జరుగుతోందో, గ్రంథాలయోద్యోగులకు/ సమాచార సిబ్బందికి ఏ విధమైన తృప్తీ, అసంతృప్తీ ఎంత వరకు కలుగుతున్నాయో, గ్రంథాలయ నిధులు ఎంతవరకు అవసరమో, ఎంత వరకు లభిస్తున్నాయో, గ్రంథాలయ అవసరాలకు ఎంత స్థలం అవసరమవుతుందో, ఎంత వరకు లభిస్తోందో, భవిష్యత్తుకి ప్రణాళికలను ఏయే అంశాలలో ఎంతవరకు సిద్ధం చేసుకోవాలో - మొదలైన అనేక అంశాలనూ, వాటి మధ్య పరస్పర సంబంధాలనూ గణిత రీత్యా విశ్లేషించు కోవలసిన అవసరం ఉంటుంది.

ఈ గ్రంథాలయ గణితాన్నే రంగనాథన్ 'లైబ్రామెట్రీ'గా నామకరణం చేశారు. రంగనాథన్ గణిత శాస్త్రంలో ప్రావీణ్యం ఉన్న వారు కనుక, వాస్తవిక దృష్టితో గ్రంథాలయ శాస్త్రానికీ గణిత శాస్త్రానికీ ఉండవలసిన సన్నిహిత సంబంధాన్ని స్పష్టం చేశారు. గ్రంథాలయ కార్యక్రమాలనూ, గ్రంథాలయ సంపత్తినీ, గ్రంథాలయ ప్రయోజనాలనూ, ఫలితాలనూ కొలిచే శాస్త్రమే గ్రంథాలయ గణిత శాస్త్రం అని వివరించారు రంగనాథన్.

గ్రంథాలయశాస్త్ర పంచసూత్రాలను అమలు చేయడంలో గ్రంథాలయ గణితానికి ఎంతో ప్రాధాన్యం ఉంది. గ్రంథాలయ నిర్వహణ విశ్లేషించడానికీ, గ్రంథాలయాభివృద్ధిని క్రమబద్ధంగా

సాధించడానికీ గ్రంథాలయ గణితం అత్యవసరం. ఏ రకం గ్రంథాలయానికైనా, ఎంత చిన్న గ్రంథాలయానికైనా గ్రంథాలయ గణితం అవసరం. గ్రంథాలయ నిర్వహణని వాస్తవికంగా కళ్ళకు కట్టేటట్లు క్లుప్తంగా, సూటిగా చిత్రించగల ఒక ముఖ్య సాధనం గ్రంథాలయ గణితం. గ్రంథాలయ స్థితి గతులనూ, అవసరాలనూ గ్రంథాలయోద్యోగులు తెలుసుకోవడానికీ,సంస్థ యాజమాన్యానికీ, ప్రభుత్వాధికారులకూ క్లుప్తంగా, సమగ్రంగా, స్పష్టంగా తెలియ జేయడానికీ గ్రంథాలయ గణిత చిత్రణ అవసరం. ఈ శాఖలో గ్రంథాలయ శాస్త్ర విద్యార్థులకూ, గ్రంథాలయోద్యోగులకూ తగిన శిక్షణనివ్వడం అత్యవసరం.

## పౌర గ్రంథాలయాభివృద్ధి

మన దేశంలో పౌరగ్రంథాలయాలు 1973 నాటికే 53,554ఉన్నట్లుగా తెలుస్తోంది. అయితే వాటిలో చాలా వరకు ఎదుగూ బొదుగూ లేని పుస్తక నిలయాలుగా మాత్రమే నిలిచి పోయాయని తెలిపారు. ప్రొ. పి.ఎన్.కౌలా 1980లో రెండవ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయాల సమావేశంలో తమ ప్రధానోపన్యాసంలో పౌర గ్రంథాలయాలు అందించ వలసిన విధంగా సేవలు అందించలేక పోతున్నాయన్నారు. నాలుగు దశాబ్దాల క్రితం యునెస్కో ప్రతిపాదించిన పౌర గ్రంథాలయ సూత్రాలు నామ మాత్రంగానైనా అమలు చేస్తున్నట్లు దాఖలాలు లేవు అన్నారు.

ఏడు దశాబ్దాల క్రితం శ్రీ అయ్యంకి వేంకట రమణయ్య గారు పెట్టుకున్న ఆదర్శం ఈనాడు ఇంకా సాధించవలసిన ఆదర్శంగానే మిగిలి ఉంది. నిరక్షరాస్యతా నిర్మూలన, గ్రామీణ పౌర గ్రంథాలయ సదుపాయాలూ నేటికీ ప్రారంభదశని అధిగమించలేదు. పౌర గ్రంథాలయం విద్య, సంస్కృతి, సమాచారాలను పెంపొందించే ప్రజాస్వామిక సంస్థ అన్న యునెస్కో తీర్మానం మన దేశంలో వాస్తవంగా, అమలులో విస్తృత పరిధిలో వ్యాప్తి చెందవలసి ఉంది. నిరక్షరాస్యతని నిర్మూలించే కార్యక్రమాలను చేపట్టవలసిన ప్రముఖ బాధ్యత విద్యాసంస్థలదీ, పౌర గ్రంథాలయాలదే నన్న సత్యాన్ని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు తగినంతగా గ్రహించడం లేదని తోస్తుంది. నగరాల్లోనూ, పట్టణాల్లోనూ నగర, జిల్లా గ్రంథాలయాల సక్రమ అభివృద్ధికి తగిన ఆర్థిక సహకారం ప్రభుత్వం నుంచి లభించడం లేదన్న వాస్తవాన్ని ఎవరైనా గ్రహించవచ్చు. గ్రామ పంచాయితీలు గ్రంథాలయాలను నెలకొల్పి గ్రామీణాభివృద్ధికి తోడ్పడగలగడం ఇంకా ఎంతో దూరంలో ఉన్నసంగతి. గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహిస్తున్న వివిధ ప్రభుత్వ శాఖలూ, స్వచ్ఛంద సంస్థలూ పౌరగ్రంథాలయాలూ కలిసి గ్రామీణ గ్రంథాలయాలను సమష్టిగా నిర్వహించాలన్న ప్రతిపాదనను పరిశీలించవలసి ఉంది.

పుస్తక ప్రచురణ అంతకంతకు ఆర్థికంగా భారమవుతూ ఉండటం. అరుదైన పుస్తకాలనూ పత్రికలనూ మైక్రోఫిల్ముల్లుగా రూపొందించ గలగడానికీ, లేదా వాటిని కొని ఉపయోగించు కోవడానికీ తగిన ఆర్థిక సామర్థ్యం లేకపోవడం వల్ల అనేక గ్రంథాలయాలు వికలాంగ స్థితిలో ఉండి పోతున్నాయి. గ్రంథాలయాల మధ్య ఉండవలసిన సహకారం కూడా పై సమస్యతో ముడిపడి ఉన్నదే. ఓ గ్రంథాలయం ఏ పుస్తకాన్నైనా ఒక్క కాపీ కొనడమే బ్రహ్మాండమై పోతున్న సందర్భంలో, పుస్తకం గాని పత్రికగాని - ఉన్న ఒక్క కాపీనీ మరో గ్రంథాలయానికి కొద్ది రోజుల పాటు అరువు పంపించడానికి గ్రంథాలయాధికారి భయపడటం (పుస్తకం తిరిగి రాదేమో, పాడై పోతుందేమోనని) మాట అటుంచి, పోస్టల్ ఖర్చులూ, రవాణా ఖర్చులూ కూడా విపరీతంగా పెరిగి పోవడం వల్ల పాఠకుల అవసరాల కోసం గ్రంథాలయాల మధ్య పెంపొందవలసిన సహకారం చాలా వరకు ఆదర్శంగానే మిగిలిపోతోంది.

ఒక వైపు సాంకేతికంగా అభివృద్ధి చెందిన దేశాలతో సరితూగే సాంకేతిక విజ్ఞానం మనదేశంలో సాధించగలిగినా, గ్రామీణ, జిల్లా పౌరగ్రంథాలయాల అభివృద్ధి మాత్రం చెప్పుకోదగిన స్థాయికి చేరుకోలేక పోతోంది.

వివిధ భాషా ప్రాంతాలున్న మనదేశంలో ఒక భాషలో వచ్చిన గ్రంథాలను మరొక భాషలో ఇతర ప్రాంతంవాళ్ళు చదువు కోవాలంటే అనువాదాలు లభ్యం కావాలి. ఇంత భాషా, సాంస్కృతిక వైవిధ్యం ఉన్న మన దేశంలో ప్రజలు వారి వారి ప్రాంతాలకు పరిమితమై పోవలసి వస్తోంది. ఆంగ్ల భాష, హిందీ భాష తెలిసిన వారు దేశంలో చాలా స్వల్పం. కనీసం వారి వారి మాతృభాషల్లో అనువాదాలు దొరికినా విజ్ఞానం విస్తరిస్తుంది. ప్రాంతీయతాభావం, సంకుచితత్వం తగ్గి, దేశంలో సమైక్యభావం, పరస్పర అవగాహనా పెరగడానికి అవకాశం ఉంటుంది. దీనంతటికీ ఆర్థికంగా తగిన వనరులు సమకూర్చడానికి ప్రభుత్వ సంస్థలూ, స్వచ్ఛంద సంస్థలూ, ఉదారధనికులూ ముందుకొచ్చి విద్యాభివృద్ధికీ, గ్రంథాలయాభివృద్ధికీ యుద్ధ ప్రాతిపదిక మీద బాధ్యతని స్వీకరించవలసి ఉంటుంది. సర్వ ప్రజలనూ చైతన్య వంతుల్ని చేయడానికి పౌర గ్రంథాలయాలను విరివిగా నెలకొల్పి, ఆదర్శ ప్రాయంగా నిర్వహించవలసి ఉంటుంది. పాఠకులను తయారు చెయ్యడం, వారికి గ్రంథాలయాల వినియోగంలో శిక్షణ నివ్వడం, వారి అవసరాలకు అనుగుణంగా గ్రంథాలయ కార్యక్రమాలను నిర్వహించడం, గ్రంథాలయాలను అభివృద్ధి పరచడం ఈనాటి ముఖ్యావసరాలు.

## అభినందనలు

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కేంద్రగ్రంథాలయం ప్రధాన గ్రంథాలయాధికారిగా పని చేసి, పౌరగ్రంథాలయ వ్యవస్థలో వివిధ తెలంగాణా జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యదర్శిగా ఉండి

విశేషాలనుభవం పొందిన శ్రీ ఎస్. పాండురంగా రెడ్డిగారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ, ఇక ముందు కూడా పౌర గ్రంథాలయాభివృద్ధికి మరింత దోహదం చేస్తారని ఆశిస్తున్నాను.

## ఉపయుక్త రచనలు


I

1. గోపీనాథ్, ఎ. గ్రంథాలయ ప్రచారం. వినోద్ పబ్లికేషన్స్, ధర్మవరం, 1978.
2. శేషగిరి కుమార్, పో... మరియు సోమరాజు, పె. గ్రంథాలయ నిర్వహణ, తెలుగు అకాడమి, హైదరాబాదు, 1989
3. వెంకటప్పయ్య, వెలగా. గ్రంథాలయ పితామహ, భారత పౌర గ్రంథాలయ శిల్పి అయ్యంకి వెంకట రమణయ్య (1907-1979). తెలుగు అకాడమి, హైదరాబాదు, 1990.
4. వేంకట రమణయ్య, అయ్యంకి. గ్రంథాలయ జ్యోతి: వ్యాస సంపుటి 1910-1966 సరస్వతీ సామ్రాజ్య ప్రచురణ ట్రస్టు, విజయవాడ, 1967

II

1. Girja Kumar, S.R Ranganathan : An intellectual biography, Har - Anand Publications, New Delhi, 1992.
2. Girja Kumar and Krishan Kumar, Philosophy of user education, Vikas Publications, New Delhi, 1983.
3. ILA Bulletin, V.31. No.1-2, April - September 1995
4. Kaula, P.N. Library Service in Andhra Pradesh, Herald of library science, v. 19, No. 1-2, January - April 1980
5. Sethi, A.R., Sustainable librarianship, Library herld, v. 30, No. 2-4, July 1991 - Jan. 1992
6. Subba Rao, C.V., Librametry case studies · Science of measurement of library activities, resources and output phenomena, ABC Publishing House, New Delhi, 1993.

# 2.4 గ్రంథ సేకరణ - సమస్యలు

- డా॥ యస్. హరికృష్ణారెడ్డి,

గ్రంథాలయాలు మానవుడి మేధా సంపత్తిని, జిజ్ఞాసలను పెంపొదించే సరస్వతీ నిలయాలు. గ్రంథాలయ నిర్వహణలో పుస్తక సమీకరణ అత్యంత ప్రధానాంశం. విగ్రహ ప్రతిష్ఠ కానిదే ఏ విధంగా దేవాలయం కానేరదో గ్రంథాలు లేకుండా గ్రంథాలయం కూడ ఏర్పడదు. దేవాలయాలు ఆధ్యాత్మిక-సాంస్కృతిక జీవనానికి ఆధారమైనట్లే గ్రంథాలయాలుకూడ జాతి సామాజిక జీవనానికి, సాంస్కృతిక ప్రగతికి, విద్యావ్యాప్తికి ఆలంబనం.

గ్రంథాలయ భవనం ఎంత పెద్దది? ఏ సంఖ్యా పరిమాణంలో పుస్తక సామగ్రి ఉంది? అనే వాటికంటె ఏ యే విషయాల్లో, ఎన్నెన్ని ఉత్తమ రచనలు, అరుదైన ప్రచురణలు, ప్రాచీన గ్రంథాలు, ఆధునిక ప్రచురణలు లభ్యం? అనే అంశాలే ముఖ్యం. గ్రంథాలయాల్లో, సేకరించిన పఠనసామగ్రి నాణ్యత, విశిష్టతలను బట్టి గ్రంథాలయం గొప్పతనాన్ని, గ్రంధపాలక సిబ్బంది శక్తి సామర్థ్యాలను అంచనా వేయటం జరుగుతుంది.

మూల సంస్థల ఉద్దేశ్యాలు, కార్యకలాపాలు; అందుకు అనువుగా చేపట్టే గ్రంథాలయ విషయ ప్రత్యేకీకరణలు, సేవలు; ఉపయోక్తల అవసరాలు, అభిరుచులు మొదలైన అంశాలు గ్రంథాలయాల్లో పుస్తక సమీకరణ కార్యవిధానాన్ని నిర్ణయిస్తాయి. ఇదిసమాచార యుగం. విషయోత్పత్తికి, విషయ సంసర్గానికి ప్రాముఖ్యత ఎక్కువ. అందుచేత శాస్త్ర సాంకేతికాది సమస్త విషయ క్షేత్రాల్లో పరిశోధనావసరాలు ఎక్కువయ్యాయి. ఫలితం, విస్తృత పరిశోధనలు, పరిజ్ఞాన వెల్లువ, సాహిత్య నిరవధి!

స్థిరత్వం, సార్వంతం, నాణ్యం ప్రయోజకం అనే విలువలను సాధించే విధంగా ఉత్తమ గ్రంథ సంకలనాలను రూపొందించటం ఎంతో కష్టతరమైన పని. ఇందుకోసం ఎంపికలో వివేక, వివేచనలు, అనుభవం, విషయ నైపుణ్యాం తప్పని సరి. ఎంపిక ఒక ఎత్తయితే, సంపాదన మరొక ఎత్తు.

ఈ వ్యాసంలో పుస్తక సేకరణలో ఉండే సమస్యలను ప్రస్తావించటమే లక్ష్యం కావటం వల్ల ఎంపిక సమస్యలను ప్రస్తావించలేదు. మాధ్యపరంగా పుస్తక సామగ్రిని ముద్రితా, అముద్రితం అనే రెండు స్థూల రకాలుగా విభజించి, వాటి ఆర్జనా సమస్యలను (problem of acquisition) మాత్రం తర్కించటమైంది.

## ముద్రితాలు

ఇవి పుస్తకాలు (books), చిరు పొత్తాలు (Pampllets), ఏకస్వాలు (Patents), వర్తకసూచీలు (Trade catalogues), ప్రామాణికాలు (Standards), ధారావాహికలు (Serials), పరామర్శ గ్రంథాలు (Reference works) మొదలైన అచ్చు పఠన సామగ్రి. ఇవిఎక్కువ భాగం వాణిజ్య సంస్థల ప్రచురణలు. సామాన్యంగా చిల్లర పుస్తక విక్రేతలనుండి (From retail book sellers) కొనుగోలు చేయటం జరుగుతుంది. కొన్ని సందర్భాల్లో సరాసరి ప్రచురణకర్తలనుండే తెప్పించవలసిన అవసరం కలుగవచ్చు. వీటి సేకరణలోని పద్దతులను, సమస్యలను కింద క్లుప్తంగా పేర్కొవటం జరిగింది.

## ముందుగా మూల్యం చెల్లించే పద్ధతి

కొన్ని విదేశీ వాణిజ్య ప్రచురణలకు, జాతీయ అంతర్జాతీయ సంస్థల ప్రచురణలకు ప్రాంతీయ ప్రతినిధులు లేని సందర్భాల్లో పుస్తక మూల్యాలను విదేశీ మారక ద్రవ్యరూపంలో ముందుగా చెల్లించి ఆ తరువాత పుస్తకాలను అందుకోవలసి ఉంటుంది. పైకం చెల్లించి, ఉత్తర్వులు జారీ చేసిన తరువాత కనీసం 3-4 మాసాలు వేచి వుండాలి. ఒక్కొక్కప్పుడు మరికొంత ఎక్కువ జాప్యం కూడ ఏర్పడవచ్చును. కొన్ని సందర్భాల్లో పుస్తకాలు సరఫరా కావు. అనిశ్చిత జాప్య మేర్పడుతుంది. ఎన్ని విజ్ఞప్తులు పంపినా, హెచ్చరికలు చేసినా సమాధానముండదు. పుస్తకాలను గాని, పైకాన్నిగాని రాబట్టటం పెద్ద సమస్యగా తయారవుతుంది. మరికొన్ని సందర్భాల్లో దేశాల మధ్య సత్సంబంధాలు లేనపుడు దిగుమతి ఆంక్షలు, నిరోధాలు ఎదురవుతాయి. ముందు జాగ్రత్త, మెలకువల వల్ల ఈ పరిస్థితులను అధిగమించవచ్చు.

## సంస్థాగత సభ్యత్వం

జాతీయ, అంతర్జాతీయ సంస్థలు, పరిశోధక మండలులు, సంఘాలుతదితరాలు వెలువరించే ప్రచురణలు (పరిశోధనలు, నివేదికలు, ప్రామాణికాలు, సదస్సు - సమావేశ సంపుటాలు మొదలగునవి) ఎంతో నాణ్యమైనవి, అత్యున్నతస్థాయి అధ్యయనాలకు, పరిశోధకులకు పనికి వచ్చేవి కావటం వల్ల గ్రంథాలయాల్లో వాటికి ప్రాముఖ్యత ఎక్కువ. అయితే ఇవి సాధారణంగా వాణిజ్య పంపిణీ మార్గాల్లో లభ్యంకావు. సభ్యత్వం పొందిన వ్యక్తులకు, సంస్థలకు ఉచితంగానో లేదా తక్కువ ధరకో లభ్యమయితే, సభ్యత్వం లేని వారికి అలభ్యం లేదా ఎక్కువ మూల్యం చెల్లించవలసి రావటం జరుగుతుంది. అందుచేత ఇలాంటి

రచనల కబురు తెలుసుకోవటానికి, వాటిని సునాయాసంగా పొందటానికి గ్రంథాలయాలు ఏ సంస్థల్లో సభ్యత్వం లాభదాయకమో తెలుసుకొని ఆయా సంస్థల్లో సభ్యత్వాన్ని పొందటం అవసరం.

## అనువాదాలు

విషయావసరాలను ఆదుకోవటానికి ప్రచురణలే ఆధారం. అయితే భాషావరోధాలు ఎదురవుతాయి. అంటే అపరిచిత భాషలో ఉన్న ప్రచురణలను పరిచిత భాషల్లో అనువదించటం జరగాలి. దీనికయ్యే వ్యయం, సమయం, ప్రయాసలు భరించటం కష్టం. ఈ విషయంలో అంతర్జాతీయ నియంత్రణ కొంతవరకు ఏర్పడి ఉన్నందున ఒక మూల రచనకు ఇదివరకే (జాతీయ-అంతర్జాతీయ అనువాద కార్యసంస్థలు, వ్యక్తులు చేసిన) సిద్ధమైన ఒక భాషానువాదం ఉన్నదీ లేనిదీ అనువాద సూచీలను (Indexes totranslations) సంప్రదించి తెలుసుకున్నప్పుడు ఈ పని సులభమవుతుంది. మూలాలను కొనుగోలు చేయటం సులభమే. కాని అది ఉపయోక్తలకు తెలియని భాసలో ఉన్నందువల్ల ఏమాత్రం ఉపయోగం లేదు. అనువదించాలి. అది ఇదివరకే అనువాదం జరిగితే మరింత సులభం. కానప్పుడు జాతీయ సంస్థలద్వారా, అంతర్జాతీయ సంస్థలద్వారా లేదా వైయక్తిక అనువాదకుల ద్వారా అనువాదం చేయించటం జరగాలి. ఈ అనువాదంలో పునః ప్రయత్నం, అనవసర ప్రయత్నం కాకుండ జాగ్రత్త వహించటం ఎంతైనా ముఖ్యం.

## విపణిలో లేని పుస్తకాలు

సామాన్యంగా (ముఖ్యంగా), శాస్త్ర సాంకేతికరంగాల్లో ప్రచురణలు అనతికాలంలోనే కాలం చెల్లినవవుతాయి. అవసరముండి, సాధ్యమయినపుడు కొన్ని ప్రత్యగ్రీకృత సంస్కరణలు, కూర్పులువెలువడుతాయి. ఈ ప్రయోజనాలు లేనపుడు పునః సంస్కరణలు, ప్రచురణలు రావు. కొంతకాలం తరువాత అవి విపణిలో లభ్యంకావు. ఈరకమైన పుస్తకాలను సూక్ష్మరూపాలు, ప్రతిరూప ముద్రణలు (Fzesimile editions) తయారుచేసి సరఫరా చేసే విక్రేతల సూచీలను సంప్రదించి అవసరమయితే కొనుగోలు చేయవచ్చును. లేదా ఇతర గ్రంథాలయాలనుండి మూలాన్ని అరువుతెచ్చి పునరుత్పత్తి చేయనూ వచ్చును. అయితే కాపీరైటు భంగం రాకుండ జాగ్రత్తపడాలి.

## సంబాళింపు ఖర్చులు, సేవా రుసుములు

పుస్తక విక్రేతలు, ప్రకాశకుల ప్రతినిధులు దిగుమతి చేసే పుస్తకాలను సరఫరా చేయటంలో 15 శాతం వరకు అదనంగా సంభాళింపు ఖర్చులని లేదా సేవా రుసుములని వసూలు

చేయటం జరుగుతుంది. అయితే గ్రంథపాలకులకు ఈ విషయమై ఏది సరి? ఏదిసరికాదు? అని తెలిసి వుండాలి. సాధారణంగా ఈ ఖర్చులు విద్యాసంస్థలు, పరిశోధనా సంస్థల ప్రచురణలకు, తక్కువవట్టం (short discount) వస్తువులకు, ప్రాతినిధ్యంలేని విదేశీ ప్రచురణకర్తల పుస్తకాలకు వర్తిస్తాయి. ఈ ఖర్చులు పుస్తకం కొనుగోలు రసీదులో నికరం మొత్తంపై చేసే విధింపులు. అంటే విక్రేతలకు ప్రచురణకర్త అనుమతించిన ముదరాను పుస్తక మూల్యం నుండి తీసివేసిన తరువాత వచ్చే విలువమీద లెక్కించటం జరగాలి. విక్రేతలు ఈ విషయం తెలియని గ్రంథపాలకులను మోసపుచ్చటం సులభం. పుస్తకాలు కాకుండ దృశ్యశ్రవణాలు, టేలు, దుర్మాత్ర సహాయక పఠనా మాధ్యాలు మొదలయిన వస్తువులను దిగుమతి చేసుకోవాలంటే కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ అనుమతి పొందటంవల్ల దిగుమతి సుంకం మినహాయింపు కూడ పొందవచ్చును.

## అముద్రితాలు

పరిశోధనా వ్యాసాలు, పుస్తకాలు, నివేదికలు, రాతప్రతులు, తాళపత్రాలు మొదలైన వాటినిఅముద్రితాలుగా పేర్కొనవచ్చును. వీటిని సమీకరించటం చాలాకష్టం. పరిశోధనా వ్యాసాలు, నివేదికలు ఆయా సంస్థలకే పరిమితం. విశ్వవిద్యాలయాల్లో సమర్పించబడే సిద్దాంత వ్యాసాల్లో ఎక్కువ భాగం అచ్చులో రావు. పరిశోధనల నియంత్రణలో ఏర్పడిన Dissertations Abstracts international, Indian Dissertations Abstracts మొదలైనసాధనాల ద్వారా ఈ అముద్రితాలను తెలుసుకొని వాటిని సేకరించవచ్చును. రాతప్రతులు, తాళపత్రాలు మొదలయిన వాటిని సమీకరించటం మరింత సమస్యాత్మకం. ఇక్కడ ముఖ్యంగా రెండు చిక్కులున్నాయి. ఏమి లభ్యం? అని తెలుసుకోవటం మొదటిసమస్య. ఎక్కడ లభ్యం? ఎలా సాధ్యం? అనేది రెండవది. ఇవి అమూల్య వస్తువులు కావటం వల్ల ముద్రితాలవలె కొనుగోలుకు దొరకవు. అథవా దొరికినా వాటి మూల్యం నిర్ణయించటం కూడ కష్టమే. ప్రయివేటు సంస్థలు, సాహితీప్రియులు, దలాళీల సహాయంతోను,ప్రకటనల వల్లను వీటిని కొనుగోలుచేయటం, బహుమానంగా గ్రహించటం సాధ్యం. ఈరకం ఆర్జన రాతప్రతుల గ్రంథాలయాలకు ప్రధానం.

పుస్తక ఎంపికకు అనుభవం ఎంతముఖ్యమో సంపాద్య వషయంలో కూడా అది అంతే ముఖ్యం. శ్రద్ధ, ఆసక్తి వివేకం, కార్యశీలత, అనుభవానికి తోడైనపుడుసంకలనాభివృద్ధి మెరుగ్గా, చురుగ్గా ఉంటుందనటంలో ఏమాత్రం సందేహంలేదు. అయితే నియంత్రణా పరిధికిరాని ప్రచురణలు, విపణి సమస్యలు, రవాణా ప్రతిబంధకాలు పరిష్కారాల నందుకోవలసి ఉంది.

# 2.5 గ్రంథాల భద్రత

- డా॥ గుమ్మా శంకరరావు

ఒకతరం జ్ఞానం మరో తరానికి, ఒక ప్రాంతజ్ఞానం మరో ప్రాంతానికి అంటే అతిశయోక్తి కాదు. ఒకని జ్ఞానం మరొకనికి అందించే ప్రచార, ప్రసార సాధనం గ్రంథం. గ్రంథాలు రచించడం, ప్రచురించడం చేసినంత మాత్రాన విజ్ఞానం వీథుల్లో విరజిమ్మ బడినట్లు కాదు. అందరికీ అవి కొని చదివే శక్తి ఉండదు. చదువు కోవడానికి వీలైన వసతులూ, వనరులూ అందరికీ అందుబాటులోనూ ఉండవు. ఒక పుస్తకం చదువుతూ ఉండగా దానిలో ఉదాహరించిన మరోపుస్తకం ఎక్కడ దొరకుతుందో, అది అసలు అచ్చు అయిందో లేదో, ప్రస్తుతం అంగడిలో దొరకుతున్నదో? లేదో? దాని ధర ఎంత ఉందో? దానిలోని విషయాలు ఏమిటో? మొదలైన సమాచారం కావలసిన వాళ్ళకు అందించే వ్యవస్థ, సంస్థ ఒకటి అవసరం. అలాంటి సంస్థను గ్రంథాలయం అని, దాని నిర్వహణాధికారిని గ్రంధాలయాధికారి అని అంటారు. గ్రంథాలయాన్ని పుస్తక భాండాగారం అని కూడా అంటారు. నిజానికిది విజ్ఞాన భాండాగారం.

తరంతరం ఆర్జించిన జ్ఞానాన్ని నిరంతరం ప్రజలకు చేరువ చేయడంలో గ్రంధాలయాలు కీలకపాత్ర వహిస్తున్నాయి. గ్రంథాలను భద్రపరచడంలో కోరినప్పుడు వాటినిగాని, వాటి సమాచారాన్నిగాని అందించడంలో ఒక చక్కని కట్టుబాటు ఏర్పరచుకొంటాడా గ్రంధాలయ అధికారి. ప్రస్తుత వ్యాసోద్దేశం "గ్రంథాల భద్రత" గురించి ఒక వినూత్నమైన రేఖామాత్రమైన ఆలోచనను వివరించటం.

ఒకనాడు గ్రంథాలు తాళపత్రాల మీద భూర్జ పత్రాల మీద రచితమయ్యాయి. ఇప్పుడు కాగితం మీద రచితమై ముద్రిత మవుతున్నాయి. "పత్రం" అంటే ఆకు అని అర్థం. కాని అది "ఉత్తరానికి" దస్తావేజు పత్రం అన్నదానికి అర్థాలు సంతరించుకుని నిఘంటువులలో కనిపిస్తూ ఉంది. అలాగే "కమ్మ" కు తాటాకు అని అర్థం ఉన్నా ఉత్తరానికి కూడా ఇది వర్తిస్తూంది. అందుకే ఈ అర్థాల్లో స్థిరత్వం సంపాదించుకున్నప్పటికీ ఈ వస్తువుల అస్తిత్వంలో స్థిరత్వం లేక పోవడం వల్ల వీటితో తయారయిన గ్రంధాలు శిథిలావస్థకు చేరుకునే ఒక దశలో వీటిని భద్రపరచడం గ్రంథాలయాధికారులకు సమస్య అయింది.

తామ్ర శిలాశాసనాలకు ఈ సమస్య లేకపోయింది. శిలాక్షరంలా స్థిరంగా ఉంటుందని ఒక నుడికారం తెలుగులో వచ్చింది. స్థిరంగా ఉండని వ్రాతలకు నీటి మీది వ్రాతలన్నారు. ఇవి ఇలా ఉండగా గ్రంథాలను భద్రపరచడం గురించి ప్రాచీన సాహిత్యంలో ఎక్కడయినా ఏమైనా ఉందా అని ఆలోచిస్తే ఒక కధ గుర్తుకు వస్తున్నది.

తెలుగులో ఆదికవి నన్నయ భారతం మూడు పర్వాలు ఇంచుమించు వ్రాశాడు. తర్వాత ఆ మిగిలిన 15 పర్వాల వ్యాసభారతాన్ని అంత సొగసుగా ఎవరయినా వ్రాయగలరా? అని తాటాకు మీద నన్నయ పద్యం ఒకటి వ్రాసి పండితులకూ కవులకూ చూపడం కోసం ఊరూరా మనుమసిద్ధి పంపాడట. అందరూ చదవి ఊరుకొన్నారే కాని ఆ సంకేతాన్ని గ్రహించి దానికి సమాధానం మరో సంకేతం ద్వారా ఎవరూ పంపలేదు. నిరాశానిస్పృహలతో ఉన్న సమయంలో తిక్కన గారు ఒక రసం దానికి పూసి రాజుకు చూపమన్నట్లు చెప్తారు.

తాటాకు పదిమంది చేతిలో నలిగి చిరిగి కాలం కదిలిన కొద్దీ తాటాకు మాసి, శిథిలావస్థకు చేరుకొనగా దాని మీద వ్రాసిన అక్షరాలు అస్పష్టంగా ఉన్న స్థితిలో తిక్కన ఈ రసం తాటాకుకు పూయడం ద్వారా స్పష్టత ఏర్పడిందని తాటాకు మాపు తగ్గిందని అంటే దానికి మెరుగు పెట్టగలననే సంకేతాన్ని అందులో తిక్కన ఇమిడ్చాడని పండితులు రాజుకు అర్థం చెప్పారు. అప్పుడు మనుమసిద్ధి తిక్కనను పిలిపించి భారతం వ్రాయమని కోరాడని తిక్కన వ్రాశాడని అంటారు.

ఇది కట్టుకథ కావచ్చు. పిట్టకథ కావచ్చు. కాని దీనిలో విశేషం మనం ఉపయోగించుకోవచ్చు. ప్రస్తుతం గ్రంథాలయాల్లో గ్రంధాలను భద్రపరిచే తీరు ఇలా ఉంది. 1. శిథిలావస్థకు చేరుకోకుండా బైండు చేయించడం 2. కాగితాలు చిరిగిపోతే ట్రాన్సపరెంటు పేపరుతో అతుకు బెట్టడం 3. మొత్తం కాగితాన్నే ట్రాన్సురెంటు పేపరు రెండు ప్రక్కలా అంటించి పెట్టడం. 4. మైక్రోఫిల్మ్ తీయడం 5. పునర్ముద్రణ గావించడం 6. కాపీలు ఎత్తి వ్రాయించడం 7. జిరాక్స్ కాపీలు తీయించడం 8. కేసెట్లపైకి పుస్తక విషయాన్ని ఎక్కించడం 9. కంప్యూటర్లపైకి శిధిలగ్రంధ విషయాన్ని చేర్చడం వంటి ఎన్నో పద్ధతులు గ్రంధాలయాల వారు అనుసరిస్తున్నారు.

ఇప్పుడు నేను చెప్పే విషయం ఒక కొత్త ఆలోచనను రేకెత్తిస్తుంది. ముట్టుకుంటే, పట్టుకుంటే చాలు ఆగ్రంథంలోని కాగితం చేతివేళ్ళ మధ్య పొడిగా మారిపోవడం, కాగితం ముక్కముక్కలుగా విడిపోవడం ఉన్నదశలో ఒకానొక రసం ఆ పుస్తకంపై స్ప్రే చెయ్యడం లేదా ఒక కుంచెతో కాగితం నాలుగుకొనలకు తాకించితే దానిని పీల్చుకొని ఆ కాగితం పునరుజ్జీవితం అయి మరికొంత కాలం బతికే అవకాశం ఉంది. దీన్ని తయారు చెయ్యడానికి పెద్ద ఖర్చుకాదు. వ్యయప్రయాసలూ తక్కువే.

తిక్కనగారు తాటాకుకు పూసిన రసం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. తాంబూలం వేసుకుని ఉన్నప్పుడు ఈ తాటాకు తిక్కన చూశాడని. అప్పుడు ఆ తాంబూలరసమే ఆ తాటాకుకు పూశాడని కొందరంటారు. మరికొందరు కాకరాకు రసం పూశాడంటారు. ఏదో ఆకురసం పూశాడని ఇంక కొందరంటారు.

కాగితం గురించి మనం ఆలోచించాలి. కాని తాటాకుల గురించి కాదు అనకూడదు. ఆ తాటాకు గ్రంథాలు కూడా చాలా చోట్ల ఉన్నాయి. మనుష్యులకు వచ్చినట్లేకాగితాలకూ తాటాకులకూ జబ్బు వస్తుంది. జీవిత పరిసమాప్తి కూడా అయిపోతుంది అని సరిపెట్టుకోలేం.మనుష్యులకు చక్కర వ్యాధి వస్తుంది. అప్పుడు శరీరం చివికి పోతుంది. కాలివేళ్ళ దగ్గర Gangarin బయలు దేరి ముక్కలు ముక్కలుగా పడిపోతుంది. అలాంటి స్థితిలో కూడా నిలబెట్టే ఆయుర్వేద ఓషధి కాకరాకు. దీని రసం వల్ల ఆ గండం గడవగలుగుతాం. అందుకే తిక్కన వాడింది కాకరాకు రసం అని నేను భావిస్తాను. హెూమియోపతి వైద్యంలో సిజీజియం జంబోలినం దీనికి మందు. ఇది నేరేడు పిక్కల రసం. ఇక్కడ ఒక్క విషయం మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. మనిషి తలవెంట్రుకలు భూమిలో ఏంచేసి పాతిపెట్టినప్పటికీ పాడుకావు. కాని నేరేడు పళ్ళరసంవేస్తే అవి నశిస్తాయి. అందుకే పొరపాటుగా మింగిన తలవెంట్రుకలు కడుపులో పేగుల్లో ఉండి పోకుండా ఏడాదికోసారి నేరేడు పళ్లు మనం తినాలని మన పెద్దలంటారు. దానివల్ల అది కడుపులో ఉన్నా పేగుల్లో ఉన్నా పూర్తిగా నశిస్తుంది. అలాగే దానికి బతుకు ఇవ్వడానికి ఈ సిజీజియంను చిన్న మోతాదుల్లో ఇవ్వాలి. అంటే దేనికయినా జీవమిచ్చే గుణం నేరేడు కుందన్నమాట.

విజయవాడ వాస్తవ్యులు శ్రీ కొప్పుల రావు గారు తాటాకులకు ట్రీట్‌మెంట్ చేసి అవి కాలిపోకుండా చేశారు. పెట్రోల్ వేసి తగుల బెట్టినా అవి తగుల బడవు. ఈ ప్రదర్శన డా. మర్రి చెన్నారెడ్డి, మాజీ ప్రధాని శ్రీ మురార్జీదేశాయి పలువురు ప్రముఖుల ఎదుట చూపారు. ఇది మనం కూడా చేయవచ్చు.

ఇంక మనం ప్రస్తుతం గ్రంథాల శైథిల్యం గురించి ఒక ఆలోచన చేసి వాటి నివారణోపాయాలను అన్వేషిద్దాం.

గ్రంథముద్రణకుపయోగించే కాగితం మన్నిక మనం చూద్దాం. కొద్ది కాలానికే చెడిపోయే కాగితాలు కొన్ని ఉన్నాయి. మరికొన్ని చాలాకాలం నిలుస్తాయి. దానికి కారణం వాటి తయారీ. జిగీబిగీ, నునుపూ ఉన్న కాగితం చాలాకాలం ఉంటుంది. దీన్ని తయారు చేయడానికి వాడే రసాయన పదార్థాలు మనం ఉపయోగిస్తే ఇప్పుడుకూడా కొంతవరకు చౌకబారు కాగితానికి మన్నిక తేవచ్చు.

గ్రంథముద్రణకుపయోగించే సిరాలో లోపం ఉంటే చిమ్మెటలు ఇతర కీటకాలు పుస్తకాలను కొరకడానికి చేరతాయి. కాగితం చిరగదు, శిథిలంకాదు. కాని దాని మీద ఉన్న అక్షరాలను కొన్ని కీటకాలు తినివేస్తాయి. గ్రంథంలోని విషయం పోయిన తర్వాత గ్రంథం బాగున్నా

గ్రంధభద్రత లోపించినట్లేకదా! అలాంటి వాటిని జాగ్రత్త పరచడానికి ఈ "సిరా" సరైనది వాడేటట్లు చూడాలి. అప్పుడే దాని భద్రత సాధ్యం అవుతుంది.

పూర్వం కరక్కాయ సిరా చేసేవారు. వాడే వారు. గ్రంధం చిరిగినా అక్షరం పోయేది కాదు. చిమ్మెటలు, ఇతర కీటకాలు వాటిని ముట్టుకొనేవి కావు. దానిద్వారా గ్రంధం కూడా చిమ్మెటలు మొ॥గు కీటకాల బారిని పడేవి కావు. ఆ కరక్కాయ సిరాలో అన్నభేది కలిపేవారు. దానికా గుణం ఉండేది. 'శతమాతాహరీతకీ' అంటారు. కరక్కాయ నూరుమందితల్లులతో సమానమని అర్థం. తల్లి జన్మకు కారణం కదా! నూరు మంది తల్లులకు సమానమనటం వల్ల చస్తే మళ్ళీ పుట్టించే గుణం దానిలో ఉంది అని మనం గ్రహించాలి.

చిమ్మెటలు మొదలయినవి తినివేయనక్కరలేకుండానే కేవలం వాతావరణంవల్ల పాడవుతాయి గ్రంథాలు. ఆ శీతాతపవాతాదుల నుండి కాపాడడానికి ఒక జిగురు పదార్థం చమురు పదార్థం దాని మీద పూతగా ఉపయోగించాలి. ఇది ఇన్‌స్టెంట్ కాఫీ పౌడరులా వెంటనే దాని మీద absorb. అవుతుంది. అది చాలా వరకు దానికి భద్రత చేకూరుస్తుంది.

అసతోమాసద్గమయ<br>
తమసోమా జ్యోతిర్గమయ<br>
మృత్యోర్మా అమృతం గమయ

మనిషే అమృతం స్వీకరిస్తే శాశ్వతంగా జీవిస్తాడన్న సంస్కృతి మనది. అలాంటి అమృతరసం గ్రంధాలకు భద్రత చేకూరుస్తుందని, దాని పరిశోధనకు మనం పాటు పడాలని నేను ప్రార్థిస్తున్నాను.

# 2.6 పౌర గ్రంథాలయ సిబ్బంది : నియామకాలు - నియంత్రణ

- టి. యాదగిరి

- కె.పి. అశోక్ కుమార్

గ్రంథాలయ సేవకు పుస్తకాలు ముఖ్యాధారం అనేది ప్రాథమిక విషయమే అయినప్పటికీ కేవలం పుస్తకాలు మాత్రమే ఒక గ్రంథాలయంగా పరిగణనకు రాలేవు. పుస్తకాలకు చదువరులను జతకల్పించే సిబ్బందిని నియమించినప్పుడే నిజమైన గ్రంథాలయం ఏర్పడుతుంది.

గ్రంథాలయ వ్యవస్థలో పుస్తకాలు, చదువరులు, సిబ్బంది మూడు ముఖ్యమైన భాగాలు. అందుకే వీటిని గ్రంథాలయ త్రయంగా డా॥ ఎస్.ఆర్. రంగనాథన్ గారు పేర్కొన్నారు. పఠన సామగ్రి, చదువరులు, భవనం ఉన్నా వాటికి అవసరమయ్యే ప్రక్రియలను సిద్ధంచేసి, చదువరులకు అందించటానికి సిబ్బంది అవసరం. వారు లేని యెడల గ్రంథాలయ సేవలు అందించటం చాలా కష్టం. ఆ కారణంగా గ్రంథాలయంలో జరిగే పనులు, సేవలు గ్రంథాలయ సిబ్బంది మీదనే ఆధారపడి వుంటాయి.

గ్రంథాలయాలు సేవాసంస్థలు. పుస్తక రూపంలో ముద్రితమైన విజ్ఞాన సంపదను ప్రజలకు అందజేయడం, వారికి కావలసిన సమాచార అవసరాలు తీర్చటం, గ్రంథాలయం ముఖ్య ఆశయాలు. వివిధ విభాగాలలో తత్సంబంధమైన కార్యక్రమాలు చేయటానికి మానవ శక్తి అవసరం ఎంతైనా ఉంది. పైగా వారు వృత్తిపరంగా నిష్ణాతులై అర్హులై ఉండాలి.

## సిబ్బంది అవసరం

గ్రంథాలయంలో వివిధ భాగాలలో పలురకాలైన పనులు చేయటానికి సిబ్బంది అవసరం. అలా చేయటానికి వృత్తిపరంగా, సాంకేతిక పరంగా వివిధ విషయాల్లో పరిపూర్ణ జ్ఞానం, వృత్తిపనిలో సమర్థత లోకజ్ఞానం ఉండాలి. పాఠకులకు కావలసిన సమాచారం, పుస్తకాలలో నుండి తీసి, క్రోడీకరించి అందజేయాలి. గ్రంథాలయం విశిష్టత పుస్తక సంపద, చదువరులకు అందించే సేవల మీద ఆధారపడి వుంటుంది. ఆయా సేవల నాణ్యత గ్రంథాలయ సిబ్బంది సామర్థ్యం, కృషి మీద ఆధారపడివుంటుంది. అట్లాంటి సామర్థ్యం వున్న సిబ్బందిని నియమించి వారి సేవలను గ్రంథాలయంలో వినియోగించడం గ్రంథాలయాధికారి ముఖ్యమైనపని.

## సిబ్బంది అంచనా

గ్రంథాలయ సిబ్బంది నియామకంలో అవసరమయిన సిబ్బంది అంచనా చాలా ముఖ్యమైంది. ప్రతి గ్రంథాలయంలో - పుస్తకాల సంఖ్య, చదువరుల సంఖ్య, వారి అవసరాలు, సామాజిక సాంస్కృతిక విద్యా వాతావరణం వేరుగా ఉంటాయి. కావున సిబ్బంది అంచనా వేరుగా ఉంటుంది.

గ్రంథాలయ సిబ్బందిని అంచనా వేయటంలో పలువురు ప్రామాణికాలు (Standards) తయారు చేశారు. డా॥ ఎస్. ఆర్. రంగనాథన్ మన దేశ పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించి తయారు చేసిన సిబ్బంది సూత్రం, ప్రామాణికాలు కొద్ది మార్పులతో అన్ని గ్రంథాలయాల్లో వాడుతున్నారు.

| విభాగం | మనిషి ఒక్కింటికి పని అంచనా |
|---|---|
| 1. పుస్తక కొనుగోలు విభాగం | సంవత్సరంలో ప్రతి 6000 పుస్తకాలను చేర్చటానికి = ఒక మనిషి |
| 2. పత్రికల విభాగం | వస్తున్న ప్రతి 500 పత్రికలకు = ఒక మనిషి |
| 3. వర్గీకరణ, సూచీకరణలకు | ప్రతి రెండు వేల పుస్తకాలు ఒక సం॥లో చేయటానికి = ఒక మనిషి |
| 4. నిర్వహణ విభాగం | ప్రతి రెండువేల పుస్తకాలు ఒక సంవత్సరంలో క్రమంలో పెట్టడానికి = ఒక మనిషి |
| | ప్రతి యాభైవేల గ్రంథాలకు = మరొక మనిషి |
| 5. ప్రచార విభాగం | ఒక మనిషి |
| 6. సంప్రదింపు సేవా విభాగం | ప్రతి యాభైమంది చదువరులకు = ఒక మనిషి |
| 7. అరువు విభాగం | సంవత్సరంలో ప్రతి 1500 పుస్తకాలు ఇచ్చి పుచ్చుకోవడానికి = ఒక మనిషి |
| 8. పర్యవేక్షణ | ఒక గ్రంథాలయాధికారి |
| | ఒక సహాయ అధికారి |
| 9. శుభ్రతకు | ప్రతి మూడువేల పుస్తకాలకు = ఒక మనిషి |
| 10. సార్టర్ | ప్రతి 3000 పుస్తకాలకు = 1 మనిషి (Unskilled) |
| | ప్రతి 60,000 పుస్తకాలకు = 1 మనిషి |

పై ఉదహరించిన ప్రామాణికాల ఆధారంగా గ్రంథాలయ సిబ్బందిని నియమించాలి. ఈ అంచనా ప్రతి విభాగానికి విడిగా కాకుండా గ్రంథాలయం మొత్తంగా కావలసిన మానవ శక్తిని అంచనా వేయాలి. సిబ్బందిని నియమించటం, వారి అర్హతలు, ఆధారం, కార్యక్రమాలు, బాధ్యతలు ఇవ్వటం, వారి జీత భత్యాలు, సదుపాయాలు నిర్ణయించటం మొదలైన పనులకు సిబ్బంది నిర్వహణ మండలి లేదా యాజమాన్యం బాధ్యత వహించాలి.

## పౌర గ్రంథాలయ సిబ్బంది : నియామకాలు - నియంత్రణ

### 1. నియామకాల మీద బాన్‌ను ఎత్తివేయాలి

గ్రంథాలయ సంస్థలలో కొత్త నియామకాల మీద 1975 నుండి 'బాన్' వున్నది. అది 1986 లో కొద్దిగా సడలించినా తిరిగి అదే పరిస్థితి కొనసాగుతూ వుంది. శిక్షణ పూర్తి చేసుకున్న నిరుద్యోగులు వేల సంఖ్యలో ఉన్నారు. విద్య ప్రైవేటీకరణ పేరిట ఎన్నో సంస్థలు కొత్తగా రంగంలోకి వచ్చి నిరుద్యోగులను తయారు చేస్తున్నాయి.

పదవీ విరమణ వలన ఏర్పడిన ఖాళీలలో నిరుద్యోగులను నియమించటానికైనా ప్రస్తుత నియామకాలపై వున్న బాన్ కారణంగా సాధ్యపడటం లేదు. గ్రంథాలయ శాసనం క్రింద రూపొందించిన నిబంధనలకు నీళ్ళొదిలి గ్రంధాలయ సంస్థల్లో ఉద్యోగుల నియామక అధికారాన్ని కలెక్టర్లకు దత్తం చేశారు. దీనివల్ల కూడా నియామకాల్లో ఆలస్యం జరిగే అవకాశముంది. అందువల్ల కొన్ని చోట్ల లైబ్రేరియన్ పని చేయవలసిన స్థానంలో అటెండర్ పని చేయడం జరుగుతున్నది. దీనితో కొన్ని కొత్త సమస్యలు ఎదురవుతున్నాయి. శిక్షితులైన గ్రంథపాలకులు ఉంటే తప్ప గ్రంధాలయ వ్యవస్థ సక్రమంగా పని చేయదు. కాబట్టి ప్రభుత్వం వారు బాన్‌ను ఎత్తివేసి శిక్షితులైన వారితో నియామకాలను పూర్తి చేయాలి.

### 2. వృత్తి పై శ్రద్ధాసక్తులు గల వారినే నియమించాలి

గ్రంథాలయంలో సిబ్బందిని నియమించటంలో యాజమాన్యం చాలా జాగ్రత్త వహించాలి. సిబ్బందిని నియమించేటప్పుడు విద్యార్హతలు, అనుభవమేగాక దరఖాస్తుదారుని మానసిక పరిస్థితి, వ్యక్తి నడవడిక, మానవతా దృక్పథం, సేవాభావం, వృత్తిపరమైన ఆలోచన, శ్రద్ధ ఇష్టాఇష్టాలను తెలిసికోవాలి. ఎందుకంటె ఎన్ని విద్యార్హతలు ఉన్నా ఎంత మేధాశక్తి ఉన్నా వృత్తిపరమైన శ్రద్ధ లేనట్లయితే అటువంటి వ్యక్తి గ్రంథాలయంలో అవాంచనీయ వ్యక్తిగా ఉంటాడు. అటువంటి వారి వల్ల గ్రంథాలయంలో లాభం కంటే నష్టమే ఎక్కువగా ఉంటుంది. గ్రంధాలయంలో పనిచేసే వారికి సేవాభావం, మంచి పఠనాసక్తి విజ్ఞాన సముపార్జనలో తృష్ణ, కలుపుగోరుతనం, సర్దుబాటు మనస్తత్వం కలిగివుండాలి.

అదే విధంగా గ్రంథాలయ రంగంలో ఆసక్తి గల వారినే పరిషత్ ఛైర్మన్‌గానూ, జిల్లా గ్రంథాలయ సంస్థల అధ్యక్షులు గానూ, ఇతర సభ్యులుగానూ ప్రభుత్వం నియమించాలి, ఇంతేకాదు. మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలలో మాదిరి మనకు కూడా గ్రంథాలయ శాస్త్రంలో శిక్షణ పొందినవారిని డైరెక్టర్‌గా నియమించినట్లయితే ఆయన పర్యవేక్షణలో వృత్తిపరమైన లోపాలను ఎత్తిచూపి, వాటిని సరిచేయటానికి అవకాశముంటుంది.

## 3. ప్రమోషన్ నియామకాలు - నవ్వుల పాలు చర్యలు

క్రింది స్థాయి ఉద్యోగులు ముఖ్యంగా అటెండర్లకు, రికార్డు అసిస్టెంట్లకు ప్రమోషన్ ఇచ్చి గ్రేడ్ -3 ఉద్యోగులుగా నియమించడం ఆత్మహత్యా సదృశ్యమే. వీరిలో చాలామంది అర్హత పదవ తరగతి. పైగా వీరికి సరిగా చదవడం, వ్రాయడం కూడా రాదు. అలాంటప్పుడు వీరు పాఠకులను ఎలా గైడ్ చేస్తారు? కేంద్ర కార్యాలయంతో ఉత్తర ప్రత్యుత్తరాలు ఎలా నిర్వహిస్తారు? ఇలాంటి వారిని శాఖా గ్రంథాలయాలలో నియమిస్తే వీరిని చూసి ప్రజలు నవ్వుకుంటారు. సంస్థకున్న పరువు కూడా పోతుంది. అలా కాకుండా వీరికి ప్రమోషన్ ఇవ్వాల్సి వచ్చినప్పుడు ఆ ప్రమోషన్ స్కేలు ఇచ్చి వారి పాత విధులలోనే కొనసాగించడం మంచిది.

## 4. ప్రమోషన్లలో సీనియార్టితో పాటు అర్హతలను కూడా చూడాలి

ప్రమోషన్ పద్ధతిలో సీనియారిటి కాకుండా, అర్హతలనుక బట్టి చేస్తే మంచి ఫలితాలు రావడానికి అవకాశముంది. డిపార్ట్‌మెంట్ పరీక్షల ద్వారా పదోన్నతి జరిగినట్లయితే రెట్టించిన ఉత్సాహంతో అంకిత భావంతో పనిచేయగలరు. పైగా సర్వీసులో పోటీ పెరిగి అత్యుత్తమమైన సేవలు రాబట్టడానికి అవకాశం ఉన్నది. వీటి వలన సర్వీసులో ఉన్నవారు వారి అర్హతలను పెంచుకోవడానికి ప్రయత్నిస్తారు. లేదా రెండు పోస్టులు ఖాళీ వుంటే 1:1 అనగా ఒకటి సీనియార్టికి, ఒకటి అర్హత గలవారికి కేటాయించవచ్చును. దీని వల్ల ఉద్యోగులలో సమతౌల్యత ఉంటుంది.

## 5. పునశ్చరణ తరగతులు

గతంలో పునశ్చరణ తరగతులు నిర్వహించి కొత్త విషయాలు తెలుసుకునే అవకాశం కలిగించేవారు. అలాంటి పునశ్చరణ తరగతులకు ఏనాడో స్వస్తి చెప్పారు. ఈనాడు గ్రంధాలయ శాస్త్రం ఎంతో అభివృద్ధి చెంది కంప్యూటర్ యుగం వైపు పయనిస్తున్నది. గ్రంధాలయ శాస్త్ర రంగంలో వస్తున్న నూతన పరిణామాలను ఎప్పటికప్పుడు పునశ్చరణ తరగతుల ద్వారా సిబ్బందికి ఎరుకపరచి గ్రంథాలయ సేవానైపుణ్యం పెంపుదలకు కృషి

చేయడం ఎంతైనా అవసరం. మారిన, మారుతున్న కాలానుగుణంగా గ్రంథపాలకుడు అప్-టు-డేట్‌గా లేకపోతే, ఉపయోగించడంరాని సైనికునికి ఆధునిక ఆయుధాలు ఇచ్చినట్లవుతుంది.

## 6. సిబ్బందికి ప్రోత్సాహకాలు

ఉత్సాహవంతులు, సమర్థులైన యువకులు పౌర గ్రంథాలయాలవైపు ఆకర్షించపబడాలంటే, ప్రభుత్వోద్యోగులతో పాటు అన్ని సదుపాయాలు పౌర గ్రంథాలయ సిబ్బందికి కూడా వర్తింప జేయాలి. అందులో భాగంగా

1. గ్రంథాలయ సిబ్బందిని ప్రభుత్వ సిబ్బందిగా ప్రకటించాలి. సంస్థల సిబ్బంది అందరిని ప్రభుత్వ సిబ్బందిగా గుర్తించాలని ఎక్స్‌బైటే సంఘం స్పష్టం చేసినా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు.
2. సంస్థ సిబ్బందికి రావలసిన జీతభత్యాలు, బకాయిలు లేదా ఇతర చెల్లింపులు సకాలంలో జరిగేటట్లు చూడాలి.
3. ట్రాన్స్‌ఫర్లు తదితర వేధింపులు లేకుండా చూడాలి.
4. సిబ్బందికి తగు ప్రోత్సాహకాలు కల్పించాలి.

గ్రంథాలయ వ్యవస్థ విజయం సిబ్బంది సహకారం కృషి, సేవానిరతి పై ఆధారపడి వుంటుంది. కాపున వారి విషయములో తగిన శ్రద్ధ తీసుకోవడం అవసరం.

## 2.7 ANDHRA PRADESH GRANDHALAYA PARISHAD : A DESCRIPTIVE ACCOUNT WITH CRITICAL COMMENTARY AND SUGGESTIONS

**- Dr.M.V.Venugopal**
**- Dr.M.Sankara Reddy**

The Govt. of A.P., by an amendment to the APPL Act, 1960 established, a new apex body corporate named as Andhra Pradesh Grandhalaya Parishad doing away with the earlier State Library Committee.

**The significant feature of the Parishad**

This legislative measure has effected a significant change both in the size and composition of the Parishad making it a compact one. The earlier State Library Committee, a large body of about 15 members was an unwiedly one. Its chairman was Minister incharge of Education. The members consisted of 3 officials (three Secretaries of the Depts. of Edn., Health & Municipal Administration and two directors of higher education and municipal administration); 3 persons (nominated by the 3 University Syndicates); 3 persons nominated by APLA, 8 persons nominated by the govt.person (from among the members of the CGS, 3 from among the ZGSs, 1 known for outstanding service to the cause of libraries, 1 with special knowledge in public library matters and 2 from DCLS); 4 MLAs and 2 MLCs (elected among themselves); the Librarian of the CCL as ex-officio Member; and the DPL as member-Secretary.

Unlike this, the new body has a total of 9 members only. Besides the Chairman the Parishad consists of 8 other members (1 person with expert knowledge in library science, 2 persons who have rendered service for development of library movement and education, 1 person representing aided libraries, 1 person from among Chairman of the ZGSs, 1 person from among the Secretaries of the

ZGSs, the Librarian of SCL as Ex-officio Member and the Director of Public Libraries as Member Secretary.) The Chairman is a public figure known for the service rendered for the cause of education and library movement. The Chairman and the members are all nominated by the Govt.

### Term of Office

The term of office of all the members as well as the Chairman (except Ex-officio members) as provided orginally is 3 years. Any new member nominated against a vacancy serves the residual period.

### Remuneration

The Chairman holds the status of a Cabinet Minister and is paid salaries and allowances as admisiable by the rules. The other members (other than ex-officio members) are entitled to allowances.

### Power and Functions of the Chairman

The Chairman is the head of the Parishad who presides over the meetings (conveyed at least once in 2 months), supervises the execution of policies and programmes and exercises other powers as may be prescribed by the Government.

### Powers and Functions of the Member-Secretaries

The Director of Public Libraries, as the Member-Secretary, is the chief executive of the Parishad and is responsible for (i) implementing the policies and programmes of the Parishad, (ii) general supervision and control of the Parishad office staff, field staff of the libraries and all the employees of the Parishad as well as the ZGSs, (iii) administration, i.e. appointments, transfers, promotions, disciplinary actions, etc., of the staff of the Parishad and the ZGSs, (iv) conduct of day-to-day administration including financial transactions etc., of the Parishad, (v) custody of the

finances of the Parishad, (vi) preparation and presentation of audited statements of accounts and utilisation certificates to the Parishad for approval/ratification, (vii) obtaining audited statement of accounts along with utilisation certificates from the ZGSs to be placed before the Parishad for approval and (viii) recommending administrative and financial sanctions for creation of posts of officers and other employees to enable the Parishad to perform its functions well.

## Objectives of the Parishad

The objectives in creating the Parishad as mentioned in the Act are

1) to organise and promote library service in the state,
2) to establish, equip, maintain and develop an integrated, comprehensive and efficient library service in the state,
3) to augment the supply of books and periodicals to the libraries in the state,
4) to develop such facilities as buildings, furniture, equipment, etc. to all the libraries in the system,
5) to raise finances and regulate their utilisation,
6) to undertake all related activities,
7) to augment the income of the Parishad and the ZGS, and suggest ways and means to raise additional resources, and
8) to prepare long and short term plans to improve the library services and to supervise the implementation of the same.

## The Parishad as the Policy Making Body

The Parishad is made the principal policy formulating body with the powers and functions of

(i) making perspective plans for the development of library services as well coordination and formulation of standards of library services for the ZGSs,
(ii) preparation of consolidated programmes in confirmity with the guidelines issued by the Govt. and RRLF as well as implementation of the developmental programmes,

(iii) approval of the Parishad's budget estimates as well as the budget estimates of ZGSs
(iv) approval for creation of full-time posts and sanctioning the opening of branch libraries, village libraries and Book Deposit centres depending upon the availability of funds,
(v) according administrative and financial sanction for the construction of library buildings as well as for additional staff,
(vi) approval of shifting regional and mobile libraries,
(vii) acceptance of gifts and endowments for library purposes upto the value of 5 lakhs,
(viii) approval and submission to the Govt. yearly audited statements of accounts and utilisation certificates of its funds,
(ix) approval of the annual audited statements of accounts of ZGSs,
(x) approval of the annual report on the working of the public libraries under the Act and placing it before the legislature,
*(xi) deciding the policy for selection and purchase of books needed by the public libraries and constituting sub-committees with included in it expert in the subject or language concerned included in it in addition to other eminent people in the concerned faculties,
(xii) organising and conducting library seminars, workshops and conferences,
(xiii) setting up sub-committees as may be needed and regulating their work,
(xiv) coordination of all the library activities and supervision to ensure proper utilisation of funds allotted for the purpose including the cess collected by ZGSs, and
(xv) preparation of consolidated programmes of library services as per the guidelines provided by the Govt.

**Funds of the Parishad**

The finances of the Parishad consist of
(i) Govt. grants,
(ii) money received by or accruing to the Parishad under the

provisions of the APPL Act or other law in force as well as under other contracts,

(iii) money received from public bodies, private bodies and individuals by way of grants, donations and deposits,

(iv) amounts from the ZGSs as may be required for specific purposes as provided under the APPL Act as per the instruction of the Govt.,

(v) proceeds though the disposal of the property by or on behalf of the Parishad, and

(vi) interests and profits accruing from any investments or any transactions relating to the money belonging to the Parishad.

The Parishad is required to deposit all its funds in such banks and invest in such manner as may be prescribed. The Parishad is also empowered to spend such amounts as it may deem fit to perform its functions according to the APPL Act and all such expenditure is treated as expenditure payable out of the Parishad's funds. There is also a clause which states that the Govt. may transfer to the Parishad any properties of the public libraries alongwith the staff on specific terms and conditions.

**Commentary**

The Parishad is not an autonomous. It has to function under the supervision and control of the Govt. the later retaining the powers to direct and review the actions of the Parishad. For example, the Parishad cannot sanction the opening of branch libraries or construction of library buildings. It cannot also create new posts. It is also not empowered to accept donations etc., exceeding the value of Rs.5 lakhs. All these require approval and sanction from the Govt.

There are also other restrictions. There is no provision for a separate office for the Parishad. The objectives and functions as articulated in the Act necessarily require a sizeable and competent staff capable of planning and preparation of schemes and programmes, formulation of standards in all respects, laying down procedures and handling of finances. As a matter of fact there has

and magazines. The Andhra Pradesh Government may take initiative to get public cooperation as in Tamilnadu.

The Gopal Rao Ekbote Committee made useful recommendations in its monumental report to boost up library finance. The Government should take steps to implement them.

The Government should take steps to pay all the pensionary benefits to the retired employees of Zilla Grandhalaya Samsthas through Government Treasuries. It involves no additional expenditure.

It is not hyperbolic to say that the Zilla Grandhalaya Samsthas may have to face a worsening situation unless the Government initiate remedial action for putting things back on the rails without further loss of time.

## 3.1 గ్రంథాలయ గోపురాలు

- డా॥ జె. బాపురెడ్డి

అక్షరాకాశంలో పొడచిన
తొలి ప్రొద్దు పుస్తకం
శబ్ద సరోవరంలో విరిసిన
తొలి శత పత్రం పుస్తకం-
శిలల మీద శ్రీకారం దిద్దిన అక్షరం
ఆకుల మీద ఆకారం దాల్చిన శబ్దం
తమ విశ్వరూపాన్ని ప్రదర్శిస్తున్నవి
అంతరిక్షాన్ని జయిస్తున్నవి
గ్రంధాలయ గోపురాల నుంచి
ఆలోచనల కాపురాల నుంచి
అవనీ గోళాన్ని పాలిస్తున్నవి -
చేతిలో పుస్తకంలేకుండా
క్షణమైనా బ్రతికలేదు సరస్వతి
ఏ వేదమైనా వాదమైనా
గ్రంధస్థం కాకుండా గుర్తింపు పొందలేవు -
విజ్ఞానాన్ని పెంచేవి గ్రంథాలే
వివరాలు అందించేవి గ్రంధాలే
విప్లవాలు తెచ్చేవి గ్రంధాలే
విభేదాలు తీర్చేవి గ్రంథాలే
ప్రశ్నలు వేసేవి పుస్తకాలే
సమాధానాలు రాసేవి పుస్తకాలే
ధర్మాలు బోధించేవి పుస్తకాలే
మస్తకాలను వేధించేవి పుస్తకాలే -
దరిద్రులనీ ధనవంతులనీ విభేదాలు లేని
కులమతవర్గ విచక్షలేని

అక్షర చక్షువులు గ్రంథాలు
సమదర్శన సాధనాలు గ్రంథాలయాలు
పుస్తకాలకు నిదురలేదు
రేయింబవళ్లూ
రెక్కలార్చే పక్షులవి
లోకం నిద్రిస్తున్నా
గ్రంథాలు మేల్కొనే ఉంటాయి.
కలాలు పట్టుకుని
కాలం పోకడలు కనిపెడుతూనే ఉంటాయి
పుస్తకాలలోని భాషలు వేరైనా
భావాలు పంచుకుంటాయి
నదులన్నీ సాగరం చేరినట్లే
పుస్తకాలన్నీ గ్రంథాలయం చేరుకుంటాయి
సముద్రాలనుంచి మేఘాలు పుట్టినట్లే
గ్రంథాలయాల నుంచే
గ్రంథాలు పుడుతుంటాయి
భూత భవిష్యత్ వర్తమానాలకు
అనుబంధాలు కలుపుతుంటాయి
పుస్తకాలు పరస్పరం
మాట్లాడుకుంటాయి - పోట్లాడుకుంటాయి
పొత్తు కుదిరినా కుదరక పోయినా
సహజీవనం చేసే సూత్రాలు పొత్తాలు
అలసటలేని జీవన యాత్రలో
అనంత సత్యాలు శోధించే
పుణ్యక్షేత్రాలు గ్రంథాలయాలు

# 3.2 పుస్తకాలు

- ఎస్.ఎస్. లక్ష్మి

మానవుడు భాషను కనిపెట్టిన నాటి నుండి, నేటివరకు మానవాభివృద్ధి చరిత్ర యావత్తూ పుస్తకాలలో నిక్షిప్తం కాబడింది. మనిషికి వెలుపల గల ప్రపంచంలో జరిగే అభివృద్ధి క్రమ పరిణామం మనిషిలోపలి ప్రపంచపు లోతుపాతులు అన్నీ అక్షర రూపంలో ఆవిష్కృతమై ఉన్నాయి కాబట్టే పుస్తకప్రియులు ఆనాటి మానవుడితోనేగాక, ఈనాటి మానవుడితో రేపటి మానవుడితో కూడా పరిచయం ఏర్పరచుకోగలిగారు. మానవ సమాజ క్రమవికాసం మనిషి ఎదుర్కొంటున్న జీవితపు ఆటుపోట్లు, బాధలు, ఆనందాలు, జయాపజయాలు ఒకటేమిటి మొత్తం వేల సంవత్సరాల మానవ నాగరికతంతా కూడా పుస్తక రూపంలో పొందుపరచబడి వుంది. పుస్తకం చదివే అలవాటున్న ప్రతి వ్యక్తికి ప్రపంచం అతి చేరువలో ఉంటుంది. పుస్తకాలు చదివే వారికి, చదవని వారికీ గల తేడా ఏమైనా ఉందా? పఠనాసక్తిగల వారంతా సంస్కారవంతులేనా అంటే సందేహాస్పదమే. పుస్తకాల్లో కూడా మంచి పుస్తకాలు, చెడుపుస్తకాలు అనే వర్గీకరణకు అవకాశం ఉంది. ఈ వర్గీకరణ కేవలం పుస్తకాలకే వర్తిస్తుందని చెప్పలేం. ఆయా పుస్తకాలను ఎన్నుకునే వ్యక్తుల స్వభావాన్ని బట్టి కూడా ఈ వర్గీకరణ ఉంటుంది. ఒకరికి మంచిదైన పుస్తకం వేరొకరికి కాకపోవచ్చు. మనిషి శ్రేయస్సుకు ఉపయోగపడే పుస్తకాలు ఏవి? అని నిర్ణయించుకోవలసింది విజ్ఞులైన వ్యక్తులే.

వేలాది సంవత్సరాల చారిత్రక, కళా, సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ, సామాజిక, శాస్త్రీయ రంగాలకు సంబంధించిన లక్షలాది గ్రంథాలు గ్రంథాలయాల్లో భద్రపరచబడి ఉన్నాయి. ఇవన్నీ చదవటానికి, చదివి తెలుసుకోవటానికి ఒక మనిషి జీవిత కాలం చాలకపోవచ్చు. అయినాగానీ ఆసక్తిగల వ్యక్తులు తమ జీవిత కాలంలో మానవజాతి చరిత్రనంతా అధ్యయనం చేయవచ్చు. పుస్తకం అనేది భూత భవిష్యత్ వర్తమాన కాలాలను చూసే కరదీపిక. ఈ వెలుతురులోనే అనేకమంది మేధావులు ధన్యజీవులై ముందు తరాలకు మార్గదర్శకులు కాగలిగారు.

పుస్తక పఠనంలో గల ఏయే అంశాలు మనిషిని సంస్కారవంతునిగా చేస్తున్నాయి? పఠనాసక్తిగల వారంతా సంస్కారవంతులు కాగలుగుతున్నారా? వ్యక్తి సంస్కారవంతుడవటానికి, కాకపోవటానికి కేవలం పుస్తకాలే దోహదపడతాయా? పుస్తకాల తోడ్పాటుతోనే మనిషి మానసిక వికాసాన్ని సాధించగలుగుతున్నడా? ప్రపంచం కేవలం పుస్తకాల వల్లనే మారుతుందా? ఇవన్నీ ఆలోచించవలసిన ప్రశ్నలు.

శ్రీశ్రీ మహాప్రస్థానం చదివిన వారంతా సామ్యవాదులు కాగలిగారా? చలం రచనల్లోని నిర్భీతిని, నిజాయితిని గ్రహించి ఆచరించిన వారెందరు? తిలక్, బుచ్చిబాబులోని భావుకతను ఆస్వాదించిన వారెందరు? పద్మరాజుగారి కథలోని జీవిత సారాన్ని అవగాహన చేసుకున్నవారెందరు?

ఒక మంచి పుస్తకం చదువుతూన్నమంటే ఆ రచయిత అనుభవసారాన్ని, అతని స్వాభావిక ఛాయల్ని మనం అవగాహన చేసుకొంటున్నామన్నమాట. ఆ అవగాహన మన మనోవికాసానికి తోడ్పడకపోతే ఆ లోపం తప్పని సరిగా పాఠకుడిదే. మంచి పుస్తకం చదివిన వారంతా మంచి వ్యక్తులుగా మారిపోవడం లేదెందుచేత? ప్రపంచంలో గల గొప్ప గ్రంథాలు కొందరినే ఎందుకు గొప్ప వారిగా చేశాయి. అందరినీ ఎందుకని చేయలేదు? ఒక గొప్ప వ్యక్తిని అంచనా వేయాలంటే అవతలి వ్యక్తిలో కూడా కాస్తో కూస్తో ఆ గొప్పతనం ఉండి తీరాలి. అలాగే ఒక గొప్ప పుస్తకం అర్థం కావాలంటే దానికి ముందు ఆ వ్యక్తికి ఆ గొప్పదనం అవగాహన చేసుకోగల శక్తి కావాలి. అవునా? ఆ శక్తి లేకుండా ఆ పుస్తకం గొప్పదనం గానీ, ఆ రచయిత ఏం చెపుతున్నాడనేదిగానీ అంచనా వేయటం అసాధ్యం. అందుకే చాలా మందికి చాల గొప్ప పుస్తకాలు అసలు అర్థం కావు. అట్లానే గొప్ప వ్యక్తులు కూడా అర్థం కారు. ముఖ్యంగా రచయిత ఆలోచనా సరళితో ఏకీభావంకుదరని రచన మనకి నచ్చదు. రచయితతో, రచనతో తాదాత్మ్యం చెందిన పుస్తకమే మన ఆలోచనా సరళికి పదును పెడుతుంది. అప్పుడే ఆ పుస్తక సారాంశం మన రక్తంలో ఇంకి అదొక అద్భుత అనుభవంగా మిగిలిపోతుంది. ఈ అనుభవం సంస్కారవంతమైన ఆలోచనా శక్తిని అందివ్వగలుగుతుంది. ఇలా జరగటానికి వ్యక్తి స్వభావంలో సహజంగా కొంత సంస్కారపు ఛాయలుండాలి. లేనప్పుడు రచనతో, రచయితతో ఏకీభావం కుదరదు. సహజసిద్ధమైన సంస్కారం లేని వానికి ఆ రచన అర్థం కాకపోగా దానిని దుయ్యబట్టి విమర్శిస్తాడు. (అందుకే పుస్తకసమీక్షకులు సహృదయులైన సద్విమర్శకులు కావాలి. వివేకవంతులైన విమర్శకులే పుస్తకాల్లోని మంచి, చెడులను మనకి తిప్పి చెప్పగలుగుతారు.)

ప్రపంచం ఎంత మారినా గానీ మారని పుస్తకాలు మనకున్నాయి. (పురాణాలు, మత గ్రంధాలు, పిడి వాదాన్ని ప్రబోధించే సిద్ధాంత గ్రంథాలు వగైరా) అలాగే ఆధునిక యుగంలో కూడా మధ్యయుగాల నాటి మనస్తత్వాన్ని వదలని మనుషులు మన మధ్య ఉన్నారు. వీరు ఆధునిక యుగంలో జీవిస్తున్నా వీరి ఆలోచనలు ఆటవిక దశనే పోలి ఉంటాయి. అత్యంతాధునికమైన భావాలతో కూడిన పుస్తకాలపై వీరు తమ అతి తెలివితేటలతో కూడిన విమర్శనాస్త్రాలను సంధిస్తుంటారు. ఇట్లా సంధించిన వారు అల[illegible] కాలగర్భంలో కలిసిపోగా తిరిగిఇటువంటి వారు తలెత్తుతూనే ఉంటారు. ఆధునిక[illegible] అవిశ్రాంతమైనది. దీని గమ్యం నిరంతరం ముందుకే. శతాబ్దాలుగా దీని బాటలో ఎదుర

మౌఢ్యాన్ని తిరస్కరిస్తూ అది ముందుకు సాగిపోతూనే ఉంటుంది. పఠనాసక్తిగల వారంతా మంచి పుస్తకాల్ని ఎన్నిక చేసుకునే ముందు మానవజాతికి మంచిని పంచి ఇచ్చే మౌలిక అంశాలపట్ల ఒక స్పష్టమైన అవగాహన కలిగి ఉండాలి. ఈ అవగాహన గల వ్యక్తి అనేక రకాల పుస్తకాల్ని చదివినా గానీ, వాటిల్లో తన శ్రేయస్సుకి ఉపకరించే నాటి సారాంశాన్ని మాత్రమే గ్రహిస్తాడు. గ్రహించినంతమాత్రాన సరిపోదు. ఆ గ్రహించిన దాన్ని కొంత మేరకైనా తన ఆలోచనా సరళికి అన్వయింపచేసుకుంటేనే తప్ప పుస్తక పఠనం వల్ల ప్రయోజనం లేదు.

చాలామంది ఫలానా పుస్తకం చాలా బావుందండీ! అంటుంటారు. దానికి మిగతా వారు వంత పాడుతుంటారు. ఆ పుస్తకంలోని గొప్పదనం ఏమిటో నిజంగా ఆ వ్యక్తి అవగాహనలోకి వచ్చిందా? వస్తే అతని ప్రవర్తనలో ఆ గొప్పదనం ప్రతిఫలించదూ! అలా గాకుండా గొప్పగా ఉందండీ! అన్నంత మాత్రాన ఆ రచనకు సిద్ధించే ప్రయోజనం ఏమీ ఉండబోదు. నిజానికి పుస్తకాల్ని ప్రేమించేవారూ, వాటి సారాన్ని జీర్ణింపు చేసుకున్న వారూ పదిమందిలో ఉన్నా ప్రత్యేకంగా కనిపిస్తూనే ఉంటారు. గొప్ప పుస్తకాల ప్రభావం వారి వ్యక్తిత్వాన్ని ప్రకాశింప చేస్తూనే ఉంటుంది.

మన చుట్టూగల అనేకమంది వ్యక్తుల్లో కొందరు పుస్తకాలే ప్రపంచంగా మునిగి తేలుతుంటారు. కొందరు అనేక రకాల పుస్తక సారాంశాన్ని పోటీపడి ఔపోసన పడుతుంటారు. చిత్రమైన వారు కొందరుంటారు. వారు ఫలానా పుస్తకం చదివారా అంటే 'చూశాం' అంటారు. వీరు పుస్తకాల్ని చదవరు. కంటితో చూస్తారు. మరికొందరు మనం చదివిన పుస్తకం గురించి మాట్లాడుతుంటే కల్పించుకొని ఆ పుస్తకం తామూ చదివినట్లుగా మాటలు కలుపుతుంటారు. నిజానికి వీరు ఆ పుస్తకాన్ని చూసైనా ఉండరు. పుస్తకం కొనకుండా ప్రక్కవాడిది పట్టుకొని వెళ్ళి చదివి దాన్ని తిరిగి ఇవ్వకుండా మాయంచేసే వారూ ఉన్నారు. కొందరు గ్రంథాలకు గ్రంథాలే బట్టీ పట్టిస్తుంటారు. అయినా గానీ వాటి సారం వీరికి ఏ మాత్రం అంటకపోవడంతో పుస్తకాల దారి పుస్తకాలదీ, వీరిదారి వీరిదిగానే ఉంటుంది. జ్ఞాన తృష్ణ మనిషికి అవసరమే గానీ, మితిమీరిన జ్ఞానం మనిషిని ఎందుకూ కోరగాని వానిగా చేస్తుంది. తనకూ, తన చుట్టూ ఉన్న వారికి తాను ఆర్జించిన జ్ఞానం ఉపకరించకపోతే ఎన్ని గ్రంథాలు చదివీ ఏం ప్రయోజనం! మౌలిక జీవిత స్వరూపాన్ని దర్శించటానికి కేవలం గ్రంథ పఠనమొక్కటే చాలదు. ఎల్లప్పుడూ పఠనాభిలాష మనిషిని పండితునిగా చేయవచ్చు. పాండిత్యం కంటే ప్రకంపించే మనసు గొప్పది. ప్రకంపించే మనసుతో ఆర్జించిన పరిమిత జ్ఞానం గొప్పది. తెరిచి ఉంచిన మనసుతో స్వేచ్ఛా వాయువుల్ని ఆస్వాదించగలిగిన వ్యక్తి మానవతకు మరోరూపమై ఆధునిక మానవునిగా రూపొందుతాడు. ఇటువంటి వారికి పుస్తక పఠనం ఒక అమూల్యమైన ఆభరణం వంటిది. దీని మెరుపులో వారు దేదీప్యమానంగా ప్రకాశిస్తూ సాటి వారికి కూడా ఆ కాంతిని పంచగలుగుతారు.

# 3.3 పుస్తకాలు వచ్చినయ్యి ... మరి!

- జి. కృష్ణ

జడముడి జాహ్నవీతట నిశాకర పోతము జూచి
ఎవ్వరీ కొడిమెలుగట్టి పెండ్లి కొడుకున్
గడియారము మోవజేసిరంచడుగ వివాహవేది పయి
అంచిక నెచ్చెలిజూచినవ్వు - నా మృడుడు నృసింహశౌరికి
సమిజ్జయముల్ దయసేయు గావుతన్

ఇట్లా ఒక కావ్యం ప్రారంభమయింది. శివపార్వతుల కళ్యాణ ఉత్సవంలో కానవచ్చిన అంతచక్కటి రసవత్తర సన్నివేశాన్ని కావ్య రచనారంభంలో ప్రార్థనాపూర్వకంగా పేర్కొని, తీరా తనరాజుగారికి జయంకలిగేటట్లు చూడమని శివుని అడగటం, ఎంత చచ్చుగా ఉందంటారు! పిల్లలమర్రి పినవీరభద్రుడు నిజంగా చచ్చు మనిషేనందామా?

నేటి ధనవాదం రోజులలో కూడా పినవీరభద్రుని ఆక్షేపించటం దేనికీ అని ... డబ్బు కోసం ఏదైనా తినే రోజులలో కూడా ఇటువంటి ఆక్షేపణలు అవసరమా?

అసలు సంగతి ఇది ... పిన వీరభద్రుడు జైమినిభారతం వ్రాసుకున్నాడు. దానికి పుత్రికలను (తెలుగులో కాపీలు అంటారు! ప్రతులే!) వ్రాయించుకోవాలి. ఈ కాలంలో అవుతే, కొద్దిగా విరాళాలు పోగుచేసుకుని గబగబా అచ్చు వేయించుకోవచ్చు. అచ్చుకూటం ఆసామీకి అంకితం ఇవ్వగలుగుతే, ఇంకేం కావాలి! అప్పుడూ ఇప్పుడూ కూడా, కవిత్వాన్ని కొద్దిగా హెచ్చు ధరకే అమ్ముకోవచ్చు. ఎందుకో చెప్పలేం. ఉన్న సంగతి అది.

ఒక మహారాజకుమార్‌గారు, తాను అల్లిన ఒక కవితా గ్రంథాన్ని నలభై ఏళ్ల కిందట నాకు బహుకరించాడు. ఎంతో సంతోషించాను, మహారాజకుమార్‌గారు బహుకరించాడు కదా అని- అదేదో కాగితం... ఈకబరువుకాగితటంట.. లావుగా ఉన్నట్లుండి, భారరహితమై, మెత్తగా, నున్నగా, అదొక సొంపు.

దానిపైన అచ్చు, కవితల అచ్చులు. ప్రతికవితలో అల్పాక్షరరమ్యత. అక్షరాలకు వ్యక్తిత్వం ఉన్నట్లు, వాటికి సాన్నిహిత్యం కూడదన్నట్లు, మధ్య మధ్యలో పులిస్టాపుల వరస, తరుచు చిరతపులిస్టాపులు, ఆశ్చర్యార్థకాలు, ప్రశ్నార్థకాలు, అడ్డుగీట్లు, అట్లా ఈవిరామ సంజ్ఞలకు కూడా అక్షర స్థాయికూర్చి, ఆ కావ్య కన్యకకు ముస్తాబు చేశాడాయన. ఇప్పుడు రూపమేకానీ,

భావం జ్ఞాపకం రావటం లేదు. చాలాకాలం పాటు నా వద్ద ఆపుస్తకం ఒక విలువైన గ్రంథంగా, పుస్తకాలలో కలిసి ఉండేది. తీరా యవ్వనం పోయినట్లు, ఎక్కడికోపోయింది.

మహారాజకుమార్‌గారి వలే కొందరు, సాహితీ మహారాజులు, యువరాజులు, సామంత రాజులు వ్రాయటం నేనెరుగుదును కానీ, ఏమిటో, ఆ ఉదాహరణ ప్రాయ గ్రంథాలన్నీ ఏమయినయ్యో చెప్పలేను.

కవిత్వం కొద్దీ కాగితం, కాగితం కొద్దీ అచ్చు! అదీ ఒక తెరమరుగైన సంప్రదాయం. ఇప్పుడు కూడా ప్రతి పుటలో నిలువునా సగం ఖాళీ, మిగతా ఖాళీలోనే కవిత్వం నిక్షిప్తం చేస్తారు. కవితను పుట చివరనో, మధ్యలోనో అంతం చేయాలని రసికుడు అనుకోడు. చాలా పుట భాగం ఖాళీగానే ఉండిపోతుంది. పోనీ ఆ ఖాళీ జాగాలో ఒక నిలవ బొమ్మను పెట్టి అచ్చు వెయ్యరాదు అంటే, వీల్లేదు, అది కవితకు సరితూగే చిత్రం అయి ఉండాలి. ఇంతకూ ఖాళీలు కవితలో సొంపు. అంటే శ్వేత పత్రం ఒక సొంపు.

## వ్రాయటం ఒక వృత్తి

చాలా దూరం వెళ్ళాం పిల్లలమర్రి పినవీరభద్రుని నుంచి. పిన వీరభద్రుడు తన గ్రంథానికి పుత్రికలు వ్రాయించుకోవాలి. ఎవరు వ్రాసిపెడ్తారు? ఎవరయినా ఊరికే వ్రాసి పెడ్తారా? వ్రాసి పెట్టడం ఒక వృత్తి. కొందరు వేశ్యలు, దాసర్లు, జంగాలు, చాత్తాడ శ్రీవైష్ణవులు వగైరాలు తాటి ఆకులపైన వ్రాయటంలో నిపుణులు.

కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు "శివతత్వసారం" అనే తాళ పత్రగ్రంథం సంపాదించాడు. దానిని తాళ పత్రాలకు ఎక్కించిన లేఖకుడు అద్దాల సుబ్బన్న. "సారము" అనే శబ్దం ఎక్కడ వచ్చినా, సుబ్బన్న "సారాయము" అనే వ్రాశాడు. ఏమి మధురసికుడో ఏమో! అందువలన లక్ష్మణరావు గారు ఎక్కడ "సారాయము" ఎదురైనా దానిని సారముగా పరివర్తనం చేసుకొనవలసి వచ్చింది.

కవిత్వం వ్రాయటానికి ఎంతగా నిరుపహతి స్థలంబు, రమణీయ ప్రియ దూతిక తెచ్చి ఇచ్చు కర్పూరపు విడెంబు, లభించినా (తోడు పెళ్లి కొడుకు వలే, తోడు కవి... ఈ లేఖకుడు అవుతాడు!) వీటికితోడుగా ధనం కూడా ముట్టజెప్పాలి. వ్రాయటం ఒక ప్రయాస, ఒక కళ. పూర్వం కావ్యాలు, రచనలు అన్నీ ఇట్లాగే చేయించుకునే వాళ్లు. పినవీరభద్రుడు భాసింపెట్టేసుకుని కూర్చుని, పుత్రికలు వ్రాసుకున్నాడంటామా ఏమిటీ! దేనివాళ్ళు దానికే. ఒక్క పంచాగ్నుల సూర్యనారాయణశాస్త్రిగారు మాత్రమే, వ్రాసుకున్నది అచ్చుకెక్కించుకున్నాడు. వాళ్ళ ఇంట్లో అందరూ అచ్చు కూర్చేవారట.

అదీ సంగతి - పినవీరభద్రుడు పుత్రికలు వ్రాయించుకొనటానికి, సర్వజ్ఞ సింగడొకడు

ధనం ఇవ్వాలి. ఆ ధనంతో వీరభద్రుని ఇల్లుగడవాలి. లేఖకుడు బతకాలి. ఎంతగా నల్లగొండ జిల్లా వాడైనా, ఆ మాత్రం ఒక ఫ్యూడల్‌ను బతిమాలకతప్పదు. (కమ్యూనిస్టులు ఎంతగా విసునూరి రామచంద్రారెడ్డిని తిట్టినా అర్థించి విరాళాలు వసూలు చేసుకొనక తప్పలేదు)

ఒక రచయిత, ఒక అకాడమీ అధికారికి తాను వ్రాసిన పుస్తకం పంపించాడు. అది ఎన్నాళ్లకు అచ్చుకాలేదు. అంతట, రచయిత మరొక పుస్తకం వ్రాసి, అకాడమీ అధికారికి దాన్ని అంకితం చేస్తూ ఒక పుటపై ఉల్లేఖించి పంపాడు: రకీమని రెండు పుస్తకాలు అచ్చు అయిపోయినయ్యి. అట్లా ఉల్లిఖిస్తే తప్పు పనికాదు. పినవీరభద్రుని కాలంలోనూ అంతే. పొగడ్త ఉండాలి, డబ్బూ ఉండాలి. మనం ఎంతగా ఏమి మారినట్లు? పైన చెప్పిన మహారాజ కుమార్‌కు అటువంటి దుర్గతి పట్టలేదు. ధనికుడికి పట్టే దుర్గతి తక్కువ. కానీ ధనికుడు ఎక్కడోకానీ రచయితకాడు. డబ్బులేనివాడు వ్రాస్తాడు!

ఎంతకూ వ్రాయటం, అంకితం చేయటం, మెచ్చటం, సత్కరించటం, చెప్పుకుంటే చాలుతయ్యా! గంటం ఇనపది కాబట్టి, అది అయిపోదు. మరి వ్రాసుకొనటానికి ఇప్పటి కాగితాలవలే, అప్పట్లో తాటి ఆకులు కావాలే! పత్రికలు వ్రాయాలంటే తాటి చెట్టును పట్టాలి. ఎక్కాలి, ఆకులు కోసుకోవాలి. వాటిని తగు ప్రమాణంలో కత్తిరించుకోవాలి. ఎండబెట్టుకోవాలి. (గుడ్డలు ఉతికే రేవువలే, ఆకులను ఎండబెట్టుకొనటానికి ఒక రేవు కావాలి) వాటిని సాఫుగా ఉంచటానికి వాటినిసరిగా పేర్చిపైన ఏదో బరువు పెట్టాలి. వాటిపైన వ్రాసుకునే గంటానికి తగుపదును ఉండాలి. వాటిని సూత్రంలో బంధించి, అటు ఇటు చెక్క బంధనం చేయాలి. ఆకులకు పురుగు పట్టకుండా కాకరరసం మధ్య మధ్య రాయాలి. చదవటానికి అనువుగా అక్షరాలలో నిండేటట్లు బొగ్గు పట్టించాలి. ఎంతో చాకిరీ ఉంది. పూర్వం రాజులు కొందరు తాటిచెట్లను దానం చేసేవాళ్లు. జనగాం దగ్గర తాటి చెట్లను ఒక రాజు దానం చేశాడు. ఒక పండితునికి అట్లాగే నెల్లూరు వద్ద కూడా ఒకరాజు దానం చేశాడు. ఆ పండితులు ఆ ఆకులను అమ్ముకున్నారో, వాటిపైన వ్రాసుకున్నారో! అమ్ముకునే (వ్యాపారం) పండితులు కూడా ఉంటారు గదా.

ఏమైనా, తాటి చెట్టును ఫలవృక్ష జాతిలో చేర్చారు. కల్లు, ముంజలు, పళ్లు, ఆకులు (వ్రాతకూ, ఇళ్ళు కప్పులకు, దడులకు), వంటచెరుకు, ఇంటి దూలాలకు, వగైరా ఉపయోగాలు ఎన్నో!

ముచ్చట వేస్తుంది తాటి చెట్ల నిజాయితీ చూస్తే ... నేటికీ పొలాలకు అట్లా అహర్నిశలూ నిలబడి కాపలా కాస్తూనే ఉంటున్నయ్యి మన తాటి చెట్లు. మిత్రుడు కోదాటి నారాయణరావు గారు పొడుగుతాటి వాళ్ళ వంశంవాడు. పాకాల మిత్రుడు, లేదాళ్ల మోహనరావు. లేత తాటి చెట్లు మీంచి వచ్చిన ఇంటి పేరు. తాళ్ళ అనే ఇంటిపేరు ఆయనను ఎరుగుదును, ఒకప్పుడు.

తాటి కాయల అనే ఊరుపేరు, "కరక్కాయి ఉసిరికాయ, తాటికాయ" ల వరసలోది. తాటి తోపులోపడి పోవటం ఎంత బాగున్నా, ఇంకా ఆనాటి వ్రాతల ముచ్చట మిగిలే ఉంది.

## నగరిలేఖినులు

పినవీరభద్రుని కాలాన్ని దాటి మరి రెండు శతాబ్దాలు పోయి, తంజావూరు రాజ్యంలోకి చేరుకుంటే... అక్కడ మరీ ముఖ్యంగా విజయరాఘవుని సభలో నగరిలేఖినులు సాక్షాత్కరిస్తారు. విజయరాఘవుడు ఎంతగా పరిపాలనలో వ్యర్థుడయినా, పాండిత్య ప్రపంచంలో మాత్రం ఊరూపేరూ ఉన్నవాడే కదా. తాటి ఆకుల మీద వ్రాసేయువతులు పాండిత్యం, ధారణశక్తి గలవారు. అవధానాలను, ప్రాకృత భాషలో అవధానాలను గూడా అవలీలగా వ్రాసేసేవాళ్లు. అట్లా గంటంతో అంత త్వరగా ఎట్లావ్రాసేవాళ్లో! తప్పువస్తే, పక్కన వదిలిన ఖాళీ జాగాలో, హంస పాదులు పెట్టి, సరైన అక్షరాలు వ్రాసేవాళ్లు. తర్వాత తర్వాత వచ్చిన అచ్చు కూర్పరుల వలెనే ఈ నగరిలేఖినులు వ్రాసేవాళ్ళు. తర్వాత తర్వాత వచ్చిన షార్టుహ్యాండ్ లేఖినుల వలెనే, విన్నది విన్నట్లు వ్రాసేవాళ్లు. ప్రజ్ఞ అనక తప్పదు కదా. అవధాని ప్రజ్ఞకంటే, నగరిలేఖిని ప్రజ్ఞదొడ్డది. ఆమె ప్రజ్ఞవలననే అప్పటి సాహిత్యం యావత్తూ, తంజావూరు సరస్వతీమహల్‌లో నేటికీ మిగిలి ఉంది.

ఆకాలంలో ఉన్నతకులాల వారికి చదువుకొనక పోయినా వచ్చే చిక్కు లేదుగానీ, ఈ లేఖనావృత్తిని ఆశ్రయించుకున్న వారు తప్పక చదువుకొనవలసినదే.

ఈ మధ్య నేను వరంగల్లు సమీపంలోని నశకల్లు (నష్కల్లు) అనే గ్రామానికి వెళ్లాను. అక్కడ యక్షగానాలు, నాటకాలు వేసే "డక్కలి" కులం వాళ్లున్నారు. వాళ్లు మాదిగల కంటే తక్కువ వాళ్లమని చెప్పారు. మాదిగ వాళ్లకు చదువు వచ్చినా రాకున్నా ప్రమాదం లేదల్లే ఉంది. కానీ డక్కలి వాళ్ళకు చదువు విధిగా వచ్చి ఉండాలి! అంటే, అడుక్కు తినే వానికి ఏదో కొంత చదువు వచ్చి ఉండాలి. ఇప్పటికీ అక్కడి డక్కలి వాళ్లు, తాటి ఆకులపైన అవలీగా వ్రాస్తూ ఉంటారు. ఆ ప్రాంతంలో తాటి చెట్లు పటాలంవలె నిలబడి ఉంటున్నయ్యి. పైగా నాకు డక్కలి వాళ్లను చూసిన తర్వాత, చదువుకుని తక్కువ వాడుగా బతక వలసిన వాడిని కాబట్టి, వాళ్లతో ఏదో ఒక అనిర్వచనీయమైన అనుబంధం నెలకొన్నది. ఈ దేశంలో చదువుకున్న వాళ్లు (చదువుపైన ఆధారపడినవాళ్లు) గదా తక్కువ వాళ్లు. "డొక్క శుద్ధి" అంటే చదువు వచ్చినట్లు గదూ. "డక్కలి" అంటే "డొక్కశుద్ధి" ఉన్నవాడనేనా!

గ్రంధరచన అంటే, వేరే ఏదో జ్ఞాపకం వచ్చింది. ఒక నవాబుగారు ఒక పండితుని పిల్చి, "నన్ను గురించి భారతం వ్రాయవోయ్" అని పురమాయించాడట. పండితుడు వ్రాస్తానన్నాడు.

అయితే, పుత్రికలు వ్రాయించటం ఒక యజ్ఞంలాంటిదనీ, దాని కోసం కాలమూ, ధనమూ వ్యయమవుతవనీ చెప్పుకున్నాడు. నవాబుగారు నిర్లక్ష్యంగా డబ్బు ఇచ్చేశాడు. ఒకటి, రెండు సంవత్సరాలు, ఏదో మహాపని చేస్తున్నట్లే కాలక్షేపం చేశాడు ఆ పండితుడు. కడకు, "సాహేబ్‌గారూ! దాదాపు పూర్తి అయింది. ఒక్క సందేహం తీర్చారా అంటే, పని పూర్తి చేస్తాను. భారత కథకు నాయిక, ద్రౌపది. ఆమెకు ఐదుగురు భర్తలు. మరి, మన బేగం సాహెబా గారికి, నాకు తెలిసినంతవరకూ మీరొక్కరే భర్తలు. మిగిలిన నలుగురు ఎవ్వరో చెప్పారంటే, రచనను పూర్తి చేస్తాను. పుత్రికలు కూడా త్వరగా ముగిసి పోయేట్లు చూస్తాను" అని చెపుకున్నాడు. నవాబుగారికి "సవతిభర్తలు" ఉండటం సిగ్గు చేటుకదూ. "తీసుకున్నడబ్బేదో తీసుకున్నావు. ఇక వ్రాయవద్దు. పో!" అని చెప్పేశాడట.

## పుత్రికలు కావాలి

అదీ ... పుత్రికలు వ్రాయాలి అంటే, డబ్బు కావాలి. కమ్యూనిస్టు అయినా, కాంగ్రెసు అయినా, సోషలిస్టు అయినా, భాజపా అయినా, ఏదయినా డబ్బు కావాలి. అప్పుడూ ఇప్పుడూ మనం ఉండేది ధనవాద యుగంలోనే.

పూర్వం పుస్తకం అంటే అపురూపం. సరస్వతీదేవి వీణా పుస్తకపాణినీ. పుస్తకం ఉన్నవాడు గొప్ప విద్యావంతుడు.. కోశవాన్ ఆచార్య: .. తాళపత్ర పుస్తకాన్ని పట్టుసంచీలో (నారపట్టు) పెట్టుకుని, పురుగులు పట్టకుండా పదిలపడేవాళ్లు. అదే పుస్తకం హస్తభూషణం కాలం. ఎక్కడోకానీ పుస్తకం కనపడేదికాదు. చాలా డబ్బు ఇచ్చి, పుత్రికను కొనుక్కోవాలి. అందువలన ఒకడి నోటినుంచి ఇంకొకని చెవిలోకి సరస్వతి ప్రవహించేది. తప్పదు.

"ఏకాదశి ఉపవాసం ఎప్పుడు చేయాలి?" అంటే, ఎవళ్లు చెప్పాలి? చదువు ఉండి, పుస్తకం చూసినవాళ్లు చెప్పాలి. అందువలన పంచాంగ బ్రాహ్మణునికి ఒక స్థాయి ఉండేది. చదువు అంటే, బట్టీ పెట్టేసి, తానొక పుస్తకం అయిపోవటమే! అంతే కానీ, అసలు వ్రాత వ్రాయటమే రాదు అని అనేవాళ్లు కేవలం అబద్ధాల రాయుళ్లు అనాలి. పుస్తకాలు తక్కువయినా, అక్షరాలు వచ్చు.

మరీ అఘాయిత్యం -- వేదాలను ఎవ్వరూ వ్రాయలేదు అని కొందరి వాదం. మన దేశం వాళ్లు "వ్రాయలేదు, మేము వట్టి బఱ్ఱెలు" అంటే, విదేశాలవాళ్లు "వ్రాయలేరు - మీ పూర్వీకులు గొడ్డు బఱ్ఱెలు" అనేశారు.

పూర్వపు వ్రాతలు బ్రాహ్మీలిపిలో ఉండేవికదా. ఆ లిపిని మనవాళ్లు ఎట్లా, ఏదౌర్భాగ్యం వలన, ఇతిహాసంలో ఏదో మలుపువలన మరిచేపోయారు. అప్పుడు పాటలీపుత్రంలోని నగరశ్రేష్ఠులు (వ్యాపారులు) వ్రాసుకునే నాగరిలిపి ఆధారమైనది. అది రాజుగారు ఉండే నగరం కాబట్టి, ఆ ఊరి లిపిని దేవనాగరి అన్నారు.

తీరా బ్రాహ్మీలిపిని ఎవ్వరు జ్ఞాపకం ఉంచుకున్నారనాలి? ఎవ్వరికీ రాదు. రాతి బండలపైన

ఉంది. కుండముక్కలపైన ఉంది. రాగి ఇత్తడి రేకులపైన ఉంది. "దీన్ని ఎవడైనా చదువుతే వాడి తలకాయ వక్కలవుతుంది" అని మన పూర్వీకులు భయపెట్టేవాళ్లు. అదే రాక్షసి లిపి, దయ్యాల లిపి అనేవాళ్లు. తీరా, ఈస్ట్ ఇండియా కంపెనీ టంకసాలలో, నాణెముల రూపం సరిచూసే ప్రిన్సెప్ అనే ఉద్యోగి ఆ లిపిని చదివేశాడు! అది(బ్రాహ్మీ లిపి .. సరస్వతీ లిపి.

ఆ లిపి లాంటిదే, కొంచెం అటూ ఇటూగా, హరప్ప నాగరకతకు చెందినది. దానిని ఎవరు చదవాలి. ప్రెన్సెప్ మరొకడు పుట్టుకురావాలి. అన్నట్లు, హరప్ప నాగరికత అంటే, సరస్వతీ నది నాగరికతట! అంటే గంగా యమునల తోటి సరస్వతి! అది అమాంతం ఇంకిపోగా (ఏంవిలయం వచ్చిందో, ఏ భూకంపం వచ్చిందో), ఒక పెద్ద ప్రాంతం యావత్తు దెబ్బ తిన్నదట. ప్రస్తుతం విమానం నుంచి, సరస్వతీ నది పూర్వపు మార్గాన్ని ఫోటో తీసేస్తున్నారంటున్నారు.

## సుందర లిపి వచ్చింది

ఈ మహా నాగరకతగానీ, నాటి లిపిని గానీ తెలుసుకొనకుండగానే, ఆర్య ద్రావిడ తేడాలు కల్పించిన సాహసులను ఏమనాలి? అంతకంటే, ఆ సాహసాన్ని నమ్మిన వాళ్ళ అవివేకాన్ని ఏమనాలి?

ఇంతకూ పిల్లలమర్రి పినవీరభద్రునితో ప్రారంభించాంకదూ. అంతకుముందు కాకతీయులు పాలించే వాళ్లుగదా. వాళ్లు బాగున్నారని తెలిసి, ఢిల్లీ సుల్తానులు దండయాత్ర చేశారుగదా. వాళ్లతో అమీర్‌ఖుస్రూ అనే పండితుడు కూడా వచ్చాడు. అతడు తాను చూసినవి వ్రాసుకున్నాడు. ఆ వ్రాతల ప్రకారం, ఓరుగల్లులో చక్కటి కాగితం ఉత్పత్తి అయ్యేది! ఢిల్లీ పరిపాలకులు సిరియా నుంచి కాగితం దిగుమతి చేసుకునే వాళ్లట. దానికంటే ఓరుగల్లు కాగితం బాగున్దన్నాడు ఖుస్రూ! ఓరుగల్లులో మంచి సీరా కూడా దొరికేదట. అన్నీ నాశనం ఐనై! ఓరుగల్లులో భలే వేధశాల ఉండేదనీ, దానిలో వావిలాల కూచన్న అనే ఖగోళ శాస్త్రవేత్త పనిచేసే వాడని కూడా విన్నాను.

సర్లెండి -- ఓరుగల్లును కులాల కొట్లాటలో పెట్టి దెబ్బతీశారు. అంతేగదా. మానవతను వక్రీకరించేవి, శిథిలం చేసేవి, కులమతాలేకదా.

ఈ మధ్య శ్రీకాంత్ అనే యువ మిత్రుడు ఎక్కడెక్కడికో పోయి, కాగితం పరిశ్రమను గురించి చదివి వచ్చాడు. పరిశ్రమ నెలకొల్పాలని యత్నించాడు కానీ, రాజకీయ వాదులు పడనివ్వలేదు. అతడి పరిశోధనలలో తేలినదేమిటంటే -- మన దేశంలో చాలా వందల ఏళ్లుగా కాగితం ఉండేదట. గుడ్డ పీలికలతో, బొంగులతో గుజ్జు చేసేవారట. కానీ, గుడ్డపీలికలతో చేసినది, మడికి పనికిరాదు, శ్రేష్ఠ కార్యాలకు పనికిరాదు అని, ఎవ్వరూ వాడేవారుకారట! ఏమిటో! ఇప్పుడు మనం ఇంగ్లీషు నాగరికతకు మరీ మరీ దాసులం అయిపోతున్నాం. ఇంగ్లీషువాళ్లు రాకపూర్వం మనదేశం ఉండేదికాదు అంటే బాగుంటుంది.

పందొమ్మిదవ శతాబ్దంలో అచ్చుకూటాలు వచ్చినయ్యి. వాడెవడో ఒక బ్రిటిష్ వాడు, నిజాంకు ఒక అచ్చుకూటం బహూకరించగా, నిజాం నవాబు ఆ "అసంప్రదాయకమైన' యంత్రాన్ని ఒక చీకటి గదిలో పడేయించేశాడు. నిజాములు లేకపోతే మన సంప్రదాయాలు నశించేవి అని నమ్మే ఉపమనుషులు ఉన్నారుగదూ! చెన్నపట్నంలో తెలుగు అచ్చు పరిశ్రమ మొదలైంది. మొదలు అవుతే, దాన్ని మెరుగుచేసుకోవచ్చు. ప్రపంచంలో అచ్చు పరిశ్రమ తలెత్తింది. ఏదో ఒకనాడు భారతదేశానికి కూడా వస్తుందిగా. బ్రిటిష్‌వాడే తెచ్చిపెట్టాడని భజనచేయనక్కరలేదు. బ్రిటిష్ వాని దేశంలో పారిశ్రామిక విప్లవానికి ఎక్కువగా ధనం ఇచ్చింది భారతదేశమే.

## అచ్చు వచ్చింది

మొదట్లో, పల్చటి కాగితం దిగుమతి అయ్యేది. దానిని అమ్మే వీధిని గుజతీ బజారు అనేవాళ్లు. గుజతీ అంటే కాగితం - పక్కనే చైనా బజారు. చెన్నపట్నంలో ఇట్లాంటి విదేశీపేర్లు లభిస్తయ్యి. గుజతీ కాగితం పైన అచ్చు వేస్తే, సిరా వెనక్కు ఇంకేది, అచ్చు కూడావెనక్కు కనపడేది. అప్పట్లో వచ్చిన పత్రికలు, రెండు పక్కలా అచ్చుపడి, తికమక కల్పించేవి. తికమకయినా, పఠనం, పరిశోధన పెరిగినయ్యి. తాళపత్రగ్రంథాలు ఎక్కడెక్కడ ఉన్నవో, అక్కడికి పండితులు పరుగెత్తారు. విశాఖపట్నంలో పరవస్తువారి ఇంట బోలెడు గ్రంధాలుండేవట. చెన్నపురిలో గాజుల లక్ష్మీనరసింహచెట్టి గారింట అనేక గ్రంథాలు --

కొత్త పుస్తకాల అచ్చు ప్రారంభమయింది. అచ్చులో విరామాలను ప్రవేశపెట్టాడు చార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

ఏ ఆశతో మన పండితులు పరిశోధనకు ఉపక్రమించారో వినాల్సిందే. మన అచ్చు కూర్పరులు ఎంత శ్రద్ధతో అచ్చు కూర్చటానికి ఉపక్రమించారో తెలుసుకోవలసిందే. అచ్చును సరిదిద్దటానికి పండితులు ఎంతగా శ్రద్ధచూపారో! ఆనాటి పుస్తకాలలో అచ్చు తప్పులు ఉండేవికావు! అచ్చుకూర్పరులు పలువురు, చేనేత వాళ్లు. వృత్తులు పోయి అచ్చు కూర్పరులయ్యారు. రాగ వరసన పద్యాలు, వచనాలు, పాటలు చదివి, రాగవరసకు ఒదిగేటట్లు అక్షరాలు కూర్చేవాళ్లు.

యంత్రం, సిరా, కాగితం మెరుగైన కొలదీ అచ్చు బాగైంది. ఈలోగా, మోనోటైప్ అనే యాంత్రిక కూర్పు పద్ధతి వచ్చింది. చీమల పుట్టపైన పందికూర్చుని పోయినట్లు, అక్షరాలు కనిపించీ కనిపించకుండా అచ్చునపడేవి. ఆపైన లైనోటైపు ప్రారంభించాలంటే, అది సానుకూలం కాలేదు. ఈలోగా కంప్యూటర్‌వచ్చింది. మరపురా కూడని విశేషం ఏమంటే, వణుకూరి నారాయణరావు అనే ఐ.ఏ.యస్. అధికారి, శివరావు అనే అచ్చు పని నిపుణుడు, నరసింహం

అనే కంప్యూటర్ విజ్ఞాని తెలుగు అక్షరాలను అందంగా కూర్చి, కంప్యూటర్లకు ఎక్కించాలని ఎంతో కృషి చేశారు.

కాకతీయులకు పూర్వం బ్రాహ్మి, కన్నడ లిపులు కలిసి తెలుగు లిపిగా ఉండేవి. కాకతీయుల కాలంలో మన సుందర లిపి రూపొందింది. మనకు ఏవో ఒక ఐదారు శబ్దాలు తప్ప, అన్ని శబ్దాలూ పలకగల అక్షరాలుండేవి. కానీ, మనవాళ్లు రానురాను కొన్ని అక్షరాలు వదిలేసుకుంటున్నారు. భాషను ఆధునికం చేయాలనే ఆసక్తితో, ఇంగ్లీషు శబ్దాలను తెగ జొప్పిస్తున్నారు. తెలుగుకు ఆధునికత లేకుండా పోయింది. దానినే వ్యవహారిక భాష అని కూడా అంటున్నారు. పండితులకి ఒక బాధ్యత ఉండాలనే భావం మృగ్యమైపోయింది.

కంప్యూటర్ ద్వారా వెలువడే అచ్చుకూర్పులో ఈ లోపాలే వస్తున్నయ్యి. అదే అచ్చు తప్పుల యుగంగా మారిపోయింది. ఈ మార్పులతో పుస్తకాలు అచ్చు అవుతున్నయ్యి. ఈ పుస్తకాలలో, కథలు వగైరాలు తప్ప ఉదాత్త గ్రంథాలు ఎవ్వరూ చదవడం లేదని, పలువురు గ్రంథాలయోద్యోగులు అనడం ఎరిగిన విశేషమే. దీనికి తోడు, గ్రంథాలయోద్యోగులు అంటే, గ్రంథపఠనానికి తోడ్పాటు ఇచ్చేవాళ్లు కాకుండాపోతున్నారు. పుస్తకాలను వరసలో పెట్టటం, వాటినే రచయితల పేర్ల వారీగా ఆకారాదిక్రమంలోచూపగలగటం, పుస్తకాలు తీసుకెళ్లే వాళ్ల పేర్లు వగైరాలు వ్రాయటం, వాళ్లు ఇచ్చినప్పుడు వ్రాసుకొనటం, చందాదారుల లెక్క వ్రాయడం, జీతాలు భత్యాలు పుచ్చుకోవడం -- ఇంతే గ్రంథాలయోద్యోగుల విధుల జాబితా. గ్రంథాలయాలలో తమకు ఇష్టమైన గ్రంథాలను కొని ఇచ్చే అధికారాలు గొప్పలైనయ్యి.

## సినిమా తల్లిదండ్రులు

గ్రంథాలయోద్యోగి విద్యాలయాలలో పాఠం చెప్పేవాడి వంటి వాడే అని అధికారులు మరిచేపోయారు. అందరూ మరిచారు. ఏ ఇంటివారికీ, తమ సంతానం పుస్తకాలు చదవాలని చెప్పే సంస్కారం లేదని, మన దేశంలో పెద్దలు తమ సంతానానికి సినిమా చూడటానికి డబ్బు ఇస్తారుకానీ, పఠనీయ గ్రంథం కొనుక్కోమని డబ్బులు ఇస్తారంటారా?!

గ్రంథాలయాలు నెలకొల్పాలని ఉద్యమమే నడిపారు మన పెద్దలు. దేశ భక్తులు త్యాగాలు చేసి సంపాదించిన స్వాతంత్ర్యాన్ని ఎంతబాగా మనం నిర్వహిస్తున్నామో, గ్రంథాలయాలు కూడా అట్లాగే నిర్వహిస్తున్నాం. ఎవళ్లకో మేలు చేయాలని, ఎవ్వరివో పుస్తకాలు కొని, పేర్చినంతమాత్రాన అవి గ్రంథాలయాలు కావు. ప్రతి గ్రంథాన్ని ఒక జీవిగా భావించి, ఆ జీవి కథ చెప్పగలిగే ఉద్యోగులను నియమించి, పఠితలకు తోడ్పడేటట్లు చేయగలమా? పుస్తక పరిశ్రమ దేనికి వృద్ధి అయిన దంటారు?

## 3.4 పుస్తకం మస్తక భూషణం

- ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద

ఔను! నిజంగా గ్రంథం విలువ తెలిసిన వాడికి పుస్తకం మస్తక భూషణమని తప్పకుండా తెలుస్తుంది. తెలియని వాడికి అది 'హస్త భూషణం' మాత్రమే.

ఎవరో ఒకాయన దారిలో వెళ్తున్నాడట. ఆయన బాగా సంస్కృతం చదువుకున్నవాడు. ఎదురుగా మరొకాయన బాగా మడిబట్టలో చుట్టి, నెత్తిన పెట్టుకొని ఒక గ్రంథాన్ని మోసుకుని వస్తుండగా చూసి ఇలా అడిగాడు.

'అయ్యా ఏం గ్రంథమది?'

'సుందరాఃకాండ' అని అన్నాడు ఆ వస్తున్న మనిషి. విసర్గ వాడితే పండితుడని గౌరవిస్తారని కాబోలు ఆయన ఆలోచన. మరో ఆయనకు అర్థమై పోయింది - ఇతనికి ఏమీ తెలీదని. అడిగాడట -

'ఏవూరునాయనా మనది!' అని

'కదిరాశ్చెరువు' అన్నాడట.

ఈ రెండో సారి కూడా విసర్గ వినేటప్పటికి ఆయనకి ఒళ్ళు మండి 'ఒరే పిచ్చిఃపప్పా! ఇంత సంస్కృతం ఏ ఊఃళ్ళో నేర్చుకున్నావూః?' అన్నాడట (పిచ్చి తరువాత, కున్నావూ తరువాత విసర్గలు లేవు - హాస్యానికి ఉంచాడని మీకు తెలిసే ఉండాలి)

ఎప్పుడో మా తండ్రి గారు పాతికేళ్ళకు ముందు హరికథల్లో చెబుతూ ఉండిన పిట్టకథ ఇది. మన దేశంలో గ్రంథాల్ని చాలా గౌరవంగా పూజిస్తారు కాని చదవరు. మరి ఒకరికి ఇవ్వరు. ఒక సమయం ఎవరికైనా ఇచ్చామనుకోండి వాళ్ళు మళ్ళీ తిరిగివ్వరు. అంచేతే చదువంతా అటకలకెక్కించి మనవాళ్ళు చేతులు దులుపుకున్నారు. అలా గ్రంథపఠనం మృగ్యమౌతున్న రోజుల్లో తాటాకు గ్రంథాల స్థానంలో అచ్చు పుస్తకాలు వచ్చాయి. రానురాను పుస్తక భాండాగారం విశ్వవ్యాప్తమై పోయింది. ఈవాళ వేదం మొదలు మార్క్సిజం దాకా; చెడుగుడు మొదలు కంప్యూటర్ దాకా ప్రతిదీ గ్రంథరూపంలో వచ్చేస్తోంది. కొన్ని వేల గ్రంథాలు అచ్చవుతున్నాయి.

కానీ చిత్రంగా 'గ్రంథం' మీద మనిషి చాలా తక్కువ చూపును ప్రదర్శిస్తున్నాడు. మన భాగ్యనగరంలో గ్రంథావిష్కరణకు ఎంతమంది విచ్చేస్తున్నారో చూడండి. రచయిత, సమీక్షకుడు, వారి వీరి మిత్రులు. ఒక ఆస్థాన ఆవిష్కర్త. ఒక పీరికాకర్త - వెరసి అంతా పట్టుమని పాతిక మంది తేలటంలేదు.

ఇక గ్రంథం కొనడం విషయం - కాంప్లిమెంటరీ కాపీలు ఇస్తే సంతోషంగా పుచ్చుకుపోయే వారే తప్ప బ్రహ్మాండం బద్దలు చేసే గ్రంథమయినా సరే కొనుగోలుదార్లు పలచబడి పోతున్నారు. ఈ నేపథ్యంలో నుంచి ఆలోచిస్తుండగా ఎందుకో 'పుస్తకం మస్తక భూషణ' మనే శీర్షిక నాకు తట్టింది.

గ్రంథాలయాల్లో తమ జీవితాన్నంతా నడపిన పూజ్యశ్రీ పాండురంగారెడ్డి గారి వంటివారికి తెలుసు - గ్రంథం ఎంత శ్రమ నుండి పుడుతుందో! ఒక రచయిత ఎన్ని రాత్రులు, పగళ్ళూ తిండీ నిద్రలు మాని, ఎన్ని గ్రంథాలు శోధించి, ఎంత ఆలోచించి, ఒక పథకం సిద్ధం చేసుకొని ఒక గ్రంధాన్ని రచిస్తారో మనం నిర్ణయించటం చాలా కష్టం.

నేను పరిశోధన స్థాయి ఉన్న గ్రంథాల్ని మాత్రమే చెప్పటం లేదు. అది నవలయినా, కవితో, కథానికో అయినా - శ్రమ మాత్రం తక్కువైంది ఏమాత్రం కాదు. పది పరిశోధనలు తీసుకురాలేని మార్పును తెచ్చిన కవితలులేవా! కవితల్లో చెప్పని సమస్యలు చర్చించిన కథలు లేవా! అసలు గ్రంథానికి వెలకట్టగలమా అని!

'జీర్ణమంగే సుభాషితం' అని ఒక మాట ఉంది. ఎంతో చెప్పాలని ఉంది. చెబితే వినేవాడు ఉండాలిగా! విన ఆచరించే వాడుండాలిగా! అంచేత నాలోని సుభాషితం నాలోనే జీర్ణమై పోయింది - అని తాత్పర్యం. సరిగ్గా ఈవాళ గ్రంథాల పరిస్థితి కూడా అలాగే అయిపోయింది. మా చిన్న తనంలో ఒక గ్రంథం దొరికితే దాన్ని మూల ముట్టుగా చదివి మా మాష్టార్లతో చర్చించి దానిపై ఒక చిన్న నోట్సు రాసుకుని ఉంచుకొనే వాళ్ళం - ఆనోట్సు ఎలారాయాలో ఆరోజుల్లో అమెరికా నుంచి దిగివచ్చిన చేకూరి రామారావు గారి దగ్గర నేర్చుకున్నాం.

ఆ తరువాత రెండు దశాబ్దాలు గడిచాయి - ఈవాళ గ్రంథాలయంలో పుస్తకాలు రండి! రండి! అని పిలుస్తున్నా వెళ్ళి చదువుకొనే విద్యార్థి కనిపించటంలేదు. ఒకరో ఇద్దరో వెళ్ళినా నింపాదిగా చదివినోట్సు రాసుకునేవారు అసలు కనిపించటంలేదు -

మరో విషయం - ఈ టైపు, కంప్యూటర్లు రాకముందు గ్రంధాన్ని మొత్తం పండితులు ఎంతో ఓపిగ్గా ముత్యాల్లాంటి అక్షరాలలో రాసుకునేవారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మొదలు ఉదయశిరి శ్రీనివాసాచార్యులు దాకా అలా రాసి ఉంచుకొన్న వారున్నారు. అలా రాసుకోవటం వల్ల గ్రంథం మొత్తం కంఠోపాఠమయ్యేది.

ఈవాళ జిరాక్స్ తీసి ఉంచుకొని - చాలా మంది మళ్ళీ చదవడానికి కూడా 'ఓపిక' లేని వాళ్ళవుతున్నారు. ఎవరో మరీ అవసరమున్న వాళ్ళు తప్పని సరై చదువుతారు - అది వేరే విషయం. ఆ గ్రంథంలో ఏముంది! అని అడిగితే - మళ్ళీ గ్రంధాన్ని చూపిస్తారే తప్పా - పదినిమిషాలు పాటు ఆ గ్రంధం గురించి చెప్పే వాళ్ళు పి.హెచ్.డి. వైవాలలోనే కనిపించటం

లేదు - ఇంక తక్కిన పాఠకుల్ని గురించి ఏమనగలం! అంచేత చదువంతా ఈనాడు మళ్ళీ పుస్తకాల్లోనే దాగిపోయింది. తలల్లో లేదు.

మాతరం వాళ్ళు చదువుకున్నవే చాలా తక్కువ. మాముందటి తరంలో బాగా చదువుతూ ఉండిన వారిని చూశాను. అలాంటివారిలో ఒకరు కీర్తి శేషులు జి.యన్. రెడ్డిగారు. వారు నిఘంటువుల్నీ అధ్యయనం చేసేవారు. మరొకరు భద్రిరాజు కృష్ణమూర్తి గారు - వారు తెలుగును గురించి ఆంగ్లంలో వచ్చిన సాహిత్యాన్ని - భారతీయ భాషల మీద వచ్చిన పరిశోధనను భాషా శాస్త్ర గ్రంధాలను అక్షరాక్షరం చదివేవారు. మరొకరు చేకూరి రామారావు గారు - వారు గద్దర్ పాటల మొదలు డాంగేగారి "భారతదేశం - ఆర్యులు" దాకా అన్ని గ్రంధాల్ని మధించేవారు - వీరందరూ ఒకెత్తు - తుమ్మపూడి కోటీశ్వరరావుగారు మరొక ఎత్తు - ఆయన రిచర్డ్స్‌ని, కె.సి. పాండేని, నోల్‌ని, అభినవగుప్తుణ్ణి - డాల్గోవ్‌ని, జిస్‌ని, మయకోవ్స్కీని - ప్రపంచంలోని రచయితలందర్నీ చదివేవారు - ఈనాడు పాఠాలు చెబుతున్న మేమంతా చాలా వరకు చదవటం - తగ్గించేశాం. పుస్తకాల్లో ఏంలేదని గుర్తించామా! పుస్తకాల్లో ఉన్న విషయాల మీద నమ్మకం పోయిందా! ఏమిటీ పుస్తకాల మీద అకారణవైరమన్నది అంతుచిక్కని ప్రశ్న.

ఇక కళాశాలల్లో 'పుస్తకం' అంటే Textbook (పాఠ్య గ్రంథం) లేదా 'గైడు' అనే అర్థం తప్పా మరోటి కనిపించటంలేదు. విద్యార్థులకి పాఠం అంటే 'నోట్సు' అనే అర్థం వచ్చేసినట్టు - టీచర్లకి కూడా 'గ్రంథం' అంటే పాఠ్య గ్రంథమే అయిపోయింది. ఈ దుర్దశను ఈ మధ్య పదిఏళ్ళ నుంచీ బాగా గమనిస్తూ వచ్చాకే ఈ అంశాన్ని గురించి రాయాలనిపించింది.

పరిశోధన స్థాయి పడిపోవటానికి మాత్రమే కాకుండా మంచి నుడికారంతో కూడిన భాషను రాయలేకపోవటానికి కూడా గ్రంథ పఠనాభిలాష తగ్గిపోవటం ఒక పెద్ద కారణం. ఒక పెద్ద అణుశాస్త్ర వేత్తను ఈ మధ్య కలిశాను - ఆయన ఒక చిత్రమైన విషయం చెప్పారు - ఆయన వద్దకి ఎవరైనా పరిశోధన చెయ్యాలని వెళ్తే 'కంబర్' రాసిన రామాయణం చదివావా! అవి బాగా చదవుకొని నా దగ్గరికిరా! - అంటారట ఆయన. దీని అర్థం ఏమిటి?

గ్రంథం చదవటమంటే అందులో ఉన్న విషయాలన్నింటిని గ్రహించేస్తామని అర్థం కాదు. ఒకో గ్రంథం వల్ల ఒకోలాభం ఉంటుంది. ఆ లాభం కోసం ఆ గ్రంధం చదవాలి. అలా ఎన్నో గ్రంథాలు చదివితేనే సమర్థవంతంగా భాషను వాడటం వస్తుంది. ఆ భాష ద్వారా మనిషి ఆలోచనలో స్పష్టమైన ధోరణి. అభివ్యక్తిలో స్పష్టత వస్తాయి. అందుకే మంచి పాత్రికేయుడుగా స్థిరపడాలంటే మంచి వచనం రాయటం రావాలి. అంటే రావిశాస్త్రినో, కొడవటిగంటినో, చలాన్నో, చదవకుండామంచి వచనం రాయటమంటే ఏమిటో కూడా తెలీదు. అందుకు చదవాల్సిన అవసరం ఉంటుంది. అంటే ఆ విజ్ఞాన శాస్త్రవేత్త కంబరామాయణాన్ని ఎందుకు

చదివిరమ్మని ఉంటారు? మంచి పలుకుబడితో కూడిన అభివ్యక్తిని నేర్చుకోవటం కోసం విజ్ఞాన విషయాన్నైనా చెప్పాల్సిన పద్ధతి ఒకటి ఉందిగా! అది వాడుక కావాలంటే మంచి భాష తెలియాలి. అందుకోసం చదవాల్సినవి కేవలం శాస్త్రాలే కావు కళల్నీ చదవాలి.

ఈ మధ్య సర్దేశాయి తిరుమలరావుగారి ద్వితీయ స్మారకోపన్యాసం ఇస్తున్న సందర్భంలో వారిలో విజ్ఞానం - కళ - అన్న విభాగాలు రెండూ కలిసి పోయాయని ప్రతిపాదించి వారి గ్రంధాలయాన్ని గురించి కొంత వివరించాను. వారు ఆజన్మ బ్రహ్మచారి. కొన్ని వేలగ్రంథాలను కాని భద్రపరిచారు. రోజులో కనీసం 18 గంటలు చదివిన వారాయన. నడుముకు శక్తి సన్నగిల్లాక పడుకొని చదువుతూ ఉండేవారు - 1940 లో చిలుకూరి నారాయణరావుగారు అలాగే చదివేవారని తిరుమలరావు గారే చెప్పారు కూడా. ఇంతకీ తిరుమల రావుగారు అన్ని వేలగ్రంథాలు చదివి ఏం సాధించారు? అని నేనూ అనుకొనేవాడిని.

ఈ మధ్య తెలిసింది. వారు Labyrinth of Science అనే పేరుతో ఒక అత్యద్భుతమైన గ్రంథం రచించారని - ఆ గ్రంధంలో విజ్ఞానానికి, కళకు, మతానికి, సమాజానికి, సాహిత్యానికీ, వేదాంతానికి ఉన్న సంబంధాన్ని గురించి చర్చించారని. ఆ గ్రంధాన్ని చదివితే అర్థమయింది. విజ్ఞానానికి, కళకు అంతస్తత్త్వంలో ఏమీ తేడా లేదని - ఇదంతా వారు ఎలా గుర్తించారు? - నిరంతర గ్రంధ పఠనం వల్ల మాత్రమే. అన్ని గ్రంథాలు చదివినా ఆయన 'పుస్తకాల పురుగు' గా ఉండిపోలేదు. సమాజ చైతన్యానికి దూరంకాలేదు. ఏం గ్రంథాన్ని చదవాలో, ఎలా చదవాలో తెలిసి చదివారాయన. అలా చదవటం వల్ల ప్రతి గ్రంధమూ ఆయన మస్తిష్కంలో ఒకకొత్త వెలుగు నింపింది. ఒక కొత్త దారి చూపించింది. సమాజంలో వచ్చిన ప్రతి మార్పునీ దర్పణంలోలాగా ఆయనకు చూపెట్టింది.

మార్క్సులాంటి మేధావి, వివేకానందుడి వంటి సంస్కృతీ ప్రచారకుడు, అరవిందుడి వంటి దార్శనికుడు, మహాత్మవంటి రాజనీతిజ్ఞుడు - వీరందరూ దశాబ్దాల పాటు గ్రంథపఠనం చేసినవారే. అందుకే వారు అత్యద్భుతమైన రచనలు చేయగలిగారు. ఉపన్యసించగలిగారు. సమాజానికి ఒక కొత్త ఊపిరి ఊది సమాజగతిని మార్చగలిగారు.

అంతేకాదు - ఇది తులనాత్మక యుగం. ఈ యుగంలో ఒక భాషలోని సాహిత్యాన్ని, ఒక రంగంలోని విజ్ఞానాన్ని మూఢంగా విశ్వసించి - బావిలోని కప్పలాగా ఉండిపోతే లాభం లేదు. విశ్వజనీన స్థాయిలో విజ్ఞాన వీచికలు వీస్తున్న ఈ రోజుల్లో గ్రంథపఠనం అనివార్య ప్రక్రియ. అంచేత పాఠకుడు గ్రంథాన్ని తన మస్తక భూషణంగానే భావించాలి.

యువకుల్లో పత్రికల్ని చదవటమైనా ఒక హాబీగా ఉన్నరోజులు కూడా పోతున్న రోజులివి. 'విజువల్ మీడియా' (దృశ్య ప్రసార సాధనాలు) ప్రబలి ఈనాడు అన్నీ టి.విల ద్వారా

(విడియోలద్వారా) చూసేస్తున్నారు. అంత తొందరగానే మరిచి పోతున్నారు కూడా. గ్రంథ పఠనం మీద ఆసక్తి పోవటానికి ఇదీ కొంత కారణం అవుతోంది.

శ్రీ పాండురంగారెడ్డి గారి 'అభినందన సంచిక' అనగానే నాకు గ్రంథపఠనమే గుర్తుకు రావటానికి కారణం ఇదంతా - ఎందుకంటే ఆయన జీవితమంతా పుస్తకాల కట్టల్లో మునిగి తేలినవారు. గొప్ప 'గ్రంథ సాంగులు' (రసికుడని అర్థం చేసుకోకండి - గ్రంథాలనే అవయవాలన్నిటా నింపుకొన్న వారని అర్థం) - రచయిత పడే కష్టం తెలిసినవారు. గ్రంథం విలువ ఎరిగిన వారు. మీదుమిక్కిలి రచయితల అంతర్బాహ్య జగత్తులు రెండూ తెలిసినవారు. అందుకే ఈ వ్యాసం వారికి అంకితం చేస్తున్నాను.

చివరగా ఒక సలహా. గ్రంథాలయ శాఖ వారు ప్రభుత్వం వారు సృజనాత్మక వైజ్ఞానిక సాహిత్యాన్ని పాఠశాల దశనుంచి తరగతుల వారీగా వర్గీకరించి ప్రకటింప చేసి - గ్రంధాలయాల్ని బాలల కోసం పెంపొందిస్తే ఈ పరిస్థితిలో మార్పువస్తుంది. ఎన్ని మీడియాలు వచ్చినా గ్రంథం విలువ గ్రంథానిదే. దాని ప్రభావం ఏనాటికీ చెక్కు చెదరదు. అందుకే అది మనోభూషణం. శిరో (మస్తక) భూషణంకూడా.

# 3.5 పుస్తక పఠనం - వ్యక్తిత్వం

**- డా॥ కసిరెడ్డి**

## ప్రవేశం

పుస్తకంలోనిది మస్తకంలోకి ఎక్కాలి అనేమాట వింటుంటాం. మస్తకంలోకి ఎక్కడం అంటే అర్థం కావడం మాత్రమే కాదు; ఆచరించడం కూడా. అందుకే పుస్తకంలోనిది పుస్తకంలోనే ఉంటే సార్థకం కాదని గ్రహించాలి. అయినా ప్రపంచంలోని భావాలు, దార్శనికుని సిద్ధాంతాలు అక్షరరూపం ధరించి గ్రంథంగా అవతరించాలి. ఆగ్రంథం ఒక వ్యక్తి వద్దగాని, ఒక పుస్తకాలయంలోగాని ఉండాలి. పలానా విషయం మీద, పలాన గ్రంథం వచ్చిందన్న సంగతి పది మందికి తెలియాలి. ఆ పదిమందిగాని, అందులో కొందరుగాని - ఒకరుగాని ఆ గ్రంథాన్ని అధ్యయనం చేయాలి. కేవలాధ్యయనమేకాదు అర్థం చేసుకొని ఆచరించాలనే స్థిరనిర్ణయం తీసుకోవాలి. అప్పుడే పుస్తకం మస్తకంలోకి ఎక్కాలి అన్నమాట అర్థవంతమవుతుంది.

పుస్తకాన్ని గురించి ఎందరో ఎన్నో విధాలుగా వ్రాశారు. శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు ఇలా అంటారు.

"మదికుదురు జేసి చల్లని మాట చెప్పి
కలకల నెడలించి ధైర్యంబు కలుగజేసి
తల్లి దండ్రులను బోలి పెద్దలనుబోలి
సదుపదేశంబు చేయు పుస్తకమె నీకు''

గ్రంథం మనస్సును స్థిరపరస్తుంది. చల్లని మాటలు చెబుతుంది. సందేహాలను తొలగిస్తుంది. ధైర్యం కలుగ జేస్తుంది. తల్లి దండ్రుల్లాగా పెద్దల్లాగా సదుపదేశం చేస్తుంది. పుస్తకం ఇంతగా ఉపకరిస్తుంది.

మనిషి అనేక ఆలోచనలతో సతమతమవుతున్నప్పుడు మనస్సును కుదుటపరచే పరికరంగా పుస్తకం ఉపకరిస్తే అంతకంటే కావల్సిందేముంది. బి.పీలు పెరిగి, మానసిక ప్రశాంతత తగ్గిపోయి, జీవితం సంచలనాత్మకమైతే నిర్ణీత సమయంలో నిర్ణీత గమ్యానికి చేరడం కష్టం. అందుకే పుస్తకజ్ఞానం వల్ల సందేహాలు తొలగడం, మనస్సు చల్లబడడం, ధైర్యం కలగడం జీవితం పరమ ప్రశాంతంగా గడవడం ఇవన్నీ లాభాలే. మానవ మనుగడలో శాంతి

సౌఖ్యసౌభాగ్యాల్ని అందించే అంశాలే. ఇంత పరమ ప్రయోజనం గ్రంథాలవల్ల కలుగుతుందంటే ఆ గ్రంథాలన్నీ ఒక దగ్గర చేర్చాలని ఎవరికైనా అనిపిస్తుంది కదా! అలా అనిపించడం వల్లనే గ్రంధభాండాగారాలేర్పడ్డాయి. అవే ఈనాటి గ్రంథాలయాలు.

## ప్రథమ గ్రంథచోరుడు సోమకుడే!

ఇలా గ్రంథాలయాల్లో భద్రపరచిన గ్రంథాల్ని అపహరించాలని కొందరికి దుర్బుద్ధి పుడుతుంది. అలాగా మొట్టమొదట దుర్బుద్ధి పుట్టింది సోమకునికి. వాడికి వేదగ్రంథాల విజ్ఞానం విస్తరించడం ఇష్టం లేదు. అందుకే వాటిని దొంగిలించాడు. సముద్రంలో దాచిపెట్టాడు. అగ్ని, జల మృత్తికలన్నీ అక్షరాల్ని నాశనంచేసేవే. వాయువు కూడా తీవ్రంగా వీస్తే అక్షరాలు చెదరిపోతాయి. చెరగిపోతాయి. అలా నీటి వల్ల వేదాలు కనిపించకుండా పోవాలనే సోమకుడు ఆశించాడు.

అంత విజ్ఞానం అలా నాశనం కావడం మత్స్యమూర్తికి ఇష్టం లేదు. అందువల్లనే సోమకుని మీద దాడి జరిపాడు. యుద్ధం చేశాడు. గ్రంథచోరుడైన సోమకుణ్ణి సంహరించి వేదాలు తెచ్చి లోకానికందించాడు. ప్రపంచంలోనే ప్రప్రథమ గ్రంథచోరునికి ఆ విధంగా మరణశిక్ష పడింది. తరతరాల జీవకోటికి విజ్ఞానాన్ని అందించే గ్రంథం నాశనానికి పాటుబడాలనుకొనేవాడు జీవకోటి నాశకుడన్నమాట. అందుకే సోమకునికి పడ్డ శిక్ష సమంజసమైందే.

## మంచి గ్రంథాలు - చెడ్డ గ్రంథాలు

అయితే అన్ని గ్రంథాలు మంచివే అనలేం. కొందరు కుకవులుంటారు. వారు మంచి గ్రంథాలు వ్రాయలేరు. సుకవులు మాత్రమే మంచి గ్రంధాలు వ్రాస్తారు. అందుకే మడికి సింగన ఈ పద్యం సంకలితంచేశారు.

"సుకవులు చెప్పిన కవితా
నికరములు శిలాక్షరముల నిలుకడగాంచున్
కుకవులు చెప్పిన కవితా
నికరములు జలాక్షరములు నీచతననగున్"

ఉత్తమకవులు చెప్పిన కవిత్వం శిలాక్షరాల వలె స్థిరంగా ఉంటుంది. అల్పకవుల కవిత్వం జలాక్షరాల లాగా నశించిపోతుంది. గ్రంథాల విషయం కూడా ఇంతే. ఉత్తమ గ్రంధాలు కల కాలం నిలిచి ఉంటాయి. పనికి మాలిన గ్రంథాలు పాడైపోతాయి.

## పఠిత ఏది చదువుతాడు - ఏమవుతాడు!

లోకంలో ఎందరు మనుషులున్నారో అందరికి అన్ని మనసులున్నాయి. ఒక్కొక్కరికి వందల - వేల మనసులున్నాయి. ఈ మనస్సులో పుట్టేవి భావతరంగాలు. ఒక్కొక్క తరంగం ఒక్కొక్క మనస్సు అన్నట్టుగా స్థిరపడతాయి. అన్నిటిని మించి ఒక తరంగం గట్టిపడ్డప్పుడు అది మిగతా అన్నిటిని తొక్కుతుంది. తానే ఆధిపత్యం వహించి - ఇక నేను తప్ప ఎవరూ లేరు అంటుంది. అలాంటి మనస్సునూ, స్థిరపడ్డ శిష్ట - దుష్ట భావ తరంగాన్ని కూడా కదిలించే శక్తి గ్రంథానికుంటుంది. అంటే గ్రంథంలోని భావ జాలానికుంటుందని గ్రహించాలి.

అందుకే ఈ గ్రంధాలు మంచివనీ, ఇవి చెడ్డవనీ, ఇవి వక్రభాష్యం చేస్తున్నాయని ప్రచారం జరుగుతుంది. లోకంలో నిహిత స్వార్థాలున్న కొదరు కొన్ని గ్రంథాలు మంచివని, మరికొన్ని గ్రంథాలు చెడ్డవనీ ప్రచారం చేస్తారు. కాని వ్యక్తి ప్రయోజనాన్ని, సమాజ వికాసాన్ని ఆశించే వారు, మానవుడు దివ్య మానవుడుగా తీర్చి దిద్దబడాలని కోరుకొనేవారు మంచిని మంచిగానే, చెడును చెడుగానే చెబుతారు.

అందుకే స్వామి వివేకానందుల వారంటారు. "ఈ ప్రపంచంలో ఏది చల్లితే అదే భూమ్మీద పండుతుంది. కారణాన్ని బట్టి కార్యం జరుగుతుంటుంది. మనం చెడ్డగా ఆలోచించి పనులు చేస్తే పనులు చెడ్డగానే జరుగుతాయి, ఫలితం చెడుగానే వస్తుంది. మనం మంచిగా ఆలోచించి పనులు చేస్తే పనులు మంచిగానే జరుగుతాయి. ఫలితం మంచిగానే ఉంటుంది."

వేదం "మనుర్భవ" అంటుంది, అంటే మనిషి కమ్ము అని అర్థం. మనిషికాక మనిషి ఇంకేమన్నా అవుతున్నాడా అంటే అవును మనిషిమృగం అవుతున్నాడని, రాక్షసుడవుతున్నాడని చెప్పాల్సి వస్తుంది. మనిషి మనిషికావాలి; మనిషేకాదు దివ్య మానవుడు (సూపర్ మ్యాన్) కావాలంటాడు అరవిందయోగి. ఈ దివ్య మానవుని నుండి కూడా దివ్యుడై పోవాలి. దివ్య మంటే కాంతి. దివి అంటే కాంతి ఉన్నది. భౌమ్యుడు (భువిలోనివాడు) అయిన మానవుడు దివ్యుడు (దివిలోనివాడు) కావాలన్నమాట.

భువిచుట్టూ వాసనలుంటాయి. ఈ వాసనలు మనిషిని పట్టి పీడిస్తాయి. వీటినుండి మనిషి బయట పడాలి. దీనినే ముక్తి అన్నారు పెద్దలు "బంధాలు విడివడడమే ముక్తి అప్పా" అన్నారు శ్రీ రమణులు. బంధాలనుండి విడివడే (సాధనచేస్తే) మార్గం చూపించేది మంచి గ్రంథమే. అందుకే ఏ గ్రంథం చదవాలి; ఏ గ్రంథం చదవకూడదని నిర్ణయించుకోవాల్సింది మనిషే అని గ్రహించాలి.

## విభిన్న గ్రంథాలు - విభిన్న మనస్తత్వాలు - వాదాలు

అయితే లోకంలోనికి వచ్చిన ఈ గ్రంథాలన్నీ మనిషిని దివ్యునిగా తీర్చిదిద్దలేదు. వేటి పోకడ వాటిది. ఏవి తింటే శరీరం ఏ విధంగా తయారవుతుందో వేరే చెప్పాల్సిన అవసరం లేదు కదా!

పాచిపోయినవి, పులిసినవి, మత్తుకలిగించేవి తింటే మనిషి తామసి అవుతాడు. బాగా కారం, ఉప్పు, పులుపు ఉన్నవీ, మాంసం తదితరాలు తీసుకొంటే రాకాసి అవుతాడు. కమ్మనివి, తియ్యనివి తీసుకొంటే సాత్త్వికుడవుతాడు. ఈ గ్రంథాలు వివిధ వాదాల్ని ప్రతిపాదిస్తాయి. అలా వివిధ వాదాల్ని ప్రతిపాదించే గ్రంథాలు ఏవిధంగా లోకంలోకి వచ్చి, ఏయే వాదాల్ని అనుసరించే వాళ్లను ఏ విధంగా తయారు చేస్తాయో చూద్దాం.

## ఆదర్శ వాదం

కొన్ని గ్రంథాలు మనిషిని ఆదర్శవాదిగా తీర్చిదిద్దుతాయి. ఆ ఆదర్శవాదం ఈ విధంగా ఉంటుందని అనుకొంటాడు అతను.

"నేను పొద్దున్నే లేస్తున్నాను. ఉదయం ఇంటిలో పనేదో చేసుకొంటున్నాను. నా వృత్తి పనికి నేను వెడుతున్నాను. లేదా వ్యాపారానికి, ఉద్యోగానికి, కూలీనాలీకి ఏదో ఒక పనికి; సాయంకాలం వస్తున్నాను. ఇంత తింటున్నాను. నిద్దరోతున్నాను. నా ఇంటి పని, నా వృత్తిపని .... నేను ఆదర్శ వాదినే" - అంటాడు అతను.

ఇంతకు మించినలోకం ఇతనికుండదు. తన సమాజంలోని వికారాల్ని గాని, దురాచారాల్ని గాని దూరంచేసే ప్రయత్నం ఇతడు చేయడు. దేశంలోకి చొరబాటుదారులు వస్తున్నా పట్టించుకోడు. సరిహద్దుల్లో దురాక్రమణ దారుల దుర్మార్గాలు ఎదుర్కోలేడు. "తన దుకాణ్ - తన మకాన్" అంతకన్నా ఆలోచించడు. ఓ పరిధిలో బ్రతికే ఈ బ్రతుకు తనకొరకు కాక మరొకరికొరకు అంతగా ఉపకరించదు.

అతనిట్లా జీవితాన్ని బిగించుకోడానికి కొన్ని సంఘటనలు దోహదం చేసి ఉంటాయి; కొన్ని గ్రంథాలు మార్గం చూపి ఉంటాయి.

## అర్థవాదం

మరొక తరహా మనుషులుంటారు. వీరు అర్థ పరచితులు. "ధనమూలమిదం జగత్" అన్న సూక్తినే నమ్ముకొన్న వారు. అంతకుమించి మరోటి ఆలోచించరు. వాళ్ల ఇంటికి మనం పోతే ఏం తెచ్చావని చూస్తారు. మన ఇంటికి వాళ్లొస్తే ఏమిస్తారని చూస్తారు.

పని చేస్తే ధనం, తింటే ధనం, పంతే ధనం. అంతా ధనం ధనం ధనం. ధనం తప్ప మరోలోకం లేదు వీరికి. దీంతో మహా పిసినిగొట్టులై పోతారు. పిల్లికి పిడికెడు బిచ్చం వెయ్యని వాళ్లవుతారు. కాకిని కూడా చేతితో విదలించని వాళ్లవుతారు. తలె కడిగికూడా బయట చల్లకుండా తామె తాగే వాళ్లవుతారు.

"సొంతలాభం కొంత మానుకు పొరుగు వాడికి తోడుపడవోయ్" అని కవి గురజాడ అంటే - "సొంతలాభం మానుకొనుటకు అంతరంగము లొప్పుకోవోయ్" అంటారు.

ఇలా అర్థపరచిత్తుడై సామాజిక సంబంధాలన్నిటిని అర్థంతోనే తూచే విధంగా మనిషెందుకు తయారయ్యాడు. ఏ గ్రంధాలు చదవడం వల్ల ఇలా అయ్యాడు. అంతకు తన ముందున్న వారి ప్రవర్తన, తనతో పాటున్న వారి ప్రవర్తన ఇవన్నీ అతని మీద ప్రభావాన్ని చూపిస్తాయి. అయితే చెడ్డ గ్రంథాలు అధ్యయనం చేసి అర్థం అనే కొలత బద్ధతోనే జీవితాన్ని కొలిచి జీవనం గడిపే ఇతనివల్ల సమాజానికి జాతికి ఎలాంటి ఉపయోగముండదు. తన సమాజంలోని చెడునడతల్ని ఇతడేవిధంగానూ దూరం చేయలేడు. దేశంలోకి ప్రవేశించే విదేశీ దురాక్రమణ దారుల్ని అడ్డుకోలేడు. పైగా డబ్బు కొరకు వారితో కూడా లాలూచీపడి దేశ ద్రోహానికి పూను కొంటాడు. కాబట్టి అర్థవాదుల్ని, అర్థపరచిత్తుల్ని తయారు చేసే గ్రంధాలిప్పుడు గానీ ఎప్పుడుగానీ అవసరం లేదని గ్రహించాలి.

## అధికార వాదం

కొన్ని గ్రంథాల్ని అధ్యయనం చేయడం వల్ల, కొన్ని సంఘటనల వల్ల ఏర్పడ్డ మానసిక పరిస్థితుల వల్ల వ్యక్తి అధికారవాది అవుతాడు. ఏనకేన ప్రయుక్తేన" - ఏదో ఒహటి చేయాలి కుర్చీమీద కూచోవాలి. అధికారం సంపాదించడం కూడా ఓ వృత్తి లాంటిదైపోయింది. వందలు వేలు ఖర్చు పెట్టాలి. కుర్చీ సంపాదించాలి. పిచ్చి వ్యామోహం. ఎవరినీ లెక్కించేది లేదు.

అన్నదమ్ములు లేరు; అక్కచెల్లెండ్రులేరు, సామాజికానుబంధాలేవీ లేవు. పదవీ వ్యామోహం పరాకాష్ఠ స్థితి నందుకొంటుంది. పైకి ప్రజాసేవ అనే పదాలు కూడా వల్లింపబడతాయి.

ఇదొక జబ్బు. ఈ జబ్బు ఉన్నవాడు మానవధర్మం కూడా మర్చిపోతాడు. తలలు తీస్తాడు, తీయిస్తాడు.

ఇలాంటి వ్యక్తి సామాజిక దురాచారాల మీద దండెత్తుతాడా! తానుకొంత సమయంతీసి "బహుజన సుఖాయ, బహుజన హితాయ" అంటూ వ్యవహరిస్తాడా!

భారతదేశం పెద్ద కుర్చీ మీద కూచోడానికి విశేషంగా ప్రయత్నించి, తాననుకొన్న సాధించిన తర్వాత ఓ పెద్ద మనిషి "నా జీవిత చరమవాంఛ నెరవేరింది" అన్నాడు. అంటే అధికారపీఠం మీద కూచోవడమే తన చరమవాంఛనా!

దేశం సరిహద్దులు కుంచించుకు పోయాయి; వాటిని యథాస్థితికి తీసుకొని వెళ్లడమే నాజీవిత చరమవాంఛ అంటే ఎంతగుండేది. దేశంలో మద్యనిషేధం తెస్తూ, విదేశీయుల ఆగడాలు అరికడతా, దురాక్రమణదారులకు బుద్ధి చెబుతా, సామాజిక న్యాయం కొరకు పాటుపడతా, దేశం నుండి విడిపోయిన భాగాలు మళ్లీ దేశంలో విలీనం చేయిస్తా - ఇవే నా జీవిత చరమవాంఛలంటే ఎంత బాగుండేది! కుర్చీ మీద ఉన్న మమకారం ఇంతమంచి మాట అననిస్తుందా!

ఏ గ్రంథాల ద్వారా, ఏ పరిస్థితుల ద్వారా ఈ అధికారబధిరాంధకశవం తయారైందో విచిత్రమే. అందుకే మంచి గ్రంథాలు చదవాలి, మంచి మనుషులుగా తయారు కావాలి.

## అవకాశవాదం

ఏయెండకాగొడుగు పట్టేవారు కూడా సమాజంలో ఉంటారు. వీరిని ఉత్తమోత్తమ గ్రంథాలు కూడా మార్చకపోవడం మరీ విచిత్రం. ఏ వేదిక ఎక్కితే ఆ వేదిక మాట మాటాడుతూ బతుకును వెళ్లదీస్తుంటారు వీరు.

వీరు ఏ సిద్ధాంతానికీ కట్టుపడరు. తమ పనులు నొక్కించుకోడానికి శతకోటి అబద్ధాలు ఆడుతుంటారు. బతుకు తినడానికే అనుకొంటారు. దీనికో పరమార్థం ఉందన్న ఆలోచనే వారికి ఉండదు.

భద్రయ్య అన్న పేరొకాయన కుంది. ఈయన అచ్చంగా అవకాశవాది. ఒకచోట సంతర్పణ జరుగుతుంది. ఇది చేసే వారు వైష్ణవులన్న సంగతి అతనికి తెలిసింది. తన పేరు రామభద్రయ్య అనిచెప్పుకొని అక్కడ కడుపునిండా తిని బయల్దేరాడు. ఈ భద్రయ్య. మరోనాడు మరో చోట జరుగుతున్న సంతర్పణ చూశాడు. ఆ సంతర్పణ నిర్వహిస్తున్న వారు శైవులని తెలిసింది. అందుకే అక్కడ తన పేరు వీరభద్రయ్య అని చెప్పుకొని కడుపునిండా మేశాడు.

ప్రతి అవకాశాన్ని తన తిండికొరకు, తన సుఖం కొరకు ఉపయోగించుకొంటాడు. ఎప్పుడూ రామభద్రయ్యగా, వీర భద్రయ్యగా ఉండే ఇతను దేశం భద్రయ్యగా అయ్యేదెప్పుడో ఊహించడం కష్టమే!

చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష అనుకొంటూ జీవితమంతా అవకాశవాదిగానే బ్రతికే వ్యక్తి వల్ల ఈ సమాజానికి, ఈ దేశానికి, ఈజాతికి మేలేంజరుగుతుంది!

మరి ఇలాంటి వ్యక్తి తీర్చి దిద్దబడాలంటే ఏ సంస్కారాలు ఇతనిలో నాటబడాలి. అలా నాటబడే సంస్కారాలనిమిత్తం వీరు చదవాల్సిన గ్రంథాలేంటి!

పరులకుపకారం చేయడానికే వృక్షాలు ఫలాలనిస్తున్నాయి (పరోపకారాయ ఫలన్తి వృక్షాః) పరులకుపకారం చేయడానికే నదులు ప్రవహిస్తున్నాయి. (పరోపకారాయ వహన్తి నద్యః), పరుల కొరకే ఆవులు పాలనిస్తున్నాయి. (పరోపకారాయ దుహన్తి గావః).

మరి మనిషి తనకొరకే బ్రతుక వచ్చునా! దొంగాటకాలాడుతూ, నటనలూ చేస్తూ, ఒకణ్ణి ముంచుతూ, నలుగురిని పడదోస్తూ తాను నిచ్చెన మెట్లెక్కి వెళ్ల వచ్చునా! అవకాశవాదం బ్రతుకు మహాదుర్భరమైందని ఈరకం వాళ్లు గుర్తించేదెప్పుడు!

## విలాసవాదం

చింత చచ్చినా పులుపు చావదనే మాట ఒకటి వింటుంటాం. తృష్ణ, వాంఛాపరితృప్తి నిమిత్తమే ఈ రకం వ్యక్తులు జీవితం గడిపేస్తుంటారు.

నెత్తి వెంట్రుకలు చెదరరాదు. కట్టు బట్టలు నలగరాదు. ఒంటికి చెమట పట్టరాదు. సర్వేంద్రియాల కోరికలు తీరుతుండాలి. ఉంటే లైట్ కాలర్ జాబ్‌లో కూడా ఉంటారు. తమ పూర్వులు సంపాదించి దానికి పిల్లలు పుడుతుంటే అది అనుభవిస్తూ, అనుభవాల నిమిత్తం కావల్సినంత దుబారా చేస్తూ, జీవితమంటే ఇంద్రియాలు కోరినది అందించడమేనన్న ధ్యేయంతో రంగుల లోకంలో పంచ మకారాల (మగువ, మద్యం, మాంసం, మనీ, మాయ) కౌగిట్లో నలిగిపోతుంటారు. ఏది మిధ్యో ,ఏది సత్యమోతెలియని లోకంలో తేలిపోయేవీరు సామాజిక సమస్యల పరిష్కారానికి పూనుకొంటారా! కాలు కదిపితేనే కందిపోతామనుకొనే వీరు దేశం ఎదుర్కొంటున్న సమస్యల సుడిగుండాల్లో చిక్కుకోవాలనుకొంటారా!

ఎవడు పరిపాలిస్తే యేం! ఎవరు దాడిచేస్తేయేం! ఏ విదేశీ మతవాదం దేశాన్ని అతలాకుతలం చేస్తే యేం! తన ఇంద్రియ తృప్తికి ప్రమాదం ఉండకుండా ఉంటే చాలు.

సెక్సు పుస్తకాలు చదవడం, అశ్లీల కళల్ని ఆహ్వానించడం, ఇంద్రియాల్ని రెచ్చగొట్టే సంగీత సాహిత్య నృత్యాదుల్ని స్వాగతించడం, పరుపుమీద నుండి పాదం క్రింద మోపడం కూడా కష్టంగా భావించడం - ఏగ్రంథాల అధ్యయనం వల్ల, ఏ పరిస్థితుల ప్రభావం వల్ల ఇంత భోగవాదిగా ఇంత విలాసవాదిగా ఇతను మారాడో చెప్పలేం! తన ఊపిరికూడా (వీలుంటే) మరొకరు పీలిస్తే, లేదా పీల్చి పెడితే ఇంకా ఎంత హాయిగా బ్రతుకొచ్చుననుకొనే ఇలాంటి బేవార్సుల వల్ల ఈ దేశ ధర్మ సంస్కృతులకు ప్రయోజనమేమిటి!

ఇలాంటి వారు ఎంత సాధన చేస్తే, ఎన్ని గ్రంథాలు చదివితే పరివర్తన చెందుతారు?

## హింసావాదం

కొన్ని గ్రంథాలు కొన్ని సిద్ధాంతాలు కొంతమందిని బ్రెయిన్ వాష్ చేస్తాయి. వారు ఆ సిద్ధాంతానికి బానిసలైపోతారు. ప్రపంచంలోని ప్రతి సమస్యను 'గన్' మాత్రమే

పరిష్కరిస్తుందని వీరు భావిస్తారు. తుపాకిగొట్టం ద్వారానే అన్ని సమస్యలు పరిష్కరిస్తామనే భ్రమలో వీరుంటారు.

ఇద్దరు రైతుల గెట్టు పంచాయతీకి కూడా ప్రజాకోర్టు అనే ముసుగు పెట్టి అందులో ఒకరిని 'గన్'తో లేపేస్తారు. ఒకడు చచ్చాడు, ఇక గెట్టు పంచాయితి ఎక్కడుంది.

భార్యాభర్తలు కొట్లాడుకొన్నారు. అందులో ఒకరిపక్షం వహించి మరొకర్ని లేపి పారేస్తారు. ఊఁ అంటే తన్నుడు, కొట్టుడు, నరుకుడు, చంపుడు. రక్త దాహంతో దేశాన్ని అతలాకుతలం చేస్తారు. వ్యక్తుల సమీకరణ, ఆయుధాల సేకరణ, దోపిడీలు, దౌర్జన్యం, చందాల వసూళ్లు, విదేశాలనుండి ఆర్.డి.ఎక్స్ దిగుమతి, తమ దేశీయుల్నే పొట్టన పెట్టుకుంటూ అదేదో మరో ప్రపంచం నిర్మిస్తామన్న తహతహ. ఎవర్నో ఒకరిని తన్నాలి, చంపాలి అన్న రక్త దాహరోగం నరనరాన జీర్ణించుకొన్న వీరిని ఇలా తయారు చేసినవి వర్గశత్రు సిద్ధాంత నిర్మాణ గ్రంథాలే.

మమత, సమత, మానవత్వం, దివ్యత్వం, స్నేహం, సత్యం, శివం, సౌందర్యం అన్నీ మరిచిపోయి రక్త రాకాసులై తిరిగే వీరు ప్రాణం తీయగలరుగాని, ప్రాణం పోయగలరా!

ప్రపంచంలో ఇవాళ మత సామ్రాజ్యవాద దురహంకారం, సోషల్ సామ్రాజ్యవాద అధికార దాహం, మిలిటరీ హింసోన్మత్త పిశాచతాండవం, వ్యక్తిగత ముఠా నిర్మిత విశృంఖల విహారం, జాతి ఉన్మాద రాక్షస మనో నిర్మాణం ... ఇలాంటి ఎన్నో రకాల దుశ్శక్తులు అకాండ హింసా తాండవం చేస్తున్నాయి. మనిషి మనస్సు బ్యాలెన్సు తప్పి హింసారాధనం వేసే ముఠాలను నిర్మించి ప్రకృతిలోని సహజ దేవత అయిన శాంతిపై అత్యాచారం చేసే దౌర్భాగ్యానికి దిగజారడానికి ప్రధానకారణం గ్రంథ గత సిద్ధాంతాలేకదా! వర్గ శత్రు నిర్మూలన పేరిట వ్యాప్తమైన విదేశీ సిద్ధాంతం భారతదేశంలో బహురూపాలెత్తి ఈ దేశమాత గుండెకోతగా ఇవాళ కనిపిస్తుండడం వాస్తవం కాదా!

## పారమార్థిక వాదం

మరి ఏ వాదం ప్రబోధిస్తే మనిషి పరమోత్తముడవుతాడు! ఏ గ్రంథాలు అధ్యయనం చేయడం వల్ల "మమాత్మా సర్వభూతాత్మా - ఆత్మ వత్సర్వభూతాని" అన్న దర్శనాన్ని జీర్ణంచేసుకొని అనుష్టించ గలుగుతాడు. ఈ సృష్టిలోని ఏ వస్తువును ఏ జీవి తనతోపాటు తీసుకొని రాలేదు. వెళ్లిపోయేనాడు వెంటతీసుకొని పోలేడు. లక్షాధికారైనా లవణాన్నం తినాల్సిందే గాని మెరుగు బంగారం మ్రింగబోడు. అలాంటి పరిస్థితుల్లో తన చుట్టే గిరిగీసుకొన్న ఆదర్శవాదం, తనకడుపునిండితే సర్వ దారిద్ర్యాలు సమసి పోయినట్లుగా వ్యవహరించే ఆర్థికవాదం, తానొక్కడే అందరిపై అధికారం చలాయించాలనుకొనే అధికార

వాదం, ఏయెండకాగొడుగు పట్టి బతుకు వెళ్లదీసే అవకాశవాదం, ఇంద్రియాలు కోరిందల్లా ఇస్తూ అదే తృప్తి అనుకొని వ్యవహరించే విలాసవాదం, రక్త దాహంతో భూమాత గుండెల్ని రుధిరంతో తడుపుతున్న హింసోన్మాదం ఇవన్నీ మనిషి అనుసరిస్తే - ఆచరిస్తే అతణ్ణి మనిషి అనొచ్చా! వేదం "మనిషివికా" అని ఎందుకు పిలిపిచ్చింది. ఈ పై వాదాల కన్నిటికి బానిస అయిన వ్యక్తి మనిషి కాడనే వేదమాత అభిప్రాయం.

నీతోపాటు నీ పొరుగువాడిని ప్రేమించు అనే దానికన్నా, నీ వెంతో సర్వజీవులూ అంతే (ఆత్మ వత్సర్వభూతాని) అన్న మహోన్నత సిద్ధాంతం ప్రపంచంలో ఇవాళ తలమానికమైంది. వేల సంవత్సరాల నుండి ఈ సిద్ధాంతాన్నే నమ్మి జీర్ణించుకొన్న భారతీయునిలో మధ్యయుగాల కాలంలో అస్పృశ్యత పాటించడం, అసమానతలను పెంచుకోవడం, సాంఘిక దురన్యాయాలను నిర్మూలించుకోలేకపోవడం - ఇలాంటి వికారాల్ని అనుసరించడం దౌర్భాగ్యమే అయినా ఎన్నో సుగుణాలు ఈ దేశ గ్రంథాల్ని అధ్యయనం చేయడం వల్ల వీరిలో నాటుకొన్నాయి. అందువల్లనే అన్నం లేదని వచ్చిన వారికి అన్నం పెట్టారు. ఆశ్రయం లేనివారికి ఆశ్రయమిచ్చారు. ఏనాడూ ఒకదేశం మీద దండయాత్ర చేయలేదు. తమ దేశంమీద విదేశీయుల దాడులు జరిగినప్పుడు ఎదుర్కొన్నారు. తమలో తాము కలహించుకొని ఆ విదేశీయులు ఇక్కడ స్థిరపడి తమనే వారు పరిపాలించే విధంగా బలహీనపడ్డారు.

ఆ విదేశీ పరిపాలకులు ఏనాడు ఈ భారత జాతి (హిందూజాతి) ఏకతకు పాల్పడలేదు. హిందువుల కళలు వికసించాలని ఆలోచించలేదు. పైగా విద్యాలయాల్ని, మందిరాల్ని నాశనం చేశారు. గ్రంథాలయాల్ని కాల్చి వేశారు. హిందూజాతి ఉనికికే ప్రమాదాన్ని తెచ్చిపెట్టారు. అయినా ఈ జాతి తన అస్తిత్వం నిలుపుకొని ఈ నాటికీ ఉందంటే, ఈ దేశంలో వచ్చిన గ్రంథాలు, ఆ గ్రంథాల్లోని ఏకాత్మవాద దృక్పథం పునాదులుగా నిలిచాయి. రాజదండం అప్పుడప్పుడు మట్టి గరిచినా, ధర్మదండం మాత్రం నిరంతరం జాగరూకతతోనే వ్యవహరించింది. ఆది శంకరుల నుండి మలయాళ స్వాముల వరకు అందరు జనజాగరణకే వ్యవహరించారు. ఈ సందర్భంలో విజ్ఞానం మౌఖిక ప్రచారంలోనే ఎక్కువగా జరిగింది. వ్యక్తిగత సాధనకు సంస్కారానికి అధిక ప్రాధాన్యమీ యబడింది. వ్యక్తి వికాసంతో పాటు సమాజ సంఘటితశక్తి మాత్రం నిర్మాణం కాలేని పరిస్థితులు కొన్ని దాపురించిన కారణంగా, జాతి చాలా కాలం విదేశీయుల ఏలుబడిలో ఉండాల్సి వచ్చింది.

మొత్తం మీద భారత జాతి ఒకరికి అన్నం పెట్టిందే గాని, అన్నం పెట్టిన భూములను లాక్కొన్నది కాదు. వ్యక్తిగా కూడా తనకున్న జ్ఞానాన్ని పదిమందికి పంచిన వారున్నారు. ధనాన్ని వాపీకూపతటాక ఆలయ సేవా కేంద్రాల నిర్మాణానికి అర్పించిన వారున్నారు. తమ బలాన్ని ఒకరిని కాపాడడానికే వినియోగించిన వారున్నారు. తామెంతో అవతలి వారూ అంతే అన్న

ఏకాత్మ సిద్ధాంతాన్ని పాటించినవారున్నారు. నిరంతరం శ్రమిస్తూ ఉత్పత్తిరంగంలో లెక్కలేనన్ని పంటలు పండిస్తూ భారతదేశాన్ని ధాన్యాగారంగా మార్చిన వారున్నారు. ఆ పంటను పదిమందికి పంచిన వారున్నారు. తమ వేదాంత విజ్ఞాన పరిమళాల్ని ప్రపంచమంతా వ్యాప్తం చేసిన (వివేకానంద, రామతీర్థ, అరవింద, చిన్మయానంద, శివానంద, షీలా ప్రభుపాద) వారున్నారు. కర్మయోగులై, జ్ఞాన యోగులై భక్తి వైపు అందరినీ నడిపించిన వారున్నారు. భక్తి ద్వారా సమస్తాన్ని మరచిపోయి ఈ విశ్వమంతా ఒక్కటే అన్న భావన కలుగుతుందని ప్రచారం చేసిన వారున్నారు.

ఇవన్నీ పారమార్థికాలే. మనిషి పారమార్థిక వాది అయినప్పుడు ఇన్ని ప్రయోజనాలు సాధింపబడతాయి. నేటి గ్రంథగత విజ్ఞానం ఒకనాడు మౌఖిక ప్రచారంలోనే ఇవన్నీ సాధించింది. అన్ని వాదాల్లోనూ పారమార్థిక వాదాన్నే తన అనుష్ఠాన వేదాంతంగా ఈనాడు మనిషి స్వీకరించాల్సిన అవసరముంది. అప్పుడే "వసుధైకకుటుంబ" నిర్మాణం సాధ్యమవుతుంది.

## 3.6 పుస్తకం

- డా॥ నాగభైరవ కోటేశ్వరరావు

గ్రంథాలయ మనగానొక
బృందావని యగును గాదె! విరులగు గ్రంథాల్!
చిందు మకరంద మధువులు
గంథమ్ములు పరితలకును గావే విందుల్!

ఇరుకు తనము పోయి, చురుకుందనము వచ్చు
బాధ తరిగి గుండె బరువు తగ్గ
గ్రంథమనగ మనకు కడుగూర్చుమిత్రమే
మాట తప్పబోదు - మార్చబోదు

ఎందరి మేధ చేరెనొ! మరెందరి ఆశలు ఆశయాలు సౌ
గంధ సువర్ణ భావములు, గాధలు, బాధలు, బాధ్యతల్ యిటన్
గ్రంథములందు జేరి, చిర కావ్యములందున పీటవేసి, గా
ఢాంధ తమస్సులో వెలుగు లందగ జేయునొ ఆర్త కోటికిన్

పుస్తకము చరిత దాచిన హస్త గృహము!
పుస్తకము శాస్త్రకారుల మస్తకమ్ము!
పుస్తకము సత్కళాకారుల కాస్తిసుమ్ము!
పుస్తకము నమ్మకమ్మగు నేస్తు! నమ్ము!

# 3.7 గ్రంథాలయ కాంతి రేఖలు

**- ఆచార్య శలాక రఘునాథశర్మ**

వర్తమానంలో అడుగుపెట్టి భవిష్యత్తుకు బాటలు వెదుకుకొంటున్న బాటసారికి భూతకాలం ఒక అద్భుతమైన టార్చిలైటు. అది అందించ వలసిన వెలుగు సూర్యచంద్రాదుల వెలుగు కంటె విస్తృతమూ, అనంతమైన కాలానికి చాలినదీ కావాలి. లేకపోతే బాటసారిగతి అంధకారమనే అంతుచిక్కని గోతిలో పతనమే. ఆ దుర్గతిని దూరం చేసుకోవటానికి ఆ టార్చిలైటు చేయూత సర్వకాలాలలో సర్వ దేశాలలో సర్వులకూ అవసరమే.

కడచిన కాలానికి కమనీయమైన ఛాయాచిత్రమే గ్రంథం. ఒక మహాభావుకుడు తన దర్శన సామర్థ్యం మేరకు వీలయినంత ఎక్కువ కాలాన్ని ఫొటోతీస్తాడు. అది అక్షరరూపంలో ఏర్పడిన తరువాత శాశ్వతంగా నిలిచి పోతుంది. ఏనాటి వారో అయిన వ్యాస వాల్మీక్యాదులు, తరువాతి వారైన కాళిదాసు, షేక్స్పియర్ వంటి వారు, ఈనాటి రవీంద్రనాథ్‌టాగూర్, శ్రీశ్రీ వంటి వారు తమ భావనా బలంతో తమకు పూర్వంలో వర్తమానంలో ఉన్న స్థితిగతులకు అక్షరాకృతి కల్పించారు. ఒకమారు ఆ ఆకృతి ఏర్పడిందంటే ఇక దానికి రూపు మాసి పోవటం ఉండదు. అయితే అన్ని కృతులకు ఇదే స్థితి అని చెప్పటానికి వీలు లేదు. కర్తలో, కృతిలో శక్తి సమగ్రంగా ఉన్నపుడే అది సిద్ధిస్తుంది. ఆ విధంగా ఏర్పడిన ఛాయాచిత్రాలనే సాముదాయకంగా వాఙ్మయం అంటున్నాం. అది ఒక మహాజ్యోతి. కడచి పోయిన కాల పాత్రాదులన్నింటినీ ఆ జ్యోతి ద్వారా మనం చూడ గలుగుతాం. అది లేకపోతే సర్వమూ అంధకారమయమే. అందుకే దండి మహాకవి మానవజాతికి ఒక పరమ సత్యాన్ని చాటి చెప్పాడు.

"ఇద మన్ధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాత్మకం జ్యోతి రాసంసారం న దీప్యతే"

ఈ మూడు లోకాల సముదాయమూ, శబ్దరూపమైన జ్యోతి ప్రళయకాలం దాకా ప్రకాశిస్తూ ఉండకపోతే, చీకటి గుయ్యారమై పోతుంది. శబ్ద రూపమైన జ్యోతి ప్రకాశించటం గ్రంథ రూపంలోనే కదా! ఒకనాడు వాఙ్మయం మౌఖికంగానే ఉండేదంటారు. అది లిఖిత రూపం పొందిన నాటి నుండీ దానికి కాలానుసారంగా అనేక ప్రతులు ఏర్పడటం గమనిస్తున్నాం. కొందరు మహా మేధావులు ఒక్కొక్క సమయంలో అవసరాన్ని బట్టి గ్రంథాలను పునఃసృష్టి చేయగల శక్తి సంపన్నులై ఉండటం కూడా గమనిస్తున్నాం. ఏది ఏమైనా అనాదిగా వాఙ్మయం తన వెలుగులో మానవ సమాజాన్ని ప్రకాశింపజేస్తూ ఉన్నదనేది పరమసత్యం.

ఆ మహాకవియే మరొక మాట కూడా అన్నాడు.

*ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్,*
*తేషామసన్నిధానేఽ పి నస్వయం పశ్య నశ్యతి.*

వాఙ్మయమనేది ఒక అద్దం. అందులో ఆది రాజులయశస్సు అనే బింబం ప్రతిఫలనం పొందింది. అద్దంలో ప్రతిబింబం ఎదురుగా బింబం ఉన్నంత వరకే ఉంటుంది. బింబం ప్రక్కకు తొలగిపోతే ప్రతిబింబం కూడా తొలగిపోతుంది. ఆదిరాజుల కీర్తి బింబం ఇప్పుడు లేదు. కానీ వాఙ్మయమనే అద్దంలో పడిన ప్రతిబింబం మాత్రం నశింపక అలాగే కానవస్తున్నది. చూడు! ఎంత చిత్రమో! అని ఈ శ్లోకానికి తాత్పర్యం.

రాముణ్ణి, రామకధను వాల్మీకి రామాయణమనే అద్దంలో పట్టి నిలిపాడు. కనుకనే మనం ఈనాటికి కూడా రాముణ్ణి చూడగలుగుతున్నాం. అది వాఙ్మయమనే అద్దం మహిమ.

ఈ విధంగా ఒక గ్రంధంలో ఒక్కొక్కప్పుడు బహుకాల సంబంది చరిత్ర, కొండ అద్దమందు కొంచెమై యుండదా? అన్నట్లు, నిలిచి ఉంటుంది. ఒక మహాభారతం యుగాల చరిత్రకు అద్దం పట్టింది. ఒక కాలంనాటి మనుష్యుల తీరు తెన్నులు, ఆచారవ్యవహారాలు, శక్తి సామర్థ్యాలు, మనస్తత్వంలోని వందల కొలది భేదాలు, వస్తువులు, వాహనాలు, కొండలు నదులు, భౌగోళిక పరిస్థితులు - ఈ అన్నింటినీ మనం గ్రంధాల వలననే తెలుసుకో గలుగుతున్నాం.

వేద వ్యాసుడు - నిజతపో మహత్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై చతుర్వేద వేదాంతాభిప్రాయంబులును, చతుర్వర్గ వర్గానుబంధ బంధురకథేతిహాసంబులును, జతుర్యుగమహర్షి రాజవంశ చరితంబులును, జతుర్వర్ణాశ్రమ ధర్మ క్రమంబులును, చతుర్ముఖ ప్రముఖ నిఖిల సురముని గణ పూజితుండైన శ్రీ కృష్ణుని మాహాత్మ్యంబును, పాండవాది భారతవీరుల మహాగుణంబులును తన విమల జ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడుచుండ విశ్వజనీనమై పరగునట్లు భారతమును - నిర్మించాడట. వివరించుకుంటే ఇందులో లేనిది మరెక్కడా లేదు. ఎక్కడైనా ఏదైనా ఉంటే అది ఇందులో ఉన్నదే అన్నంత విజ్ఞాన సర్వస్వం శ్రీమహాభారతం. ఆ గ్రంథాన్ని హృదయానికి పట్టించుకుంటే విశ్వమూ, విశ్వేశ్వరుడూ విస్పష్టంగా తెలియరాదగిన జ్ఞాన విజ్ఞానాలు కలుగుతాయి. అదీ గ్రంథ మహిమ.

పూర్వకాలంలో గ్రంధాలు తాళపత్రాది రూపంలో ఉండటం వలన అందరికీ అందుబాటులో ఉండేవి కావు. అందుకని రాజులు తమ ఆస్థానాలలో ప్రత్యేకంగా లేఖకులను నియమించి గ్రంధభాండాగారాలను రూపొందించి భద్రపరచే వారు. గ్రంథాలయాల ఆదిమ స్వరూపం అటువంటిదిగా మనం సంభావింప వచ్చు.[1]

ఒక వ్యక్తి తన శక్తిని బట్టి కొన్ని వందల గ్రంథాలను అవలోకించాలని సంకల్పిస్తాడు. అన్నింటినీ తనంత తాను సంపాదించగలడా? లక్షల కొలదిగా ధనం వెచ్చించినా అది సాధ్యం కాదు. అంతేకాదు. ఒక వేళ సాధ్యమే అనుకున్నా అదంతా ఒక్కని వినియోగానికి మాత్రమే అయితే ఎంత వృధావ్యయం! కనుక ఒక గ్రంధాలయం ఏర్పడితే ఎందరైనా, ఎప్పుడైనా, ఎంతైనా జ్ఞాన సముపార్జన చేసుకోవచ్చు. దానిని తమ శక్తియుక్తుల మేరకు ఎందరికైనా పంచవచ్చు.

కొన్ని గ్రంథాలు ఎప్పుడో ముద్రితమై ఉంటాయి. వాని విస్తృతిని బట్టిగానీ, వినయోగించుకొనేవారి సంఖ్య తక్కువ ఉండటం వలన గానీ, మరియే యితర కారణాల వల్లగానీ ఆపుస్తకాలు పునర్ముద్రణ కాగల అవకాశాలు ఆకాశ ప్రాయంగా ఉంటాయి. అటువంటి వాటికి కనీసం ఒకటో రెండో ప్రతికలను మహా గ్రంథాలయాలు మాత్రమే చేయించి రక్షింప గలుగుతాయి. వానిని ఉపయోగింప దలచుకున్నవారు గ్రంధాలయాలలోనే కూర్చుండి కావలసిన విషయాలను సేకరించుకుంటారు. ఇట్టి పనులు వైయక్తికంగా సాధ్యం కావు.

వేల కొలది రూపాయల విలువగల విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, మహానిఘంటువులు, శాస్త్రీయ పరిశోధనా సంచికలు మొదలైన వాటిని వ్యక్తులు సంపాదించుకోలేరు. వానిలోని అమూల్య విజ్ఞాన సంపదను గ్రంధాలయాలు మాత్రమే పరిరక్షించి అందించగలవు. అలాగే ప్రాచీన పుస్తక భాండాగారాలలోని అముద్రిత గ్రంధాలను ఆదాన ప్రదాన పద్ధతి మీద గ్రంధాలయాలు మాత్రమే అందరికీ అందుబాటులోనికి తేగలవు.

ప్రస్తుతం శాస్త్రీయ సాంకేతిక జ్ఞానం ఎంతో సమున్నత స్థాయికి ఎదిగింది. జిరాక్స్, కంప్యూటర్ వంటి యాంత్రిక సామగ్రి రచయితల జ్ఞాన విజ్ఞాన ఫలాలను నిత్య నూతనంగా చేయగల్గుతున్నది. వాని సక్రమ సాధనలను మహానిక్షేపంగా ఉంచగలిగిన వ్యవస్థ ఒక్క గ్రంధాలయమే.

ఒక్క మాటలో చెప్పాలంటే ఒక సమగ్రమైన గ్రంధాలయం ఒక అద్భుత సూక్ష్మదర్శిని. అనంతమైన దేశకాలాలకు సంబంధించిన అనంత జ్ఞాన వాహినులను సూక్ష్మంలో మోక్షంలా నిబంధించుకొన్న మహాసాగరం. అందులో మనం సరస్వతీ విశ్వరూపాన్ని సమగ్రంగా దర్శించుకోవచ్చు.

మనిషి భూతకాల అనుభవాలను మార్గదర్శక సామగ్రిగా పెట్టుకొని, వర్తమానాన్ని చక్క దిద్దుకుంటూ భవిష్యద్దర్శనం కోసం ప్రయత్న పరుడౌతాడు. అలా అయితేనే అతడు పూర్ణ పురుషత్వ సిద్ధి పొందగలడు. దానికి పరమ సాధనాలు గ్రంథాలయ కాంతి రేఖలు. ఆ కాంతులు సూర్య చంద్రాదులు ప్రసాదించిన వాని కంటె మిక్కిలి విలువైనవి. ఈ తత్త్వాన్ని గుర్తించి మానవ జాతి గ్రంధాలయజ్ఞాన జ్యోతిని స్నేహపుష్టం చేసుకుంటూ ఉండాలి.

## 3.8 విజ్ఞానదాయకాలు గ్రంథాలయాలు

- ఆచార్య ఎస్. గంగప్ప

"సభ్యులారా! గ్రంధాలయములు దేవాలయములేను. గ్రంథములు దైవముకను. దైవముల నర్చించురీతిని గ్రంథముల నర్చించువారికి జ్ఞానము కరతలామలకంబగును. కావున గ్రంథార్చనము సకలురకు జ్ఞానార్చనమేను, శ్రేయస్కరము, యశస్కరము.

తే.గీ. కరమునను భూషణంబయి క్రాలుదీవు

వీనులకు విందులొసగుచు వెలయుదీవు

మానసామోద మొదవింప మనుదువీవు

పుస్తకమ! నీకు సల్పుదుఁబూజ భక్తి"

- అని 25.7. 1918 న కోలాచలం శ్రీనివాసరావు ప్రసంగించిన "ప్రాచీన గ్రంథాలయ చరిత్రము" పుట. 16 నందలి విషయం. ఇది మా జ్యేష్ఠ పుత్రుడైన శత్రుఘ్నరావు గారిచేత 1924లో ప్రకటితం.

ఇదే రీతిగా గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకటరమణయ్యగారు సైతం అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. గ్రంథాలయాన్ని దేవాలయంగా భావించారు.

"దేవాలయమునకు గ్రంధాలయమునకును భేదము లేదు. దేవాలయములన్నియు గ్రంధాలయములే. గ్రంథాలయములన్నియు వాగ్దేవియొక్క ఆలయములే. భారత సదనములే. ఈ రెండింటికిని గల ద్వైతభావమును విస్మరించి నేడు అద్వైత భావమును సాధించవలెను. ఆనాడు దేవాలయములను ప్రతిష్ఠింపజేసినవారు ధర్మకర్తలు. ఈనాటి సరస్వత్యాలయ ప్రతిష్ఠాపకులు ప్రభుత్వము. ఆనాటి దేవాలయ పూజారులే నేటి సరస్వత్యాలయ భాండాగారులు. ఉభయులు ధర్మప్రతిష్ఠాపకులై వారి విద్యుక్త ధర్మమును - త్యాగ మూర్తులై, ప్రతిష్ఠాపనల పరమ ప్రయోజనములను విస్మరించక - నిర్వహించినచో ప్రజాహృదయమున ప్రజ్ఞాన జ్యోతి వెలిగి, అజ్ఞాన తిమిరము పటాపంచలై వారు పురుషార్థసాధనకు పురోగమించగలరు" (గ్రంధాలయవాణి పు. 26)

దేవాలయాలు ఆముష్మిక సాధనకుపకరించ వచ్చును. కానీ ఐహికాముష్మిక సాధనకు గ్రంథాలయాలే ముఖ్యమని అయ్యంకి వారి వక్కణ గమనించదగ్గది.

"దేవాలయ నిర్మాణము వలన ఆముష్మికములను మాత్రము సాధించవచ్చును. నేడు ప్రపంచమునందు ఉన్నత స్థితిని బొందవలెనన్న ఆముష్మికముగ ఔన్నత్యమును సంపాదించిన

చాలదు, ఒక మనుజుని యాత్మ జ్ఞాన ప్రపూరితమై యుండవచ్చును. కాని యాతని దేహము కూడ ఆరోగ్యవంతమై యుండవలెను. ఈ రెండును సమాన స్థాయిలో నున్నగాని మనుజుడభివృద్ధి నొందుట యసంభవము. ఇదే విధముగ ఒక జాతి ఆముష్మికముగ జౌన్నత్యమును చెందియున్నను, ఐహికయుగ కూడ ఉన్నతస్థితిలో నున్నగాని, అది సమగ్రమగు అభివృద్ధి నొందుటకు వీలులేదు. కావున మనమిప్పుడు నిర్మింపబోవు ఆలయములు ఐహికాముష్మికములకు రెండింటికిని గూడ సహకారములగుననిగ ఉండవలెను. ఇట్లు ఇహపరములకు రెండింటికిని సహకారులగు ఆలయములకే గ్రంథాలయములని పేరు" (పైదే. పు. 32)

ఈ గ్రంథాలయాలు పశుపక్ష్యాదుల కంటే భిన్నుడై శ్రేష్ఠుడైన మానవుని వ్యక్తిత్వాన్ని వికాసాన్ని పెంచి మానవత్వ నిరూపణకు సహకరిస్తాయని అయ్యంకి వారి అభిప్రాయం. ఇది అక్షరాలాసత్యం.

"ఇతర దేశములయందలి గ్రంథాలయోద్యమములన్నియు మనుజుని మేధాశక్తిని వృద్ధి పొందించుటకే ప్రయత్నము లొనర్చుచుండ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము మనుజుని సంపూర్ణమనుష్యత్వమును వ్యక్తీకరించుటకు తగిన సాధన సామగ్రినంతయ సమకూర్చుకొని యున్నది. మన మొసంగుజ్ఞానము నిద్రాణమైయున్న ఆత్మనుద్దీపింపజేసి పౌరునికి గావలసిన సన్మార్గ జీవనమునకు గొనిపోవునదిగ నుండవలయును" (పైదే. పు. 18).

"తాను బాగుపడి, తోటివారలను బాగు చేయవలయునను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛలకు ఆంధ్ర గ్రంథాలయోద్యమము యొక్క ప్రేరణశక్తి, నవ్యోత్సాహపూరితులైన అట్టి వాంఛకలిగిన యువకులే ఈ యుద్యమమునకు మూలకారకులైయున్నారు. మానవునిలో దాగియున్నదైవ దత్తమయిన శక్తులను, చైతన్యాన్ని ప్రేరేపించి వెలికి తెచ్చి, మనవుని మానవునిగా చేయడం ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమ ఆదర్శం" (పైదే. పు. 21)

ఆనాడు మన దేశంలో ఈ గ్రంథాలయోద్యమం పై అయ్యంకి వారి మాటలవల్ల ఒక ఆదర్శాన్ని పురస్కరించి ప్రారంభించబడింది. ప్రజల్లో ఒక స్ఫూర్తిని, చైతన్యాన్ని కలిగించడానికి ఉపకరించింది. వాస్తవానికి ఈ ఉద్యమం మన భారత దేశ స్వాతంత్ర్యోద్యమంలో అంతర్భాగం. ప్రజలు చైతన్యవంతులుకావాలంటే విద్యాబుద్ధులు పొంది జ్ఞానసంపన్నులు కావాలి. అందుకు స్వాతంత్ర్యోద్యమ ప్రాముఖ్యాన్ని వివరించడానికి విరివిగా ఈ గ్రంథాలయాల స్థాపన ఆవశ్యకమైంది. గ్రంథాలయాల స్థాపనలో ఆ గ్రంధాలయాలు అన్ని ఉద్యమాలకు మూలకందమై తల్లి ఉద్యమమైందని అయ్యంకి వారే వివరించారు.

"గ్రంథాలయోద్యమము అన్ని యుద్యమాలకు తల్లి. దానిలో నుండియే ప్రజలను ఉత్తేజపరచి, వారిని మహదభివృద్ధికి తీసుకొనివెళ్లే అన్ని ఉద్యమాలు పుట్టినాయి. ఒక్క రాజకీయ ఉద్యమమే కాదు. అన్ని ఉద్యమాలకు మూలకందము" (పైదే. పు. 22).

అంటే స్వాతంత్ర్య స్ఫూర్తి ప్రజ్వలింపచేయడానికి ఈ గ్రంథాలయాలస్థాపన ప్రారంభమైంది. దానికై ప్రయత్నించిన మహనీయుల్లో ప్రథములు అయ్యంకి వెంకటరమణయ్యగారు. అందుకే ఆయన గ్రంథాలయ పితామహ. ఈ గ్రంథాలయాలు స్థాపించాక అవే సమస్త ఉద్యమాలకు నిలయమయ్యాయి. జ్ఞానాభివృద్ధికి కారణమయ్యాయి. మనం స్వతంత్రుల మయ్యాక పౌర గ్రంథాలయాల స్థాపనకు ప్రభుత్వమే పూనుకొంది. అందుకే ఈనాడు నగరాల్లో పట్టణాల్లో నేగాక పల్లె పల్లెలోను గ్రంథాలయాలు, శాఖా గ్రంధాలయాలు వెలిశాయి. విజ్ఞాన వినోదాలకు ఈనాడివి ఉపకరిస్తున్నాయి. గ్రంథాలేకాక దిన, వార, మాస పత్రికలు అన్ని రకాల, అన్ని భాషలలోను లభిస్తున్నాయి. పిల్లలకు పెద్దలకు, లింగ వివక్షలేక వర్ణ వర్గ కులమతాతీతంగా ఈ గ్రంధాలయాలు ఆధునిక యుగంలో ఉపకరిస్తున్నాయి. సామాన్యాంశా లేగాక, అత్యాధునిక శాస్త్రవిజ్ఞానాన్ని కూడా ప్రజలకందిస్తున్నాయి. విద్యార్థులు పోటీ పరీక్షలకు సిద్ధం కావడానికి ఈ గ్రంథాలయాల ఉపకారమింత అని చెప్పవీలు లేదు. ఈనాడు నియత విద్యావిధానంలోనే గాక, అనియత విద్యా విధానంలోను ఎంతగానో ఈ గ్రంథాలయాలు సహకరిస్తున్నాయి. అలాగే అక్షరజ్యోతి కార్యక్రమంలో భాగమైన నిరక్షరాస్యతానిర్మూలనకు గ్రంథాలయాలు పట్టుగొమ్మలుగా ఉన్నాయి. అందరూ అన్ని పుస్తకాలు కొనలేరు. వ్యక్తి గత గ్రంథాలయాలను ఏర్పాటుచేసుకోలేరు. తగిన ధనం, అవకాశం వీటి కవసరం. అందువల్లనే ఈ పౌరగ్రంథాలయాలు మన కెంతగానో ఉపకరిస్తూ, మానవ జ్ఞానతృష్ణ తీర్చడానికి సమర్థమై ఒప్పుతున్నాయి.

ఈ అత్యాధునిక యుగంలో శాస్త్ర విజ్ఞాన మనంతంగా విస్ఫూర్తకాంతులను విరజిమ్ముతూ విరాజిల్లుతుండగా వాటికన్నిటికి మూలమైన గ్రంధాలయాలు ఎంతో ప్రాముఖ్యం వహిస్తున్నాయి. ముఖ్యమైన సమాచారాన్ని, అపురూపమైన రచనల్ని గ్రంథాల్ని ఇంతకు ముందు మైక్రోఫిల్ముల్లో భద్రపరచి గ్రంథాలయాల్లో పాఠకులకోసం ఏర్పాటు చేసేవాళ్లు. ఈ సౌకర్యం ప్రముఖ గ్రంథాలయాల్లోను కల్గించి ఉండడం మనకు తెల్లుసు. కానీ ఈనాడు కంప్యూటర్సు విరివిగా అందుబాటులోకివచ్చాక అపురూపమైన విషయాలు, సమాచారమేగాక, సమస్త గ్రంథాలయ కార్యక్రమం పనితీరు సులభతరమైంది. పాఠకులకు అవసరమైన విషయాలను ఈ కంప్యూటర్సు ద్వారా అందించడంలోను, అత్యంతాధునికమైన విజ్ఞానాన్ని సేకరించి ఇవ్వడంలోను ఎంతో

సౌలభ్యమేర్పడింది. తద్వారా సమయం వృధా కాకుండా ఎవరికవసరమైన జ్ఞానాన్ని వారు పొందడంలోను, విషయ సేకరణలోను, గ్రంధాలయాలు ఎంతగానో ఉపకరిస్తున్నాయి. ప్రత్యేకించి బోధనలోనేగాక, పరిశోధనారంగంలోను ఈ గ్రంధాలయాల ఆవశ్యకమెంతో ఉందని స్పష్టమవుతుంది. ఈ విజ్ఞాన ప్రమాణాలపైన ఈ గ్రంధాలయాల నిర్మాణం, నిర్వహణ ప్రజాసముదాయకానికి వీడని బంధువులు. సమస్త ప్రజానీకానికి కూడలి. తరతమభేదరహితమైన సమసమాజ నిర్మాణానికి గ్రంథాలయాలే మూలమని విదితమవు తుంది. ప్రభుత్వమేగాక, సంపన్నులు దాతృత్వ గుణంతో ఈగ్రంధాలయాల నిర్మాణ నిర్వహణలకు సహకరిస్తారనీ, విస్తరిస్తూన్న విజ్ఞానం సర్వప్రజానీకానికి చేరువవుతుందని ఆశిస్తున్నాను.

## 3.9 "...పుస్తకము చేతన్ బూనితిన్..."

- బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

*"తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్, నీవునా*
*యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల సుశబ్దంబుశో*
*భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!*
*పుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందుబింబాననా!"*

పుస్తకం చేత బట్టే వాడెవడైనా ఈ పద్యంతో చదువుల తల్లిని కీర్తించి మరీ పుస్తకం మొదలు పెడతాడు. పుస్తకం వ్రాయ బూనుకున్న రచయిత అయినా, పుస్తకం చదవడం మొదలు పెట్టిన పాఠకుడైనా ఈ విధంగా చదువుల తల్లిని స్మరించకుండా తన పనికి పూనుకోడు. ఇది మన సంప్రదాయం.

ఎందుకు ఇలా చదువుల తల్లిని స్మరించడం? రచయిత, లేదా పాఠకుని ఉల్లంలో (మనస్సులో) కొలువై సుశబ్దం శోభిల్లేటట్లు, జృంభణంగా ఆ తల్లే ఉక్తులను (వాక్యాలను) పలుకుతుంది కాబట్టి!

'పరావాక్' రూపంలో చదువుల తల్లి - శారదా దేవి - మూలాధార చక్రం నుంచి ఆవిర్భవించి, క్రమంగా పశ్యంతీ, మధ్యమా దశల ద్వారా ప్రయాణించి చివరికి రచయిత లేదా వక్త ముఖం ద్వారా వైఖరీ వాక్కురూపంలో వెలువడుతుంది. పాఠకునిలో కూడా ఆ వైఖరీ వాక్కు తిరిగి మధ్యమా, పశ్యంతీ దశల ద్వారా పరావాక్కుగా పరిణమించి బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన రసానందాన్ని అతనికి కలిగిస్తుంది.

ప్రాచీన కాలంలో పుస్తకాలు ఉండేవికావు. వాక్కులు వైఖరీ రూపంలో వక్తల ముఖస్థాలుగానే నిలిచి ఉండేవి. వేదాలు బ్రహ్మనాలుగు ముఖాల నుంచి ఆ విధంగానే ఆవిర్భవించాయి. ఆ విధంగా వక్తల ముఖస్థాలై ఉండే వాక్కులు మౌఖికంగానే ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తూ వచ్చాయి. ఆ రోజులలో పుస్తకాలే లేవు గనుక పుస్తకాలయాలూ ఉండేవి కావు. మేధావుల మెదడులే పుస్తకాలయాలుగా ఉండేవి. ఆనాటి మేధావుల అసాధారణ మైన ధారణ శక్తి ఆశ్చర్యకరమైంది. సంస్కృత భాషలోని గ్రంథజాలాన్నంతటిని తన మెదడు గ్రంథాలయంలోనే సంప్రదించి పాణిని సంస్కృత భాషకు 'అష్టాధ్యాయి' అనే సూత్రవ్యాకరణం రచించాడు. ప్రపంచంలో అది ఎనిమిదవ వింత!

ఆ వ్యాకరణానికి పతంజలి తాను ఆదిశేషుని అవతారంగనుక తెర వెనుక ఉండి వేయి జిహ్వలతో తొమ్మిది రోజులలో మహా భాష్యం చెప్పాడు. తెర ముందు ఉన్న శిష్యులు ఆ మహాభాష్యాన్ని మౌఖికంగానే తరువాతి తరాల వారికి అందజేశారు. తొమ్మిది రోజులలో చెప్పినది గనుక పాతంజల మహాభాష్యం నవాహ్నికంగా ప్రసిద్ధి పొందింది.

చాలా రోజులు ఆ విధంగా వక్తల ముఖస్థంగానే ఉంటూ వచ్చిన వాగ్దేవికి లిపి, లేఖన ప్రక్రియ ఆరంభమైన తరువాత తప్ప పుస్తక రూపం ఏర్పడ లేదు. వాల్మీకి రామాయణ కావ్యాన్ని రచించే నాటికి కూడా లిపి, లేఖన ప్రక్రియ ఏర్పడినట్లు కనిపించదు వాల్మీకి రామాయణమంతా ఆయన ముఖస్థంగానే ఉండి, మొదట కుశలవులకు ఉపదేశించబడి, వారి ద్వారా కొన్ని తరాల పాటు మౌఖికంగానే ప్రచారం అవుతూ వచ్చింది.

వ్యాస భగవానుడు భారతం వ్రాసేనాటికి లిపి, లేఖనం వ్యవహారంలోకి వచ్చినట్లు కనిపిస్తుంది. ఆయన భారత రచనకు విఘ్నేశరుడు లేఖకుడుగా ఉన్నాడు. తన ఘంటం ఆగకుండా వ్యాసుడు శ్లోకాలు చెప్పాలనీ, ఎప్పుడు ఘంటం ఆగితే అప్పుడు తాను వెళ్ళిపోతానని విఘ్నేశ్వరుడు అన్నాడట. దానికి వ్యాసుడు "అర్థం చేసుకోకుండా ఏ శ్లోకం నీవు వ్రాయకూడదు' అనే షరతు పెట్టి తాను ఆలోచించుకోడానికి వ్యవధానం కావలసి వచ్చినపుడల్లా ఒక క్లిష్టమైన శ్లోకం చెప్పి, దానిని అర్థం చేసుకోడానికి విఘ్నేశ్వరుడు తికమక పడుతూ ఉండగా వ్యాసుడు మరి కొన్ని శ్లోకాలు ఆలోచించుకునే వాడు. భారతంలో ఆ విధంగా వ్యాసుడు రచించిన క్లిష్టమైన శ్లోకాలనే "వ్యాస ఘట్టాలు" అంటారు. వ్యాసుని కాలంనాటికే లేఖకుడు, లేఖన ప్రక్రియ ఉన్నట్లు ఆధారాలు కనిపిస్తున్నా అప్పటికీ ఇంకా మౌఖిక ప్రచార విధానం కూడా వాడుకలో ఉన్నట్లు తోస్తుంది. వ్యాసుడు తన భారతాన్ని తన నలుగురు శిష్యులకు ఉపదేశించి నాలుగు ప్రాంతాలలో దానిని ప్రచారం చేయడానికి పంపినట్లు ఒక ఐతిహ్యం ఉంది. శౌనకాది మహామునులకు సూతుడు మౌఖికంగానే భారతం వినిపించాడు.

లేఖన ప్రక్రియ వాడుకలోకి వచ్చిన తరువాత తమ రచనకు శాశ్వతత్వం కల్పించడం కోసం కొన్నాళ్లు శిలల మీద, రాగిరేకుల మీద లిఖిస్తూ వచ్చారు. తరువాత చాలాకాలం పాటు పుస్తకాలు భూర్జ పత్రాల మీద, తాళపత్రాల మీద వ్రాస్తూ వచ్చారు. అవి శిధిలం అవుతూ ఉంటే మళ్ళీ వాటికి పుత్రికలను తయారు చేసేవారు.

ముద్రణ యంత్రం కనుగొన్న తరువాత పుస్తకాలకు ఈనాటి రూపం ఏర్పడింది. ముద్రిత పుస్తకాలు కూడా పునర్ముద్రణకు నోచుకోకపోతే విస్మృతిపాలు కాక తప్పదు. అలా విస్మృతి పాలు కాకుండా ముద్రణలో లేని గ్రంథాలను, పత్రికలను భావి తరాల పరిశోధకుల ఉపయోగం కోసం భద్ర పరచడానికి నేడు మైక్రోఫిల్మ్ విధానం వాడుకలోకి వచ్చింది.

మైక్రోఫిల్మ్ రీడర్స్ సహాయంతో ఆ మైక్రో ఫిలింలోని గ్రంథాలను, పత్రికలను చదివి పరిశోధకులు తమకు అవసరమైన అంశాలను నోట్ చేసుకునే అవకాశం ప్రస్తుతం చాలా గ్రంథాలయాలలో ఉంది.

నేడు సాంకేతిక శాస్త్రం ఎన్నడూ ఎవ్వరూ ఊహించి ఉండనంత వేగంగా అభివృద్ధి చెందుతున్నది. కంప్యూటర్‌లు మనిషి శ్రమను పూర్తిగా తగ్గించి వేస్తున్నాయి. అనేక సంపుటాలతో కూడిన విజ్ఞాన సర్వస్వం లాంటి గ్రంథాన్నే ఒక చిన్న 'సి.డి.రామ్' డిస్క్‌లో రికార్డ్ చేసి మీరు ఎప్పుడు ఏ విషయాన్ని గురించి తెలుసుకోవాలంటే అప్పుడు ఒక చిన్న 'కమాండ్'తో కంప్యూటర్ స్క్రీన్ మీద ఆ విషయం కనిపించే అవకాశాన్ని సాంకేతిక శాస్త్రం మనకు సమకూర్చింది. ప్రతి వ్యక్తి తన పెర్సనల్ కంప్యూటర్ మీద ఏ పుస్తకంలో ఏ పుట కావాలంటే ఆ పుటను తేలికగా చదువుకునే అవకాశం ఏర్పడితే భవిష్యత్తులో పుస్తకాలు, పుస్తకాలయాలు ఏ రూపం ధరిస్తాయో వేచి చూడవలసిందే!

# 3.10 గ్రామీణ గ్రంథాలయాలు : ఇంటి ముందుకు గ్రంథాలయం

- గాలి ప్రభావతి

"A university is a collection of books" - అన్నాడు ఆంగ్ల రచయిత కార్లైల్. "A library is a true university" - అన్నారు కీ.శే. బూర్గుల రామకృష్ణారావు గారు. 'గ్రంథాలయమే విశ్వవిద్యాలయం' అని వీరి అభిప్రాయం.

అందరూ విద్యనూ విజ్ఞానాన్నీ సంస్కారాన్నీ పెంపొందించుకోవటానికి దోహదం చేయటమే గ్రంధాలయ నిర్వహణకు ముఖ్య లక్ష్యం. ధనికులు, పేదలు, కులమత వర్గ విభేదాలు లేకుండా అందరికీ ప్రవేశం లభించే సరస్వతీ ఆలయం గ్రంధాలయం

## గ్రంథాలయ సందర్శనం

నిశ్శబ్దంగా ధ్యానం చేసుకునే మునుల ఆశ్రమాలలోని ప్రశాంతత, పవిత్రత, నైర్మల్యం గ్రంధాలయాలలో గోచరిస్తాయి! గ్రంధాలయాలలో ఓపెన్ రేక్స్‌లో క్రమపద్ధతిలో అమరి ఉండే గ్రంథాలను చూస్తూ ఉంటే నిమగ్నతతో, నిబద్ధతతో నిరంతరం ధ్యానంలో ఉండే మునులు జ్ఞాపకం వస్తారు! ఋషులు ఇక్కడ అగుపిస్తారు! వ్యాస మహర్షి వాల్మీకీ, నన్నయ్య పోతన, కవితిక్కన కాళిదాసు, విశ్వనాథ గురజాడ, శ్రీనాధుడు శ్రీశ్రీ, షేక్స్పియరూ, షెల్లీ కీట్సూ, బెర్నార్డ్‌షా, ఓహెన్రీ, ఆస్కార్‌వైల్డ్, సోమర్‌సెట్‌మామ్ - ఇలా, ఎందరో మహనీయులు గ్రంథాలయంలో 'దర్శన'మిస్తారు. 'ఆత్మీయత'ను పంచిస్తారు.

మునులు తపస్వినులు బాహ్యసృష్టికి ఎంత నిరాడంబరులో ఆంతర్యంలో అంత మహాశక్తి సంపన్నులు. గ్రంథాలలోనూ అంతటి మహాశక్తి ఉంది. గ్రంథాలయంలోనూ అంతటి దివ్యత్వం ఉంది

## గ్రామీణులు - గ్రంథాలయాలు

పట్టణ ప్రజలకయితే చేరువలోనే గ్రంథాలయాలు ఉంటాయి. వాళ్ళకు విద్యార్జన కోసం కానీ, వృత్తిరీత్యా కానీ, ఉద్యోగపరంగా కానీ అవసరమయ్యే గ్రంధాలు వెంటనే లభ్యమవుతాయి. కనుక వాళ్ళు శీఘ్రగతిని, మానసికంగా, వ్యక్తిగతంగా, వైజ్ఞానికంగా, సాంస్కృతికంగా వికాసంపొంది ఎదగటానికి అవకాశాలున్నాయి.

కాని, గ్రామీణులకు అటువంటి అవకాశాలు తక్కువ. సౌకర్యాలూ తక్కువే.

ఇటీవల అందిన సమాచారాన్ని బట్టి - గ్రామ ప్రాంతాలలో ఈ క్రింది విధంగా గ్రంథాలయ సేవలు జరుగుతున్నట్లు తెలుస్తోంది -

| | |
|---|---|
| శాఖాగ్రంధాలయాలు | 1,070 |
| సంచార గ్రంధాలయం (వేన్) | 1 |
| గ్రామీణ గ్రంధాలయాలు | 322 |
| మొత్తం | 1393 |
| రిక్షామీద/సైకిలు మీద సంచార గ్రంథాలయాలు | 63 |
| బుక్ డిపాజిట్ సెంటర్లు | 552 |
| పంచాయతీ గ్రంథాలయాలు (ఎయిడెడ్) | 15,438 |
| సహకార సంస్థలు నడిపే గ్రంధాలయాలు (ఎయిడెడ్) | 36 |
| ప్రయివేటు సంస్థలు నిర్వహించే గ్రంధాలయాలు (ఎయిడెడ్) | 383 |

- ఈ లెక్కల వల్ల తేలిన సారాంశం ఏమిటంటే - గ్రామీణ గ్రంథాలయాల ఏర్పాటు విషయంలో జపరిగిన కృషి సూది మొనంత. జరగవలసిన కృషి కొండంత.

"సమాజానికి రైతు వెన్నెముక వంటివాడు" "గ్రామాలు మన దేశ సిరి సంపదల అభివృద్ధికి మూలాధారాలు" అనే - నినాదాలు అనునిత్యం మనం వింటూంటాం. గ్రామాల అభివృద్ధి పైనే, మన దేశ అభివృద్ధి ఆధారపడి ఉందనేది అందరూ అంగీకరించే సత్యం.

మరి గ్రామీణులలో చైతన్యం కలగటానికీ, వాళ్ళ విద్యాభివృద్ధికీ, వైజ్ఞానికంగా సాంస్కృతికంగా వాళ్ళు ఎదగటానికీ పుస్తక పఠనం అవసరం. గ్రంధాలయాలు అవసరం. అందుకే రాష్ట్ర వయోజన విద్యా కేంద్రాల వారు, జిల్లా సాక్షరతా కేంద్రాల ద్వారాను, ఆంధ్ర మహిళా సభ లిటరసీ హౌస్ సంస్థవారూ, స్టేట్ రిసోర్స్ సెంటర్ల వారూ గ్రామ ప్రజలలో చైతన్యం కలిగించటానికీ, వాళ్ళ విద్యాభివృద్ధికీ అనేక విధాల కృషి చేస్తున్నారు. రాత్రి బడులలో చదివేవారి కోస వయోజన వాచకాలు ప్రచురించి సరఫరా చేస్తున్నారు నూతన అక్షరాస్యుల స్థాయికి తగినట్లు పుస్తకాలు వ్రాయించి ప్రచురించి నిరంతర విద్యా కేంద్రాల ద్వారా గ్రామీణులకు అందజేస్తున్నారు. పత్రికలు ప్రచురించి ఇస్తున్నారు.

ఆంధ్ర మహిళా సభ లిటరసీ హౌస్ సంస్థల (హైద్రాబాదు) అజమాయిషీలో రాజీవ్ గాంధీ ఫౌండేషన్ వ్యాన్‌లో ఒక సంచార గ్రంథాలయం నిర్వహణ జరుగుతోంది. ఈ సంచార గ్రంథాలయం, ఇబ్రహీం పట్టణ మండలంలో ఇరవై ఆరు సెంటర్లకు తిరుగుతూ, పుస్తకమిత్ర' (సంచార గ్రంథాలయ ప్రతినిధులు) ల ద్వారా, నూతన అక్షరాస్యులకు విద్యావంతులకు అవసరమయ్యే పుస్తకాలు సరఫరా చేయటం జరుగుతోంది.

గ్రామాలలో గ్రంథాలయాల ఆవశ్యకత ఎంతో ఉంది. గ్రామాలలో నూతన అక్షరాస్యుల కోసం, రాత్రి బడులలోనే కొన్ని పుస్తకాలూ అమర్చి ఉంచవచ్చు. అన్ని గ్రామాలలోనూ గ్రంథాలయాల ఏర్పాటు జరిగే వరకూ, వీలయినంత ఎక్కువ సంఖ్యలో సంచార గ్రంథాలయాలను నిర్వహించ వలసిన అవసరం ఉంది.

## సంచార గ్రంథాలయాలు

పట్టణాలలో పాఠకుల అవసరాలను అనుసరించి - "Mohammad goes to the Mountain" అనేరీతిగా, పాఠకులు గ్రంథాలయానికి వెళ్ళటం జరుగుతోంది.కానీ, గ్రామీణుల పరిస్థితులను, అవసరాలను దృష్టిలో ఉంచుకుని -" Mountain should come to mohammad" అనే రీతిగా, గ్రంథాలయమే గ్రామీణుల ఇంటిముందుకు రావాలి. పాఠకుల కోసం సంచార గ్రంధాలయాలు పల్లెటూళ్ళకు పరుగులు తీయాలి.

మరి ఆ సమయంలో గ్రామ ప్రజలు పనులకు వెళతారు కదా! ఇంటి దగ్గర ఉండరు కదా! - అని సందేహాలు కలగవచ్చు. అందుకే సంచార గ్రంథాలయ నిర్వాహకులు ముందుగా ఒక్కొక్క గ్రామంలో ఒక 'ప్రతినిధి'ని నియమించాలి. ఆ 'ప్రతినిధి' ఆ గ్రామవాసులు ఇంటి దగ్గర ఉండే సమయాలలో ఇంటింటికీ వెళ్ళి వాళ్ళతో చర్చలు జరపాలి. వాళ్ళ అభిరుచులు అవసరాలు తెలుసుకోవటానికి సర్వే చెయ్యాలి. పురుషులతో, స్త్రీలతో, వృద్ధులతో, యువకులతో, బాలబాలికలతో జరిపిన చర్చలవల్ల వాళ్ళకు ఎటువంటి పుస్తకాలు కావాలో తెలుస్తుంది. ఎటువంటి పుస్తకాలు చదివే ఆసక్తీ, శక్తీ ఉన్నాయో తెలుస్తుంది.

దానిని బట్టి శాఖా గ్రంథాలయ నిర్వాహకులు కలిసికట్టుగా ఆలోచించాలి; తమ తమ గ్రంథాలయాలనుంచి, వంద లేదా రెండు వందల పుస్తకాల చొప్పున సేకరించవచ్చు. వాటిని సంచార గ్రంధాలయం ద్వారా ఆ ప్రతినిధి చేత పంపుతూ గ్రామీణులకు అవసరమయిన పుస్తకాలు సరఫరా చేయించవచ్చు గ్రామీణుల శక్తిని బట్టి వాళ్ళనుంచి నెలకు రెండు రూపాయలో, అయిదు రూపాయలో, పది రూపాయలో చందా వసూలు చేయవచ్చు.

వారానికి రెండు పుస్తకాల చొప్పున ఒక్కొక్క ఇంట్లో ఇవ్వటం, అవి తీసుకుని మళ్ళీ వేరే పుస్తకాలు ఇవ్వటం - ఇలా సంచార గ్రంథాలయ నిర్వహణ కొనసాగించవచ్చు. నిర్వాహకులు ఆర్థిక వనరులను బట్టి ఈ సంచార గ్రంధాలయం ఒక వాన్ (...) కావచ్చు ఆర్థిక వనరులు లేనప్పుడు సైకిళ్ళమీద, రిక్షాలలోనూ కూడా గ్రమీణులకు పుస్తకాలు సరఫరా చేయించవచ్చు.

## 'ప్రతినిధి' అర్హతలు

సంచార గ్రంధాలయాన్ని నిర్వహించే 'ప్రతినిధి' కేవలం విద్యార్హతలు కలిగి ఉంటే చాలదు. ఆ వ్యక్తిలో ముఖ్యంగా సేవాభావం ఉండాలి. సహనమూ, దీక్షా దక్షతా, అంకితభావమూ

ఉండాలి. గ్రామీణులతో ఆత్మీయంగా కలిసి మెలిసి వ్యవహరించాలి. పుస్తక పఠనంలో వాళ్ళకి ఆసక్తిని, జిజ్ఞాసను కలిగించాలి. వాళ్ళు తీరికగా ఉన్నప్పుడు కథలు చెపుతూ పాటలు వినిపిస్తూ వాళ్ళ చేత పాటలు పాడిస్తూ వాళ్ళ మనస్సులకు ఆహ్లాదం కలిగించా. పగలంతా పాటుపడి అలసిపోయిన పల్లె ప్రజలు తమ శ్రమను మరిచిపోయేటట్లు చేయాలి. క్రమంగా వాళ్ళ దృష్టిని పుస్తక పఠనం వైపు మరలించాలి. చిన్న చిన్న నాటికలు, బుర్ర కథలు వాళ్ళకు నేర్పి - పండుగ సమయాలలో వాళ్ళ చేతనే ప్రదర్శింప జేయాలి. అలా చేయటం వల్ల, గ్రామీణులలో అంతర్లీనంగా నిద్రాణంగా ఉండే కళాత్మకమైన శక్తుల వికాసానికి దోహదం చేసినట్లవుతుంది. తద్వారా వాళ్ళ మనస్సును విజ్ఞాన పథంపైపు మరలించవచ్చు

## గ్రామీణులకు అవసరమయ్యే పుస్తకాలు

గ్రామీణులకు, కాలక్షేపానికి చదివే చౌకబారు పుస్తకాల అవసరం ఉండదు. 'ప్రతినిధి' చేసిన సర్వేను అనుసరించి వాళ్ళకు ఎటువంటి పుస్తకాలు అవసరమవుతాయో నిర్వాహకులకు తెలుస్తుంది.

స్వంత పొలాలు ఉండీ, లేదా కౌలుకు తీసుకునీ - వ్యవసాయం చేసుకునేవారికి - పంటలు పండించటంలో నూతన విధానాలు, కొత్త కొత్త వ్యవసాయ పరికరాలు, ఎరువులు పురుగుల మందులను గురించి తెలుసుకోవలసిన అవసరం ఉంటుంది. వ్యవసాయానికి సంబంధించిన అన్ని విషయాల్లోనూ వాళ్ళకు సమగ్రమైన పరిజ్ఞానం ఉండాలి. అందుకే వాళ్ళు స్వయంగా చదివి తెలుసుకుని ఆచరణలో పెట్టటానికి వీలుగా సులభశైలిలో రచించిన పుస్తకాలను సంచార గ్రంథాలయం ద్వారా వారికి అందించాలి. ఆ పుస్తకాల ఉపయోగాన్ని గురించి కూడా ముందుగా 'ప్రతినిధి' వాళ్ళకు వివరించాలి. అలాగే, కోళ్ళ పెంపకం, పశువుల పెంపకం, పరిశుభ్రత మొదలైన విషయాలను గురించిన పుస్తకాలు కూడా వాళ్ళకు చాలా అవసరం.

గ్రామంలో చెరువు ఉంటే - ఆ చెరువులోనే పశువులను కడుగుతారు - బట్టలు ఉతుకుతారు - యువకులు పిల్లలు చెరువులో ఈతలు కొడుతూ ఆడుకుంటారు.చెరువునీరు ఆవిధంగా కలుషితమైపోతుంది. ఆ చెరువునీళ్ళే బిందెలతో ఇంటికి తెచ్చుకుని తాగటానికి వాడుకుంటారు. అలా కలుషితమైన నీళ్ళు తాగితే అనేక రకాల వ్యాధులు వస్తాయని వాళ్ళకు తెలియదు. ఆ నీటిని బాగా మరగకాచి చల్లార్చి వాడుకోవాలని గ్రామీణులకు తెలియదు. కనుక, తాగే నీటి శుభ్రతను గురించి తెలిపే పుస్తకాలను వాళ్ళకు అందించాలి.

అలాగే, సమతులాహారం గురించి - అందుబాటులో ఉండే అన్ని రకాల ఆహార పదార్థాలు తీసుకోవాలని వాళ్ళకు తెలియాలి. పప్పుదినుసులు, ఆకు కూరలు, కాయగూరలు, పాలు, పండ్లు, గుడ్లు, చేపలు, మాంసము మొదలైనవి తీసుకోవాలనీ, తక్కువ ధరలో దొరికే

పదార్థాలలో కూడా పోషక విలువలు కలిగినవి ఉంటాయని తెలియాలంటే వాళ్ళకు ఆహారాన్ని గురించీ, ఆరోగ్యాన్ని గురించీ రచించిన పుస్తకాలు సరఫరా చేయించటం అవసరం.

ప్రత్యేకంగా స్త్రీల కోసం, - పిల్లల పెంపకం, పిల్లల ఆరోగ్యం విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు, వంటా వార్పు, ఊరగాయలు - పచ్చళ్ళ తయారీ, కుట్టుపని, కొవ్వొత్తులు - అగరువత్తుల తయారీ, బట్టల అద్దకం, ఇంకా - గర్భవతులు తీసుకోవలసిన జాగ్రత్తలు, కుటుంబ నియంత్రణ పద్ధతులు - మొదలైన విషయాలను గురించిన పుస్తకాల సరఫరా జరగాలి. బాలల కోసం - చిత్రకథలు, చిన్ననాటికలు, తేలిక భాషలో రచించిన పాటలు, హాస్య కథలు ఉండాలి. యువతీ యువకులకోసం - ముఖ్యంగా వివాహ వయస్సు, కుటుంబ నియంత్రణ, ఇంకా బుక్ బైండింగు, స్క్రీన్ ప్రింటింగు, టైలరింగ్, సైకిలు రిపేరింగు, (పొలాల్లో) మోటారు రిపేరింగు - మొదలైన విషయాలను గురించిన పుస్తకాలు అందజేయాలి. వృద్ధుల కోసం - సులభ శైలిలో వ్రాసిన వచనరామాయణ భారతాలు, వచన భాగవతం, భగవద్గీత వంటివి సరఫరా చేయాలి. "గ్రామీణుల అభివృద్ధికోసం ప్రభుత్వం పథకాల"ను గురించిన పుస్తకాలు కూడా సరఫరా చేయాలి.

## సంచార గ్రంథాలయాల నిర్వహణ బాధ్యతలు, సహకారాలు

సంచార గ్రంథాలయాల నిర్వహణ బాధ్యతా, భారమూ అంతా ప్రభుత్వం మీదనే ఉన్నదని భావించి ఇతరులు నిర్లిప్తంగా ఊరుకోవటం సమంజసం కాదు. ఆర్థిక బలం ఉన్న స్వచ్ఛంద సంస్థలు, సమాజంలోని పెద్దలు, ధనికులు కూడా తమ వంతు సహాయం అందించవలసిన అవసరం ఎంతయినా ఉంది. అలాగే వ్యాపారస్థులు, పారిశ్రామిక వేత్తలు, చలనచిత్ర నిర్మాతలు, సినీనటులు అందరూ నడుంకట్టి ముందుకు రావాలి. వారి వారి స్తోమతకు తగినట్లు ఆర్థిక సహాయం చేసి, సంచార గ్రంథాలయాల నిర్వహణకు యథాశక్తి చేయూత ఇవ్వాలి. ప్రతి గ్రామానికీ, (గిరిజన ప్రాంతాలకు కూడా) సంచార గ్రంథాలయాలు పరుగులు తీయాలి.

*"వచ్చిందీ వచ్చిందీ పుస్తకాల బండీ*
*తెచ్చిందీ మనకోసం మంచి మంచి పుస్తకాలు" -*

అంటూ గ్రామీణులూ, గిరిజనులూ ఆనందంతో వాళ్ళకు కావలసిన పుస్తకాలు అందుకోవాలి. అన్ని గ్రామాలలోనూ గ్రంథాలయాల ఏర్పాటు కాలేదనే కొరతను ప్రస్తుతానికి ఈ విధంగా తీర్చవచ్చు.

# 3.11 అందాలకు అందాలు గ్రంథాలే

- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

మానవుడు సాధించిన మహత్తర సాధనం భాష. అతడు కోరుకున్న బంగారు వరం భాష. మానవుణ్ణి జంతుకోటినుంచి వేరు చేసేది భాష. పశుత్వంలో పడిపోకుండ భద్రంగా కాపాడేది భాష. శారదాస్వరూపం భాష. నాగరికతకు నాంది పలికేది భాష. సంస్కృతి మూర్తిని సమలంకరించేది భాష. భాష లేకుంటే భావవినిమయం లేదు. భావ ప్రచారం లేకుంటే వ్యవహారం లేదు. వ్యవహారం లేకుంటే ప్రపంచమే లేదు.

ఇలా ప్రపంచ వ్యవహారానికి ప్రాణభూతమైన ఈ భాషకు రెండు రూపాలున్నాయి. ఒకటి - వినిపించటం, మరొకటి కనిపించటం. కనిపించే రూపాలే పుస్తకాలు. శతాబ్దాలుగా ప్రపంచాన్ని పరిపాలిస్తున్నవి పుస్తకాలే. పుస్తకాలంటే తెలియని జాతి అనాగరిక జాతిగా - ఆటవిక జాతిగా నాగరికలోకం ముద్రవేస్తుంది. పుస్తక సంఖ్యను బట్టే ఒక జాతిని, ఒక దేశాన్ని, ఒక ఇంటిని, ఒక వ్యక్తిని గొప్పగా భావిస్తున్నది సమాజం. అనేక రాజ్యాలు పుట్టినాయి. గిట్టినాయి. చక్రవర్తులూ మహా రాజులూ వచ్చినారు; పోయినారు; శాసనాలు వచ్చినాయి పోయినాయి. కాని ఆనాటి పుస్తకాలు మాత్రం ఈనాటికీ కళకళలాడుతూ అక్షరాలై, అనేక విషయాలను మనకందించి, మనకు గుణపాఠాలు బోధించి, మనలను వెలుగుబాటల్లో నడిపిస్తూనే ఉన్నాయి. మానవుని జీవితం తరువాత, మళ్ళీ అంత ఆశ్చర్యకరమైన విషయం పుస్తకమే.

పుస్తకాలే మనకు ఎన్నో దేశాలను చూపిస్తున్నాయి. దేశదేశాల సాంఘిక చరిత్రలను, వాటి సంస్కృతులను పరిచయం చేస్తున్నాయి. ప్రపంచాన్ని తమ సువిశాల హృదయంతో సుందర భావాలతో ప్రభావితం చేసిన - చేస్తున్న ఎందరో మహనీయులను మన కళ్ల ముందు నిలుపుతున్నాయి. వాళ్లు ఊహించి, రూపకల్పన చేసిన కమనీయలోకాలకు మనలను తీసికెళ్లుతున్నాయి. విశ్వంలోని శాస్త్రవేత్తలూ మహాకవులూ కళాకారులూ వేదాంతులూ చక్రవర్తులూ మహాత్ములూ ప్రవక్తలూ అందరూ మనకు కనిపిస్తారు పుస్తకాల్లో. ఎంత చిత్రం! దేశాలూ కాలాలూ పాత్రలూ రంగుల చిత్రాల్లాగా కాపురం చేస్తుంటాయి పుస్తకాల్లో. దేశదేశాల నదులన్నీ ప్రవహిస్తుంటాయి పుస్తకాల్లో. వాటిని చూడడమే కాదు. వాటితోపాటు ప్రవహించవచ్చు. ఉత్తుంగ పర్వత శిఖరాలు అగుపిస్తే పుస్తకాల్లో. వాటిని చూసి మనమూ అంతెత్తు పొంగుతాం. భయంకర మహారణ్యాలూ పచ్చపచ్చని మైదానాలూ కనిపిస్తై పుస్తకాల్లో.

వాటిలోకి మనం ప్రవేశించి హాయిగా విహరించిరావచ్చు. లక్షల పక్షులూ ఎగురుతూ అగుపిస్తే పుస్తకాల్లో. ఇలా పుస్తకాలంటే భూమ్యాకాశాల మధ్యనుండే సమస్త మన్నమాట. ఇలా విశ్వాన్నే తనలో పొదుగుకున్న పుస్తకాలు ఎంత గొప్పవి! అందుకే పుస్తకాలను చదువుకుంటే విశ్వమంతా ఒకే కుటుంబమవుతుంది.

అయితే కొన్ని పుస్తకాలు మనలను దూరం నుంచే పలుకరిస్తాయి. మరికొన్ని దగ్గరగా వస్తాయి. మరికొన్ని మనలోనికి వెళ్లిపోతాయి. కొన్ని మనలోకి వెళ్ళి రక్తంలో కలిసిపోతాయి. శక్తిగా మారిపోతాయి. మన జీవితాలను నడిపిస్తె. మనకు ఊపిరులై నిలుస్తాయి. మన అభిరుచులకు అందాల పూలబాటలు వేస్తాయి.

సమాజంలో అనేక భాషలు తెలిసిన వాడు గొప్పవాడు. అనేక పుస్తకాలున్నవాడు గొప్పవాడు. అనేక పుస్తకాలు వ్రాసినవాడు గొప్పవాడు. అనేక పుస్తకాలు చదివేవాడు గొప్పవాడు. అంటే - ఒక్క మాటలో చెప్పాలంటే - గొప్ప తనం పుస్తకం వల్ల వస్తుందన్నమాట.

మనం ఇంటికి రంగులు వేస్తాం. అలంకరిస్తాం. ఇంట్లో రకరకాల వస్తువులను అత్యాధునికంగా, అందంగా అమరుస్తాం. అల్మారాలూ, కుర్చీలూ, సోఫాసెట్లూ, రేడియోలు, టీవీలు, డైనింగు టేబుళ్లూ, ఫ్రిజ్జులూ, పంఖాలూ, లైట్లూ ఎన్నో ఎన్నెన్నో ఏర్పాటు చేస్తాం. మంచిదే - కంటికీ - ఒంటికీ. కాని ప్రపంచాన్ని తన గుప్పిట్లో పట్టుకున్న, గుండెల్లో పెట్టుకున్న పుస్తకాలు మన ఇళ్లల్లో ఉండకపోతే ఎలా? మానవజాతిని ఒక్కటి చేసే పుస్తకాలు ఉండకపోతే ఎలా? మనల్ని అనుక్షణం పచ్చగా పలుకరిస్తూ, మన మానవతకు మారాకులు తొడిగే పుస్తకాలు లేకపోతే ఎలా?

మానవునికి మస్తకం ఎలాగో, ఇంటికి పుస్తకం అలాగే. నిజానికి మన ఇళ్లకు ఆరిపోని దీపాలు పుస్తకాలే. వాడిపోని పూలు పుస్తకాలే. అందాలకు అందాలూ, డెందాలకు అలంకారాలూ గ్రంథాలే.

# 3.12 గ్రంథాలయవ్యవస్థ - తీరుతెన్నులు

- జి.వి.జి.కె.. చంద్రమౌళీశ్వరరావు,

గ్రంథాలయ వ్యవస్థ 1900 సంవత్సరానికి ముందే వేళ్ళూనినా, దాని వికాసం 1906లో ప్రారంభమైంది. మన దేశంలో బరోడా మహారాజు శ్రీ శాయాజీ గైక్వాడ్ మొదట్లో దీనిని ఒక ఉద్యమంగా చేపట్టారు పాఠశాలలున్న ప్రతి గ్రామంలో గ్రంధాలయ స్థాపనకు ఏర్పాటు చేశాడాయన. నాటి పరిపాలన పరాధీనంలో ఉండటం వల్ల ఈయన ఉద్యమం సరియైన ఊపునందుకో లేకపోయింది. బహు స్వల్ప సంఖ్యలో గ్రంథాలయాల స్థాపన జరిగింది. మన ఆంధ్ర దేశంలో ఈ దశలోనే గ్రంథాలయాలు ప్రాచుర్యం పొంది పౌర గ్రంథాలయాలుగా రూపుదిద్దుకోసాగాయి. శ్రీ వీరేశలింగం గారు చేపట్టిన సంఘ సంస్కరణోద్యమ ఫలితంగా మన రాష్ట్రంలో గొప్ప సంచలనం చెలరేగి, మాతృభాషపై అభిమానం మొలకెత్తింది. తెలుగులో ఎన్నెన్నో గ్రంధాలు, పత్రికలు వెలువడినవి. వాటి ప్రచురణ ఒక విధంగా గ్రంథాలయాల స్థాపనకు దోహదపడింది. క్రమంగా మన రాష్ట్రంలో గ్రంథాలయాల సంఖ్య గణనీయంగా పెరిగింది. 1913 నాటికి పట్టణాలతో పాటు కొన్ని గ్రామాల్లో కూడా నెలకొన్నాయి.

10 ఏప్రియల్ 1914న ఆంధ్రదేశ గ్రంథాలయాల నిర్వాహకులు బెజవాడలో కవి శేఖర చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారి అధ్యక్షతన ఒక మహాసభను నిర్వహించారు. గ్రంథాలయవ్యవస్థపై పలు అంశాలను సుదీర్ఘంగా చర్చించి, "ఆంధ్ర దేశ గ్రంధభాండాగార సంఘము" అనే పేరుతో ఒక సంఘాన్ని స్థాపించారు ఈ సంఘానికి శ్రీ మోచర్ల రామచంద్ర రావును అధ్యక్షులుగా, సర్వశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, సూరి వెంకటనరసింహశాస్త్రిలను ఉపాధ్యక్షులుగా, అయ్యంకి వెంకటరమణయ్య, నాళం కృష్ణారావులను కార్యదర్శులుగా ఎన్నుకున్నారు. ఈ సంఘస్థాపనతో ఆంధ్ర దేశంలో గ్రంథాలయోద్యమం ఊపందుకొని గ్రంథాలయాల వ్యాప్తి జరిగింది. ఈ ఉద్యమానికి దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు కూడా ఇతోధికంగా చేయూతనిచ్చి తోడ్పడ్డారు. వీరి సారధ్యంలో ఆంధ్ర గ్రంధమాల ప్రారంభించబడి ఎన్నో ఉత్తమగ్రంథాలు ప్రచురితమయ్యాయి. గ్రంథాలయాలకు వీటిని ప్రత్యేక తగ్గింపు రేట్లపై సరఫరా చేయటం విశేషం.

క్రమంగా పుస్తకాలు, పత్రికల ప్రచురణలు పెరగటంతో గ్రంథాలయాలు కూడా అధికమయ్యాయి. చివరకీ గ్రంథాలయాలన్నీ ఎన్నో ఉద్యమాలకు అండగా నిలిచాయి.

సంఘసేవను ప్రోత్సహించాయి. పాఠకులను ఆకర్షించేందుకు వార్షికోత్సవాలు, సాంస్కృతిక కార్యక్రమాల వంటివి నిర్వహించాయి. ఆంధ్రదేశ గ్రంథభాండాగార సంఘం, కొంత కాలానికి దాని పేరు, "ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం"గా రూపుదిద్దుకున్నది. దాని ఆధ్వర్యంలో "గ్రంథాలయ సర్వస్వము" అనే పేరుతో మొదట్లో త్రైమాసిక పత్రికగా ప్రారంభమై, దరిమిలా ద్వైమాస పత్రికగా, ఇప్పుడు మాసపత్రికగా వెలువడుతోంది. గ్రంథాలయ ఆవశ్యకత, వయోజన విద్యకు చెందిన వివిధ విషయాలతో పాటు, సాహిత్యం ఆధ్యాత్మికం, గ్రంథసమీక్షల వంటి పలు విషయాల్ని పాఠకులకు అందిచటం ఈ పత్రిక ధ్యేయం.

ఈ సంఘ నాయకులు గ్రంథాలయ నిర్వాహకులకు అవసరమైన శిక్షణ నిచ్చి, ఎందరో సుశిక్షితులైన కార్యకర్తలను తయారు చేశారు. వారంతా ఎంపిక చేసుకున్న గ్రామాలలో గ్రంధాలయ యాత్రల్ని నిర్వహించి, గ్రంధాలయాల స్థాపనకు వాటి పునరుద్ధరణకు ఎనలేని కృషి చేశారు. ఒక ఉద్యమంగా నడిచిన ఈ ప్రచార ప్రబోధాల ద్వారా సంఘం చేసిన కృషికి రాష్ట్ర ప్రభుత్వం స్పందించి, ప్రతి ఏటా గ్రంథాలయాలకు గ్రాంట్లను ఇచ్చే శాసనాన్ని చేసింది. రిజిస్ట్రేషను రుసుమును కూడా గణనీయంగా తగ్గించింది. గ్రంథాలయ సంఘం వారు చేసిన అవిరళ కృషి ఫలితంగా ఒకప్పుడు వందల సంఖ్యలో ఉన్న గ్రంథాలయాలు ఈనాడు వేల సంఖ్యకు చేరుకున్నాయి. శాఖోపశాఖలై స్థానిక సంస్థల, సహకారసంఘాల, దేవాలయ కమిటీల ఆధ్వర్యంలో గ్రంథాలయాలు నిర్వహించబడసాగాయి. దేశ స్వాతంత్ర్యానంతరం పౌర గ్రంథాలయ స్థాపనకు ఒక శాసనం చేయబడి, 1950లో అమలు చేయబడింది. దీని ప్రకారం రాష్ట్ర గ్రంథాలయ కమిటీ ఏర్పాటు జరిగింది. జిల్లాల్లో జిల్లా గ్రంథాలయ సంస్థలతో బాటు వాటి ఆధ్వర్యంలో స్థానిక గ్రంథాలయాలను నెలకొల్పారు. స్థానిక సంస్థలు వసూలు చేసే ఆస్థి పన్ను పై, గ్రంథాలయ సెస్సును దామాషాగా వసూలు చేసి అంతే మొత్తాన్ని ప్రభుత్వ గ్రాంటుగా కలిపి, ఆయా గ్రంధాలయసంస్థలకు ఇచ్చే ఏర్పాటు చేస్తూ చట్టాన్ని ఆమోదించింది ప్రభుత్వం.

ఆంధ్ర గ్రంథాలయ సంఘానికి అనుబంధంగా 1946లో ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు నొకదానిని ఏర్పాటు చేశారు. ఈ ట్రస్టు కార్యకలాపాల్లో గ్రంథాలయ భవన నిర్మాణం,గ్రంథ ప్రచురణ, గ్రంథాలకు పుస్తకశాలనిర్వహణ మొ॥వి ప్రధానాంశాలు. ఈ ట్రస్టువారు ఎన్నో అమూల్య గ్రంథాలను వెలువరించారు. ఇలా అనేక సంఘ ప్రతినిధులు వివిధ గ్రంథాలయ కార్యక్రమాలను చేపట్టినా, ప్రభుత్వ పరంగా సరైన ఆదరణ లేకపోవడంతో అనేక అవరోధాలు ఎదురై వాటి పురోగతి కుంటుపడింది. అయినప్పటికి, కార్యకర్తల అకుంఠిత దీక్షవల్ల గ్రంథాలయోద్యమానికి చక్కని బాటవేయటం జరిగింది. స్వచ్ఛంద సేవకులు నడుం బిగించి ముందుకు సాగిన ఫలితంగా ప్రభుత్వం కూడా బాధ్యత వహించి శాసనం చేసింది.

ఇంతటి ఘన చరిత్ర కలిగిన గ్రంధాలయోద్యమం, అనేక కారణాల వల్ల కుంటు బడటం దురదృష్టం. ఒకనాటి కార్యకర్తల్లోని ఉత్సాహం సద్దుమణిగిందనిపిస్తోంది. గ్రంథాలయాల్లో భద్రపరిచే గ్రంధాల్లో పాఠకుల కాలక్షేపానికి పనికి వచ్చేవే అధిక సంఖ్యలో లభ్యమవుతున్నాయే తప్ప మేధావులకు పండితులకు, ఉపకరించేవి అందుబాటులో ఉండటంలేదు. ఈ విషయంలో ప్రభుత్వం కూడా ఉదాసీనంగా వ్యవహరిస్తున్నది. పౌర గ్రంథాలయాలు బహుళార్థకంగా ప్రజలకు ఉపయోగపడాలంటే, వాటి నిర్వాహకులు అందరి అభిరుచుల కనుగుణంగా మసలుతూ, సాన్నిహిత్యాన్ని పెంచుకొని, సేవాభావంతో మెలగాలి. 'పని చేయుటదైవారాధన' ' గా ప్రేమ, ఆప్యాయతలకు వారు అంకితమైన నాడు అవి నిజంగా గ్రంథాలయాలు కాక, దేవాలయాలవుతాయి.

ప్రభుత్వం పరంగా ఎన్ని వనరులు సమకూర్చినా, నిర్వాహకుల పాత్ర అతి ముఖ్యమైంది. కనుక అర్థ బలంతో పాటు, అంగబలంలో సేవాభావం తప్పనిసరి. దీనిని ప్రియసోదరుడు శ్రీ ఎస్. పాండురంగారెడ్డి గ్రంథాలయనిర్వాహణలో ఆచరించి చూపి, అందరికీ ఆదర్శ ప్రాయులయ్యారు. 30 నవంబరు 1995 న ఆయన పదవీ విరమణ చేసేవరకు. తన విధి నిర్వహణలో అనేక పదవులు నిర్వహించి, గ్రంధాలయాల అభివృద్ధికి ఎనలేని కృషి చేసిన మేరు నగధీరుడు. తన ప్రయత్నంలో శ్రీ రెడ్డి గారికి ఎన్ని అవరోధాలు ఎదురైనా, నిర్విరామంగా తన శక్తి యుక్తులను ఉపయోగించి ప్రజలకు, గ్రంథాలయాలకు మధ్య ఒక వారధిగా నిలిచారు. ఆయనలోని సేవా తత్పరత వల్ల, నిస్వార్థసేవానిరతి వల్ల అశేష పాఠకుల హృదయాల్లో సహృదయుడిగా ముద్రవేసుకోగలిగారు.

కుంటుపడిన గ్రంథాలయ వ్యవస్థను పునరుజ్జీవింప చేయుటకు, ఈనాడు శ్రీపాండురంగా రెడ్డి వంటి దీక్షాతత్పరులైన కార్య నిర్వాహకుల అవసరం ఎంతో ఉన్నది. ప్రజా సహకారాన్ని సాధించి, అందరికీ అందుబాటులో ఉండే మిత్రుడిగా, నిత్య సహచరుడిగా, ఒక సేవకుడిగా ప్రతి గ్రంథాలయాధికారి పనిచేసినప్పుడు పౌర గ్రంథాలయాలన్నీ తప్పక పవిత్ర దేవాలయాలవుతాయి.

ప్రభుత్వ సహకారలోపం వల్ల అసలే అంతంతమాత్రంగా నడుస్తున్న పౌర గ్రంథాలయా లీనాడు సిబ్బంది జీతభత్యాలు సైతం భరించే స్థితిలో లేనందున ప్రజావసరములను తీర్చే సాహిత్య గ్రంథాలను సమకూర్చలేక పోతున్నాయి. అధునిక విజ్ఞానం అపారంగా పెరిగిన ఈతరుణంలో ఎందరో తమ రచనలను సాగిస్తున్నా, నానాటికీ విపరీతంగా పెరుగుతున్న ఖర్చులను భరించలేక అవన్నీ అముద్రితంగా ఉండిపోతున్నాయి. అటువంటి రచనలను వెలుగులోకి తెచ్చి అందరికీ అందుబాటులో ఉంచాలంటే, ప్రస్తుత వ్యవస్థ మారాలి.

ప్రభుత్వంపై ఆధారపడకుండా గ్రంథాలయాలు స్వతంత్ర ప్రతిపత్తి కలిగి, సహకార రంగం ప్రాతిపదికలో పని చేసే ప్రయత్నం జరగాలి.

గ్రంథాలయం, రచయితలకు పాఠకులకు మధ్య ముఖ్య వారధి. పాఠకుల అవసరాలకు అనుగుణ్యంగా ఉపయోగ పడే పుస్తకాలను అందుబాటులో ఉంచేస్తేమత దానికి తప్పని సరి. ఉన్న కొద్ది వనరులతో కొనుగోలు చేస్తున్నపుడు పుస్తకాల పంపిణీ విభాగంలో జరిగేలొసుగులు, అవకతవకల వల్ల ఆ విధానం ఘోరంగా విఫలమై పాఠకులకు అవసరమైన గ్రంథాలు అందుబాటులోకి రాకుండా పోతున్నాయి. అందువల్ల ఆర్థిక వనరులను పుష్కలంగా సమీకరించుకొనే స్వేచ్ఛను ఆయా జిల్లా గ్రంథాలయ సంస్థలకు వప్పగిస్తూ ప్రభుత్వం తగు శాసనాన్ని రూపొందించాలి. గత నాలుగైదేండ్లుగా నిలిపివేసిన గ్రాంట్లను తక్షణం విడుదల చేసి, వాటి ఆర్థిక పరిపుష్టిని పెంచకపోతే పుస్తకాలను కొనుగోలు చేయలేక పోవటమే కాక, తమ సిబ్బంది జీతభత్యాలను సైతం చెల్లించలేని పరిస్థితి ఏర్పడుతుంది

పుస్తక పంపిణీ వ్యవస్థలో అవకతవకలు రూపుమాపాలంటే, రచయితల రచనలను అందుబాటులోనికి తేవాలంటే గ్రంథాలయోద్యమం పూర్వవైభవంతో అలరారాలంటే, ప్రభుత్వ ప్రమేయం లేని స్వేచ్ఛా పాలనాధికారం ఆయా గ్రంథాలయ సంస్థలకు ఉండాలి. గ్రంథాలయ సంస్థల పాలక వర్గపు ఏర్పాటు సహకార రంగ ప్రాతిపదికన జరగాలి. ఆయా గ్రంథాలయ సంస్థలే స్వయంగా జిల్లా స్థాయిలో సహకార ప్రింటింగు ప్రెస్సులను నెలకొల్పుకొని, రచయితల సాహితీ సంస్థల అమూల్య రచనలను ప్రచురించినచో గ్రంథాలయాల ప్రాముఖ్యత పెరుగుతుంది. దీనికి సంబంధించిన శాసనాన్ని ప్రభుత్వం అమలు చేసేట్లు గ్రంథాలయోద్యమ నిర్వాహకులు, మేధావులు, కార్య కర్తలు చొరవ తీసుకొని ఒక ఉద్యమాన్ని సాగిస్తేనే తప్ప ఈ వ్యవస్థ బాగుపడదు. కనుక ప్రతి ఒక్కరు, తక్షణం నిధుల విడుదలకై ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి, గ్రంథాలయ వ్యవస్థను ప్రక్షాళన చేసే కార్యక్రమానికి చేయూతనివ్వ వలసిందిగా విజ్ఞప్తిచేస్తున్నాను ఆచరణలో ఇలాంటి లక్షణాలను పుణికిపుచ్చుకొని, ఆచరించి చూపిన శ్రీ ఎస్. పాండురంగారెడ్డి గారి సేవలు ఆ శాఖలో పని చేసే ప్రతి అధికారికి ఆదర్శ ప్రాయం కావాలని ఆకాంక్షిస్తూ, అనుభవం పండిన శ్రీ పాండురంగా రెడ్డిగారి వంటి మేధావులు ఈ దిశగా గ్రంథాలయోద్యమాన్ని ముందుకు నడిపిస్తారని ఆశిస్తున్నాను

# 3.13 గ్రంథాలయాలు - స్త్రీలు

- మల్లాది సుబ్బమ్మ,

ఏ ఉద్యమానికయినా బీజ ప్రాయమయినది గ్రంథాలయోద్యమం. ఆంధ్ర కోస్తాలోగాని, తెలంగాణాలోకాని గ్రంథాలయోద్యమాలే రాజకీయోద్యమాలకు పునాదులు వేశాయి. తెలుసుకుందామనే కుతూహలం ప్రతి అక్షరాస్యుని గ్రంథాలు చదవడానికి ప్రేరేపిస్తుంది. కొత్తగా అక్షరాలు నేర్చుకున్న వ్యక్తి కుతూహలం వర్ణనాతీతం. అక్షరాలు కూడపలుక్కుని ఆ వ్యక్తి చదువుతున్నప్పుడు అతనికి కలిగే ఆనందం అంతా ఇంతా కాదు. ఒకనాడు వందకి 10 మందే అక్షరాస్యులుగా వున్నపుడు ఆ పదిమందిని యితరులు గొప్పగా తలచే రోజులలో గ్రంథాలు చదవగలిగిన వ్యక్తికి సమాజంలో వుండే గౌరవం యింతింత కాదు. ఆ రోజుల్లో స్త్రీలు అయిదో క్లాసు వరకు చదివితే అంటే ప్రాథమిక విద్యను అభ్యసిస్తే చాల గొప్ప క్రింద లెక్క. ఆ మాత్రం చదువుతో వారు భారత భాగవతాలు, రామాయణాలు పఠించగలిగేవారు. పాఠశాలలో వల్లెవేసిన రుక్మిణీకళ్యాణం, సుమతీశతకం, కుమారశతకం కాక అశేషంగా పాటలు పాడేవారు. స్త్రీల పాటల పుస్తకాలు పెద్ద అక్షరాలలో అచ్చు అయ్యేవి. వాటిని చవకగా అమ్మేవారు. పాటలతో, శతకాలతో ప్రారంభమయిన మహిళల గ్రంథ పఠనం అంతటితో ఆగలేదు. నవలా పఠనం సర్వసామాన్యమయింది. చదువరుల ఉత్కంఠను రేకెత్తించే అపరాధ పరిశోధక నవలలు మహిళలను ఎక్కువగా ఆకర్షించేవి. ఇలా మహిళలు అచ్చులో పడ్డ ప్రతి పుస్తకాన్ని ఆసాంతం చదవడం నేర్చుకున్నారు.

గ్రంథాలయోద్యమం, వయోజనోద్యమం రెండూ కవల పిల్లల వంటివి. ఒకదాని కొకటి చేదోడు వాదోడుగా మనుగడ సాగిస్తున్నాయి. నిరక్షరాస్యులయిన ప్రజలు కూడా విద్యావంతులయి వివేకాన్ని ప్రదర్శించ గలగటం ఆనాటి వయోజన విద్యా ఫలితమే. నిరక్షరాస్యులు వివేకవంతులు కావడం అబ్బురమైనా అసాధ్యం కాదు. మొగలు సామ్రాట్టు అక్బర్, ఇస్లాం మత స్థాపకుడు మహమ్మదు ప్రవక్త నిరక్షరాస్యులు. వారి ప్రపంచజ్ఞానం వర్ణనాతీతం. వారు పెద్ద వ్యవహర్తలు. వారి జ్ఞానసంపద అపారం. వారు రాజ్యాలను పాలించారు. ప్రజలను శాసించారు. సామాజిక ఆచారాలను కట్టుదిట్టం చేశారు. పాలనా వ్యవహారాలలో క్రొత్త నిబంధనలకు రూపురేఖలిచ్చారు. నిరక్షరాస్యులకే అంత ప్రతిభ వుంటే, విద్యావంతులు, చదువరులు జ్ఞానతృష్ణ కలిగియుంటే ఎంతటి ప్రతిభావంతులు కావచ్చును?

పూర్వీకులు తమ అనుభవసారాన్ని గ్రంథరూపంగా వెలువరిస్తే, తమ పాండిత్యాన్ని

ప్రదర్శిస్తే, తమ వివేకాన్ని పుస్తకాలలో ఆవిష్కరిస్తే తర్వాతి తరంవారు మరల జీవిత పాఠాలను ఓనమాలతో ప్రారంభించకుండా పూర్వీకుల భుజస్కంధాలపై కూర్చొని తమ జీవితాలను ఫలప్రదంగా సాగించగలరు. గ్రంథపఠనం కేవలం కాలక్షేపానికి కాదు. జ్ఞాన సముపార్జనకు సాధనం. పాతతరం మహిళలకు ఈనాటి స్త్రీలవలె చేతిలో పైసలు ఆడేవి కావు. వారు తండ్రిని, అన్నదమ్ములను, పతిని అభ్యర్థించి పైకం తీసుకునేవారు. అదయినా చిన్న మొత్తమే. అలాంటివారు కొనుగోలుచేసి గ్రంథపఠనం చేయడం కష్టతరం. గ్రంథాలయోద్యమం తొలిరోజుల్లో ప్రారంభింపబడిన గ్రామ, పట్టణ గ్రంధాలయాలు వారికి పుస్తకాలను అందుబాటులోకి తెచ్చాయి. ఆనాడు సంచార గ్రంధాలయాలు లేకున్నా తమ్ముడినో, మరిదినో, కాకపోతే భర్తనో అడిగి పుస్తకాలు గ్రంథాలయాలనుండి తెప్పించుకొని మహిళలు చదివేవారు.

గ్రంధపఠనం వల్ల తమ దేశస్థితిగతులు, విదేశీ ప్రజల ఆచారవ్యవహారాలు, పాలనారీతులు అన్నీ చదువరులకు అవగతమయ్యేవి. పాశ్చాత్యుల పూనిక, పట్టుదల వారికి ఎభ్రాంతి కలిగించేవి. వారు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై శాసించిన విప్లవాల చరిత్ర వారిని ఉత్తేజపరిచేది. ఇంగ్లండులో క్రీ.శ 1688లో జరిగిన 'రక్తపాత రహిత విప్లవం', 1776 లో సంభవించిన 'అమెరికను విప్లవం', 1789లో సాగిన ఫ్రెంచి విప్లవం, ప్రథమ ప్రపంచ సంగ్రామం తరువాత టర్కీలో కెమాల్ ఆటాటర్కు నాయకత్వాన వచ్చిన టర్కీ విప్లవం భారత స్త్రీ పురుషులకు జ్ఞానోదయం చేశాయి. ఉత్సాహపరిచాయి. అలా గ్రంధాలయోద్యమం రాజకీయ చైతన్యానికి దారితీసింది. కాంగ్రెసు లాంటి రాజకీయ పార్టీల ఆవిర్భావానికి నాందిపలికింది. 'మీదేశ రాజకీయాలను ప్రభావితం చేసే సిద్ధాంతాలు సూత్రాలు మా దేశానికి కూడా అన్వయించండి అని బ్రిటిషువారిని కోరే స్థితికి భారత ప్రజలు వచ్చారు. స్వరాజ్యం మా జన్మహక్కని తిలక్ మహాశయుడు ఘోషించే దశ కల్గింది. స్వరాజ్యం మా కోర్కెయని మహాత్ముడు ఎలుగెత్తిచాటే సమయం ఆసన్నమయింది. 'సంపూర్ణ స్వాతంత్ర్యం మా డిమాండు' అని ఎస్. శ్రీనివాస అయ్యంగార్, సుభాస్ చంద్రబోసు, పండిత జవహర్‌లాల్ ప్రకటించే కాలం సమీపించింది. కారల్‌మార్క్సు ప్రవచించిన సోషలిజం, సామ్యవాదం ప్రచారంలోకి వచ్చాయి. వాటి సాధన కొరకు పార్టీలు, ఉద్యమాలు ఉద్భవించాయి. ఈ పరిణామానికి గ్రంధ పఠనం - పాఠశాలలో కాని గ్రంథాలయాలలో కాని జరిగినది - కారణభూతమని చెప్పడం అతిశయోక్తి కాదు.

ఆనాడు రాజకీయ చైతన్యానికి దోహదంచేసిన నాయకులే గ్రంథాలయోద్యమాన్ని, వయోజనోద్యమాన్ని వ్యాప్తి చేశారు. ఆంధ్రలో సర్వశ్రీ అయ్యంకి వెంకట రమణయ్య, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, తరువాతి తరంలోని వావిలాల గోపాలకృష్ణయ్య, పాతూరి నాగభూషణం ఆ కోవకు చెందినవారే. తెలంగాణాలో రావిచెట్టు రంగారావు, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు ప్రభృతులు, తరువాతి తరంలోని సర్వశ్రీ కోదాటి నారాయణరావు

ఎం.ఎల్. నరసింహారావు ఆ శ్రేణికి చెందినవారే. ఈనాడు గ్రంథాలయోద్యమం ఇంతగా మండలాలకు, గ్రామాలకు కూడా విస్తరించిందంటే వారు నాటిన బీజాలే కారణం.

గ్రంథాలయ పితామహులు, గ్రంథాలయోద్యమ స్థాపకులు ప్రజలలో గ్రంథాలయాల ఆవశ్యకతను గురించి భావప్రచారం చేసి గ్రంథాలయాలను నెలకొల్పితే, తరువాతి తరంవారు గ్రంథాలయ నిర్వహణ బాధ్యతను చేపట్టారు. స్వరాజ్యం వచ్చిన తదుపరి గ్రంథాలయ శాసనాలు వచ్చి కేంద్ర గ్రంథాలయాలు, జిల్లా గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు ప్రారంభించడం, వాటికి నిధులు కేటాయించడం, వాటిని సుస్థిరం చేయడం జరిగింది. ఈ దశలో జిల్లా గ్రంథాలయ కార్యదర్శుల బాధ్యత పెరిగింది. వారికి మొదట్లో తగినన్ని నిధులను ప్రభుత్వం సమకూర్చింది. కేంద్ర గ్రంధాలయాలకు భవన నిర్మాణం, విస్తరణ కార్యక్రమాలకు ప్రభుత్వం దోహదం చేసింది. ఈ దశలో ఎనలేని సేవచేసినవారిలో శ్రీ పాండురంగారెడ్డిగారు అగ్రగణ్యులు. ఈ కాలంలోనే కేంద్ర గ్రంథాలయాలలో మహిళా విభాగాలు, మహిళా పఠన మందిరాలు, సంచార శకటాలు ఏర్పాటయ్యాయి. అవి అందించే పుస్తకాలను స్త్రీలు విరివిగా పఠించడం ప్రారంభించారు. ఈ ప్రక్రియ మహిళల్లో జ్ఞానతృష్ణను పెంచి పోషించింది. అంతేకాదు మహిళలపై గ్రంథాలయాలు శ్రద్ధ చూపడంలో మహిళల రచనలకు గ్రంథాలయాల్లో స్థానం ఏర్పడింది. మహిళా నవలా కర్తలు, వ్యాసకర్తలు, కవయిత్రుల సంఖ్య దినదిన ప్రవర్థమానం అవడంతో వారి గ్రంథాలు గ్రంథాలయాల్లో సముచిత స్థానం, గౌరవం పొందసాగాయి.

శ్రీ పాండురంగారెడ్డిగారికి గ్రంథాలయ నిర్వహణలో సామర్థ్యమేగాక గ్రంథాలయోద్యమంపై మిక్కిలి మక్కువ వుండేది. అంతేగాక ఆయన వస్తుత: మహిళోద్యమంపై సదభిప్రాయం కలిగి వుండి ప్రతిభావంతులయిన మహిళల రచనలను పెక్కింటినితను నిర్వహించిన అన్ని గ్రంధాలయాలకు కొనుగోలు చేసి వాటికి స్థిరమైన ఆవాసయోగ్యత కల్గించేవారు. భవన నిర్మాణం మీద శ్రద్ధ వహించే గ్రంథాలయ కార్యదర్శులు ఉన్నారు. పుస్తకాలను కొనుగోలుచేసి గ్రంధాలయాలలోని గ్రంథాల ప్రమాణాన్ని, సంఖ్యను పెంచిన కార్యదర్శులున్నారు సంచార శకటాలను నెలకొల్పటంలో ఆసక్తి చూపిన వారున్నారు. మహిళా పఠనాలయాలను గ్రంథాలయాల్లో అలాయిదాగా ఏర్పరిచిన వారున్నారు. గ్రంథాలయాలలో మహిళా విభాగాలను ప్రత్యేకంగా నెలకొల్పినవారున్నారు. ఇవన్నీ గాక గ్రంథాలయాల సూచిని (ఇండెక్సు) సక్రమంగా తయారు చేయించి, గ్రంథాల పట్టికను సమర్థవంతంగా జాగ్రత్తగా రాయించిన కార్యదర్శులున్నారు. కాని ఇన్ని పనులు, ఇన్ని విధ్యుక్త కార్యాలు ఏకకాలంలో నెరవేర్చిన వారు అరుదు. అంతేకాదు గ్రంథాలయాల పెంపు, విస్తరణ, నిర్వహణ ఒక జీవిత ధ్యేయంగా సాగించినవారు మరీ కొద్దిమంది. అలాంటి వారిలో పేరెన్నికగన్నవారు పాండురంగా రెడ్డిగారు. ఈ శుభ సమయంలో వారికి ఈ వ్యాస రూపంగా నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను.

# 3.14 గ్రంథాలయజ్ఞాపకాలు

**- డా॥ ఎన్. గోపి**

నేనివ్వాళ ఆంధ్రదేశంలో ఒక సాహిత్య వ్యక్తిత్వాన్ని కలిగివుండడానికి చిన్నప్పటి మావూరి తాలూకా శాఖా గ్రంథాలయమే కారణం. ఫర్లాంగుల దూరంలో బాలికల పాఠశాలకు ఎదురుగా పాత పెంకుటింట్లో ఉండేది. 1962లో మా అన్నయ్య ఐదు రూపాయల డిపాజిట్ కట్టిన నాటినుండే ఆ లైబ్రరీ నా దినచర్యలో భాగమైపోయింది.

నా పన్నెండో యేటి నుంచి 20 ఏళ్ళ వయసు దాకా మా లైబ్రరీలోని ముఖ్యమైన పుస్తకాలన్నీ చదివేశాను. ఆ రోజుల్లో బహుశా నాలాగా, కాదంటే నాకన్నా ఎక్కువ పుస్తకాలు చదివిన ఘనత మా వూళ్లో ఒక్క పులిమామిడి బాలకృష్ణారెడ్డికే దక్కుతుంది.

-విశ్వనాథ, చలం, రాయప్రోలు, గురజాడ, శ్రీశ్రీ, గోపీచంద్, ఉన్నవ ఇట్లా అందరి పుస్తకాలు అర్థమైనకాడికి ఆపోసన పట్టేశాను. మొట్టమొదటి సారి సినారె కవిత్వం మాలైబ్రరీలోనే చదివాను - స్వప్నభంగం, నారాయణరెడ్డిగేయాలు, ఋతుచక్రం, కర్పూరవసంత రాయలు. ఎందుకో నారాయణరెడ్డిగారి ప్రాబంధికశైలిలోని గేయం నాకెంతో నచ్చేది. బహుశా ఆనాటి తెలంగాణా పల్లెల్లోని పాఠకులను క్లాసికల్ డిక్షన్ ఎంతో ఆకట్టుకునే దనుకుంటాను "పీయూషము, ఉడ్డీనము, చషకము" వంటి మాటలను రాసుకుని నేను రాసే కవితల్లో ఇరికిస్తుండేవాణ్ని. ఉత్తరోత్తరా నారాయణరెడ్డిగారితో నాకేర్పడిన అనుబంధం లోకానికి తెలిసిందే.

మా లైబ్రేరియన్ దేవదాసు అని ఉండేవాడు. ఇప్పుడెక్కడున్నాడో. బహుసౌమ్యుడు. నన్ను చాలా ఇష్టపడేవాడు. మా లైబ్రరీలో ఏ పుస్తకం ఎక్కడుందో నాకే ఎక్కువ తెలిసేది. అనుమానం వస్తే నన్ను అడిగేవాడు. లైబ్రరీ నాకెంత వ్యసనమయిందంటే సోమవారం సెలవుదినంనాడు నాకు భరించరానిదిగా వుండేది. ఆరోజు నాకు శూన్యంగా తోచేది. అందుకే ఆదివారంనాడు కాస్తలావుపాటి పుస్తకాలు తీసికెళ్తుండేవాణ్ని.

మా లైబ్రరీకి అన్ని రకాల పత్రికలు వచ్చేవి. ఆంధ్ర సచిత్రవార పత్రిక, ప్రభవార పత్రికల్తో పాటు కృష్ణాపత్రిక, ప్రజామత మమ్మల్ని ఎక్కువగా ఆకర్షించేవి. రంగనాయకమ్మ బలిపీఠం, కోడూరి కౌసల్యాదేవి చక్రభ్రమణం వంటి సీరియల్స్‌ను చదవడానికి తహతహలాడిపోయేవాళ్ళం. లైబ్రరీ సాయంత్రం నాలుగింటికి తెరుస్తారనగా 3-45 నుంచే తలుపుదగ్గర తచ్చాడేవాళ్ళం. కొత్త పత్రిక వేరే చేతుల్లో పడేలోగానే అందుకోవాలని తాపత్రయం. చంద్రయ్య అని

అటెండర్ ఉండేవాడు. దారిలో కలిసినప్పుడు కొత్త పత్రిక వస్తే ముందే చెప్పేవాడు. ఇప్పుడెక్కడున్నాడో.

నేను ఎనిమిదవ తరగతి చదివే రోజులవి. అప్పటికే నాగేయాలు ప్రజామత, కృష్ణాపత్రికల్లో విరివిగా అచ్చయ్యేవి. ఎక్కువగా బాలల గేయాలు రాసేవాణ్ని. కవిరావు, నార్ల చిరంజీవి గేయాల ఫక్కీలో వుండేవి. ఇప్పుడు చదివితే కూడా బాగానే ఉన్నట్టనిపిస్తున్నాయి. ఇప్పుడో పుస్తకంగా వేయాలి.

సినారె కవిత్వం చదివి ఆయనకు ఉత్తరాలు రాసేవాణ్ని. ఆశ్చర్యంగా ఆయన జవాబులు రాసేవారు. చిన్నకార్డు మీద కెరటాల్లాంటి అక్షరాల్తో ఉన్న ఉత్తరాలు ఇంకా ఎక్కడో పుస్తకాల మడతల్లో ఉండేవుంటాయి. వెతకాలి. అంత చిన్న పిల్లవానికి కూడా ఉత్తరాలు రాసే ఒక పెద్దకవి సహృదయతను ఈ సందర్భంగా రికార్డు చేస్తున్నాను.

నేను హైదరాబాద్‌లో బి.ఎ చదివే రోజుల్లో మావూరి లైబ్రరి భవనం కూలిపోయే స్థితి వచ్చింది. అది అద్దె భవనం. మావూరి లైబ్రరీకి ఒక సొంతభవనం ఉండాలని మాలో కొందరు యువకులకు అనిపించింది. ముఖ్యంగా మా లక్ష్మీనారాయణ దీని కోసం ఎంతో ప్రయత్నం చేశాడు. (ఇప్పుడతను ఉస్మానియా ఆంగ్లశాఖలో రీడర్‌గా పనిచేస్తున్నాడు) నల్లగొండ జిల్లా ఆఫీసుల చుట్టూ తిరిగాడు. ఛోటా బడా నాయకులను కలిశాడు. అప్పట్లో మా శక్తి సరిపోకనో, అధికారుల ఆసక్తి కలిసిరాకనో ఏమీ కాలేదు. అయితే ఆ ప్రయత్నాలూ, తర్వాతి పరిణామాలవల్ల ఎట్టకేలకు ఓ సొంత లైబ్రరీ భవన నిర్మాణం జరిగింది. అప్పట్లో కొంచెం ఊరిబయట హాస్పిటల్ ప్రాంతంలో ఇది ఏర్పడింది. ఇప్పుడు ఊరే అనుకోండి.

తర్వాత మధుసూదన్‌రెడ్డి లైబ్రేరియన్‌గా వచ్చాడు. అతడు హైస్కూళ్లో నా క్లాస్‌మేట్. సూర్యాపేట గ్రంథాలయంలో ఉన్నప్పుడు గ్రంధాలయ వారోత్సవాలు ఘనంగా జరిపించేవాడు. ఒకటి రెండు సార్లు నన్ను పిలిచి ఉపన్యాసాలు చేయించాడు కూడా. భువనగిరికి వచ్చిన తర్వాత కూడా వారోత్సవాలు బాగా చేయించేవాడు. వాటికి నా క్లాస్‌మేట్, నేటి హోం శాఖా మంత్రి ఎలిమినేటి మాధవ రెడ్డిగారి సహకారం చాలా వుండేది. "గోపిని పిలుస్తున్నారా లేదా; కావలిస్తే నా కారు పంపించండి" అని ప్రత్యేక శ్రద్ధను చూపేవాడు. మా చిన్నప్పటి అనుభవాలు ఇప్పటికీ మాలో పచ్చగా వున్నాయి. నాకు పుస్తకాల పురుగు అని పేరుండేది కదా! మాధవరెడ్డి మొదలైన స్నేహితులు నన్ను 'పండితుడు పండితుడు' అని ఆటపట్టించేవాళ్ళు.

ఇక పాండురంగారెడ్డి గారి గురించి. ఈయనతో నేను రెండుమూడుసార్లు కలిశాను. గ్రంధాలయ ఉద్యమంలో పెద్దపేరు ఈయనది. తెలంగాణాలో గ్రంథాలయసేవ, ఇతర ప్రాంతాల్లో సేవ ఒకటి కాదు. సాంస్కృతికంగా, విద్యా విషయకంగా ఎంతో బిక్కచచ్చివున్న

ప్రాంతంలో ఒక చారిత్రక స్ఫూర్తితో పనిచేసిన వ్యక్తుల కోవలోనివాడు పాండు రంగారెడ్డిగారు. గ్రంథాలయ వ్యవస్థకు ముఖ్యంగా కరీంనగర్, మెదక్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి, వరంగల్ జిల్లాల్లో ఆయన చేసిన సేవ ఆప్రాంతాల వారందరికీ చిరస్మరణీయం. ఉద్యోగాలు అందరూ చేస్తారు. అయితే ఎంత మనస్సుపెట్టి చేశారు, ఎంత కర్తవ్యనిష్టతో చేశారు అనేది ముఖ్యం నిర్జీవమైన, యాంత్రికమైన పరిపాలనా వ్యవస్థకు ప్రాణం పోసేది విశిష్ట వ్యక్తుల చైతన్యమే. ముఖ్యంగా జ్ఞాన సంబంధమైన గ్రంథాలయపాలనకు-ఎంతో దూరదృష్టి ఉంటే తప్ప ఏ పనులూ కావు. అందరికీ తలలోని నాలుకగా కూడా పాండురంగారెడ్డిగారు మంచి పేరు సంపాయించుకున్నారు ఈ ప్రాంతపు రచయితల పుస్తకాలు కొనవలసి వస్తే ఆయనే ముందుండే వారు. నాకు ఒకటి రెండు సార్లు ఈవిధంగా సాయం చేశారు కూడా.

ఆ తరంనాటి చారిత్రకస్పృహ, ఈ కాలపు పాలనా దక్షతలను రంగరించుకున్న అరుదైన వ్యక్తిత్వం పాండురంగారెడ్డి గారిది. నిరంతరంగా ఎదుగుతూ ఆధునికమౌతున్న గ్రంథాలయోద్యమం ఆయనను చిరకాలం గుర్తుంచుకుంటుందనడంలో సందేహం లేదు.

# 3.15 వార్తా పత్రికా గ్రంథాలయాలు

**- డా॥ జె. చెన్నయ్య**

పెరుగుతున్న పాఠకుల అవసరాలకు దీటుగా విస్తృత సమాచారాన్ని అందించవలసిన బాధ్యత ఈనాడు వార్తా పత్రికలపై పడింది. స్త్రీ కోసం, బాలలకోసం, పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ విద్యార్థులకోసం, నిరుద్యోగులకోసం, యువతకోసం, రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక, పారిశ్రామిక, బ్యాంకింగ్ రంగాల పాఠకులకోసం, సాధారణ పాఠకులకోసం ప్రత్యేక వ్యాసాలు, ఫీచర్లు రోజూ ప్రచురించవలసి ఉంటుంది. సంపాదకుని నుంచి విలేఖరి, ఉప సంపాదకుని వరకు ఎప్పుడు ఏ అంశానికి సంబంధించిన సమాచారం కావాలన్నా అందించడానికి వార్తా పత్రికలకు పటిష్టమైన గ్రంథాలయాలు నిర్మించుకోవడం ఇటీవలికాలంలోనే ప్రారంభమైంది.

ఎప్పుడు ఏ రాత్రివేళ ఏ అంశంపై వివరాల కావలసి వచ్చినా వెంటనే అందించడానికి వీలుగా వార్తాపత్రికల గ్రంథాలయాలు సర్వసమగ్ర సమాచార నిధులుగా రూపొందుతున్నాయి. అప్పటికప్పుడు ఏదైనా ప్రాజెక్టుకు సంబందించి తాజా పరిణామం ఏర్పడి పూర్వ సమాచారంతో సమగ్రంగా వార్త రాయవలసిన అవసరం రావచ్చు. రాష్ట్రంలో వివిధ రంగాల్లో సంవత్సరమంతా చోటు చేసుకున్న సంఘటనల ప్రధానాంశాలతో సంవత్సరాంతాన ఒక సమీక్ష రాయవలసిన అవసరం రావచ్చు. ఉన్నట్టుండి బోఫోర్సు కుంభకోణం గురించో, భోపాల్ విషవాయు విషాదాంతం గురించో రాయవలసి రావచ్చు. ఎన్.టి.రామారావు వంటి ప్రజానాయకుడు, మహానటుని అస్తమయవార్తే అన్ని వివరాలతో రాయవలసి రావచ్చు. అటువంటి సంధర్భాలల్లో వార్తలు, సంపాదకీయాలు రాసేందుకు ఆయా అంశాలపై విలేఖరులకు, సంపాదకులకు తగినంత పూర్వ సమాచారాన్ని (Background information) వార్తా పత్రిక గ్రంథాలయం అందించవలసి వుంటుంది. పత్రికను ఆ సందర్భాల్లో ఆదుకోగలిగేది ఆ పత్రికలోని గ్రంధాలయమే. గ్రంథాలయం అందించే సమాచారంతో వార్తలు, వ్యాసాలు ప్రచురించడం ద్వారా ఆ పత్రికు సాటిపత్రికల్లో ప్రతిష్ట పెరుగుతుంది. పాఠకుల అవసరం తీరుతుంది.

## క్లిప్పింగ్సే ప్రాణం

గడిచిన పదేళ్ళకాలంలో వివిధ వార్తా పత్రికలు తమ గ్రంథాలయాలను ఈ పద్ధతిలో నిర్మించుకుంటున్నాయి. అయా పత్రికల్లో ఏ వార్తకు, వ్యాసానికి, సంపాదకీయానికి ఎప్పుడే

అంశంపై సమాచారం కావలసి వచ్చినా ఆలస్యం లేకుండా అందించడానికి వీలుగా గ్రంథాలయాలు తగిన వివరాల్ని సమకూర్చుకొంటున్నాయి. వార్తా పత్రికల గ్రంథాలయాలు ప్రధానంగా రెండురకాలుగా రూపొందుతున్నాయి. ఒకటి - ఒక విషయంపై వేరు వేరు పత్రికల్లో వచ్చిన వార్తల్ని, వ్యాసాలను క్లిప్‌చేసి విషయపరంగా ఫైలు తయారుచేసి కేటలాగింగ్‌చేసి భద్రపరచడం. రెండవది - వివిధ అంశాలకు సంబంధించిన గ్రంథాలను సేకరించి కేటాలాగింగ్ చేసి అమర్చడం.

వార్తా పత్రికకు అవసరమవుతుందనుకున్న ఏ గ్రంథాన్నయినా సేకరిస్తారు. ముఖ్యంగా రాజకీయాలకు సంబంధించిన గ్రంథాలు, జీవిత చరిత్రలు, సాహిత్య, విజ్ఞాన సర్వస్వాలు వార్షిక సంచికలు, ఆకర గ్రంథాలు (Reference Books) వంటివి సేకరించి పొందుపరుస్తారు. పుస్తకాలను గురించి వివిధ పత్రికల్లో వచ్చే సమీక్షలను బట్టి వాటిని ఎంపిక చేసుకుంటారు. ప్రచురణ వార్తలనుంచి వచ్చే కేటలాగ్స్, కొత్త పుస్తకాల వివరాలను బట్టి, సంపాదకులు ఇతర ఎడిటోరియల్ సిబ్బంది సూచించే గ్రంథాలను కొని గ్రంథాయంలో భద్రపరుస్తారు.

పేపరు క్లిప్పింగ్స్ తయారు చేయడంలో కూడా వార్తాపత్రికా గ్రంథాలయాలు ముందడుగు వేస్తున్నాయి. దేశ, విదేశాలనుంచి, రాష్ట్రంలో వెలువడే తెలుగు, ఇంగ్లీషు దినపత్రికలు, జర్నల్స్, పీరియాడికల్స్ తెప్పిస్తూ వాటిల్లోంచి విస్తృత ప్రాతిపదికపైన వార్తలు, వ్యాసాలు కత్తిరించి క్లిప్పింగ్ చేసి పెడతారు. ఈ క్లిప్పింగ్ ఫైళ్ళు ప్రధానంగా సబ్జక్టులవారీగా విభజించి భద్రపరుస్తారు. దేశ, రాష్ట్రాల వారీగా, వ్యక్తుల వారీగా కూడా ఫైల్స్ వేరుగా ఏర్పాటు చేస్తారు. రాష్ట్ర, దేశ, విదేశాల్లో ముఖ్య మంత్రులు, ప్రధానమంత్రులు, మంత్రులు, కేంద్ర మంత్రులు, ఇతర రాజకీయ వేత్తలు, దేశాధినేతలు, తదితర ముఖ్యవ్యక్తుల వివరాల క్లిప్పింగ్‌లను వ్యక్తిగత ఫైళ్ళుగా కొనసాగిస్తారు.

## "ఈనాడు" గ్రంథాలయం

రాష్ట్రంలో ఈనాడు, ఆంధ్రజ్యోతి, వార్త, ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, దక్కన్ క్రానికల్, ఆంధ్రభూమి, ప్రజాశక్తి, విశాలాంధ్ర వంటి పత్రికలు తమతమ శక్తి కొలదీ గ్రంథాలయాలను నిర్మించుకుంటున్నాయి. ఆరంభంనుంచీ పత్రికా గ్రంథాలయాన్ని కేవలం గ్రంథాలయంగా కాకుండా ప్రపంచ విజ్ఞానాన్నంతా సేకరించి విశ్లేషించి భద్రపరచుకొనే రీసర్చ్ అండ్ రిఫరెన్స్ గ్రూపుగా "ఈనాడు" కృషి చేస్తోంది. తన గ్రంథాలయాన్ని ఈ దశలో మలచుకొనేందుకు రీసర్చ్ అండ్ డెవలప్‌మెంట్ విభాగంగా క్రానికల్ గ్రూపు ఇప్పుడిప్పుడే ప్రయత్నాలు ప్రారంభించింది.

"ఈనాడు" గ్రంథాలయాన్ని (ఆర్.ఆర్.జి) పత్రికా గ్రంథాలయాలన్నిటిలో అగ్రగామిగా చెప్పుకోవలసి వుంటుంది. పత్రికలో పాత్రికేయ సిబ్బందికి అవసరమయ్యే సమస్త విషయ విజ్ఞానాన్ని, సమాచారాన్ని నిక్షిప్తం చేసేందుకు మొదటినుంచీ కృషి చేస్తోంది. దేశంలో ఏ భాషా పత్రికకూ లేనివిధంగా తన రీసర్చ్ అండ్ రిఫరెన్స్ గ్రూపును తీర్చిదిద్దుకొంటున్నది. 1974లో పత్రిక ప్రారంభమైనప్పటినుంచీ ఆ పత్రిక ప్రతులన్నీ భద్రపరచారు. సంవత్సరం, నెలవారీగా ఫైళ్ళు కట్టి పేర్చారు. 'ఈనాడు'ను మాత్రమేగాక ఇతర పత్రికలను కూడా భద్రపరుస్తున్నారు. ఆర్.ఆర్.జి.కి రాష్ట్ర, దేశ, విదేశాలనుంచి 75 వార్తాపత్రికలు తెప్పిస్తారు. 200 జర్నల్స్ తెప్పిస్తారు. సుమారు 15,000 పుస్తకాలున్నాయి. సుమారు 2500 సబ్జక్టులపై క్లిప్పింగ్ ఫైళ్ళు తయారు చేశారు. ఒక్క ఈ విభాగంలోనే 40 మంది సిబ్బంది పని చేస్తున్నారు. ఏటా పుస్తకాలు, పత్రికలు, కొనుగోలు మీదే 12 లక్షల రూపాయలు ఖర్చు పెడుతున్నారు. రోజుకూ గ్రంథాలయంలో క్లిప్పింగ్ ఫైళ్ళ గుట్టలు అపరిమితంగా పేరుకుపోతున్నాయి. అందుకు కేటాయించిన సుమారు 4500 చదరపు అడుగుల స్థలం ఇప్పుడే కిక్కిరిసిపోయింది. దాంతో గ్రంథాలయాన్ని కంప్యూటరైజ్ చెయ్యక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఈ దృష్ట్యా మొత్తం ఫైళ్ళను మైక్రోఫిల్మ్ భద్రపరచాలా లేక డిజిటల్ ఇమేజింగ్ చేయాలా అనేది ఆలోచిస్తున్నారు. డిజిటల్ ఇమేజింగ్‌లో ఎన్ని క్లిప్పింగ్ ఫైళ్ళనైనా కంప్యూటర్‌లో ఉంచితే చాలు మొత్తం సమాచారాన్ని భద్రపరచుకుంటుంది. కొన్ని పద్ధతుల్లో మనం కంప్యూటర్‌లోకి ఎక్కించిన సమాచారాన్ని అది సబ్జక్టులవారీగా దానంతటదే విభజించి ఉంచుకుంటుంది. ఏ సమాచారం కావాలన్నా ఇస్తుంది. ఈ పరిజ్ఞానం అందుబాటులోకి తెచ్చుకొనే విషయంలో డిజిటల్ ఇమేజింగ్‌ను ఆశ్రయించాలా, మైక్రో ఫిల్మింగ్ పద్ధతిని ఆశ్రయించాలా అనేది ఇంకా నిర్ణయించలేదు.

## ఇతర పత్రికల గ్రంథాలయాలు

ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ కూడా ఇటీవల కాలంలో గ్రంథాలయాన్ని వ్యవస్థీకృతం చేసుకోవడంలో దృష్టికేంద్రీకరిస్తోంది. 1987లో ఈ గ్రంథాలయం ప్రారంభమైంది. పుస్తకాలు సేకరించడం, వివిధ దిన, వార, మాస పత్రికలు, జర్నల్స్ నుంచి క్లిప్పింగ్స్ తీసి ఫైళ్ళుగా వర్గీకరించి ఉంచడం కేటాలాగింగ్ చేయడం జరుగుతోంది. సుమారు 3000 పుస్తకాలున్నాయి. క్లిప్పింగ్ ఫైళ్ళను మైక్రోఫిల్మింగ్ చెయ్యాలని యోచిస్తున్నారు. మధ్యాహ్నం 12 గంటలనుంచి రాత్రి 9.30 గంటలవరకు ఆంధ్రప్రభ గ్రంథాలయం తెరిచి ఉంటుంది.

ఆంధ్రజ్యోతికి హైదరాబాద్‌లోనూ విజయవాడలోనూ గ్రంథాలయం ఉంది. హైదరాబాదులో

1993లో ప్రారంభమైంది. 40 వరకు ముఖ్యమైన అంశాల్లో క్లిప్పింగ్ ఫైళ్ళున్నాయి. అందులో ఉప విభాగం కూడా ఉంది. 23 దినపత్రికలు, 50 ఇతర పత్రికలు వస్తాయి. 10 మంది గ్రంథాలయంలో పనిచేస్తారు.

జాతీయ దినపత్రిక "హిందూ"కు మద్రాసులో పెద్ద గ్రంధాలయం వుంది. హైదరాబాదువంటి ఎడిషన్ కేంద్రాల్లో ఆ పత్రిక ఫైళ్ళు మాత్రం ఉంటాయి. ఈ పత్రికలో వచ్చే ప్రత్యేక వార్తలు, వ్యాసాలు, ఫీచర్లు, స్పెషల్ కరస్పాండెట్లు రాసే వార్తలు, వ్యాసాలను అంశాలవారీగా సంచిక తేదీ, అంశం, పేజి, కాలమ్ వివరాలతో కూడిన ప్రత్యేక సూచి ప్రతినెలా వెలువరిస్తారు. అక్షర క్రమంలో ఉండే ఈ ఇండెక్స్ సంచికను బట్టి ఎటువంటి వార్తనైనా ఇట్టే పట్టుకోవచ్చు. దీన్ని ఆ పత్రికా సిబ్బందేగాక వెలుపలి వ్యక్తులు, పరిశోధనా సంస్థలు కూడా కొని ఉపయోగించుకోవచ్చు.

హైదరాబాద్, విజయవాడలనుంచి ఏకకాలంలో వెలువడుతున్న ప్రజాశక్తి, విశాలాంధ్ర దినపత్రికలకు విజయవాడలో పూర్తిస్థాయి గ్రంధాలయం ఉంది. ఈ పత్రికల్లో ప్రధాన వార్తలను హైదరాబాద్ బ్యూరోలు రాస్తుండగా వివిధ అంశాలపై వ్యాసాలు, ఎడిట్ ఆర్టికల్స్, సంపాదకీయాలు, ఫీచర్లు విజయవాడవాళ్ళు సమకూరుస్తారు. వీటికి ముఖ్యంగా గ్రంథాలయం అవసరం వుంటుంది. విజయవాడలో అందుబాటులో ఉంది. హైదరాబాద్‌లో గ్రంథాలయం అవసరం పెద్దగా లేదని ఆ పత్రికలవారన్నారు. ప్రజాశక్తికి హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞానకేంద్రం పెద్ద దిక్కుగా వుంది. అనేక రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ పత్రికలు, పెద్ద సంఖ్యలో గ్రంథాలు విజ్ఞాన కేంద్రంలో వున్నాయి. పత్రికల ఫైలింగ్ సౌకర్యం ఉంది. ఇది ప్రజాశక్తి అవసరాలను తీరుస్తోంది.

దక్కన్ క్రానికల్, ఆంధ్రభూమి గత 6 సంవత్సరాలుగా గ్రంథాలయాన్ని పటిష్టంగా నిర్మించుకొనేందుకు కృషి జరుపుతోంది. వివిధ సబ్జక్టులపై సుమారు 200 క్లిప్పింగ్ ఫైళ్ళు నడుస్తున్నాయి. రోజా ప్రాంతీయ, దేశ విదేశాలకు చెందిన 80 వార్తా పత్రికలు తెప్పిస్తారు. 40 ఇతర జర్నల్స్ వస్తున్నాయి. సుమారు 4000 వరకు గ్రంథాలున్నాయి. గ్రంథాలయాన్ని పరిశోధన, అభివృద్ధి (R&D) విభాగంగా తీర్చిదిద్దే ప్రయత్నాలు జరుగుతున్నాయి. సుమారు 15 లక్షల రూపాయలతో ఆటోమేషన్ సౌకర్యం నెలకొల్పుతున్నారు. గ్రంథాలయం సేకరించే సమాచారాన్ని, క్లిప్పింగ్స్‌ని ఆటోమేషన్‌లో కంప్యూటర్ కెక్కిస్తారు. అవసరమైనప్పుడు క్షణాల్లో సమాచారం లభిస్తుంది. పత్రికలను కత్తిరించడం, అతికించడం, కేటలాగింగ్‌చేసి భద్రపరచడం వంటి శ్రమ ఉండదు.

## ఫోటో లైబ్రరీ

కేంద్రంలోనో, రాష్ట్రంలోనో రాజకీయ సంక్షోభం, ప్రధానమంత్రులు, ముఖ్యమంత్రులకు పదవీ వియోగం సంభవించినప్పుడు పత్రికల్లో అధినేతలు తలపట్టుకున్న ఫోటోలు పరుచుకుంటాయి. అలాగే ఒకనేత ఉన్నట్టుండి ముఖ్యమంత్రి పదవికో, మరో ఉన్నత పదవికో ఎంపికయితే మరునాడు సంతోషంతో ఉన్న ఫోటోలో పత్రికలో దర్శనిమిస్తారు. ఇటువంటి ఫోటోలు అప్పటికప్పుడు తీసినవికావని చాలామందికి తెలియకపోవచ్చు. పత్రికా ఫోటో గ్రాఫర్లు రాజకీయనాయకులు ఆనందంగా కోపంగా ముభావంగా విషాదంగా బుర్ర గోక్కుంటూనో ఉన్నప్పుడు ఫోటోల్ని తీసి భద్రపరిచి ఫోటో లైబ్రరీలో ఉంచుతారు. ఎప్పుడే పరిణామం సంభవించినా దానికి తగిన ఫోటో వెతికి ప్రాసెసింగ్ చేసి ముద్రిస్తారు. పత్రికా గ్రంథాలయాలలో భాగంగానో, వేరుగా ఫోటో డివిజన్ అధీనంలోనో ఫోటో లైబ్రరీని కొనసాగిస్తున్నారు. ప్రధానంగా జిల్లా స్థాయి, రాష్ట్ర స్థాయి, జాతీయ, అంతర్జాతీయ స్థాయి వరకు ముఖ్య వ్యక్తుల ఫోటోలను భద్రపరుస్తారు. ఈ విధంగా ఏ అంశంపై నైనా గ్రంథాలయం నుంచి తగిన సమాచారం గాని, దానికి సంబంధించిన ఫోటోగాని సకాలంలో లభించడం వల్ల పత్రిక పాఠకుల సంతృప్తిమేర రూపొందేందుకు దోహదం చేయగలదు. అటువంటి గ్రంథాలయాన్ని పత్రికలు తమంతట తాము పటిష్టంగా నిర్వహించుకుంటే ఏ సమాచారంకోసమూ ఎవరిపైనా ఆధారపడవలసిన అగత్యం ఉండదు.

## 3.16 వాడిపోని పూలు పుస్తకాలు

- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

కైలాసం ఎంతెత్తో కనుక్కో
బ్రహ్మాండం బరువెంతో కనుక్కో
వైకుంఠం ఆనవాళ్లు ఏమిటో!
తెలియదా? పుస్తకాలు కొనుక్కో

లోలోపలి చీకట్లను చంపేస్తాయి
స్వర్గాలను భూమిపైకి దింపేస్తాయి
వాడిపోని పువ్వులురా సద్గ్రంథాలు
తరతరాల పరిమళాలు నింపేస్తాయి

పల్లవాన్ని బల్లెంగా తీర్చేది
కన్నీటిని ఖడ్గంగా మార్చేది
లోకంలో ఒకేఒకటి పుస్తకం!
మంచునైన మంటలాగ మార్చేది

గుండియనే కొండవాగుగా చేసేది
వాగునుండి మెరుపుల నెగజిమ్మేసేది
లోకంలో ఒకే ఒకటి - మంచి కితాబు
మానవుణ్ణి మాధవునిగ మార్చేసేది

నదులు తరగలెత్తినా తడియే లేదు
నిప్పుకణికలెగిసినా వేడే లేదు
సుడిగాడ్పులు వీచినా చలనం లేదు
ఎక్కడ? గ్రంథాలయాన; ఎక్కడోకాదు

హిమాలయం నిలిచివుంది ఒక దేశంలో
నయాగరా దూకుతుంది ఒక దేశంలో
పర్వతాలు ప్రవాహాలు కలిసేదెక్కడ?
ఇంకెక్కడ? అదిగో! పుస్తకకోశంలో

అర్థరాత్రి సూర్యున్నే చూడాలంటే
అమవసనిశిలో శశినే చూడాలంటే
గ్రంథాలయమునకు వెళ్లి పోవాలి మనం
ఎడారిలో సెలయేటిని చూడాలంటే

నన్నయ్యను చిన్నయ్యను కలిపిన చోటిది
శ్రీనాథుడు శ్రీశ్రీతో పలికిన చోటిది
సత్కవులకు నిలయం ఒక గ్రంథాలయమే
వాల్మీకులు హోమర్లూ కలిసిన చోటిది.

మాట్లాడే పక్షితతిని చూడాలంటే
పరుగెత్తే వృక్షాలను చూడాలంటే
గ్రంథాలయమునకు వెళ్లి పోవాలి మనం
పాడే నక్షత్రాలను చూడాలంటే

# 3.17 మారుతున్న కాలంలో పౌర గ్రంథాలయాల ఆవశ్యకత

- వలీ హుస్సేన్,
- యల్.యస్.ఆర్.సి.వి. రమేష్
- ఎ.వి.యస్.యస్. నాగరాజు

సామాజిక అవసరాలకు ఉపయోగపడటమే పౌరగ్రంథాలయాల ప్రధాన ఉద్దేశ్యంగా ఉంటూ వచ్చింది. సమకాలీన అవసరాలకు పౌరగ్రంధాలయాల తోడ్పాటు ఏ విధంగా ఉందని చర్చించే ముందు స్వాతంత్ర్య సంగ్రామ కాలంలో గ్రంథాలయాల ద్వారా జరిగిన కృషి సామాన్యమైనది కాదనేది గుర్తించాల్సిన విషయం. అప్పట్లో గ్రంథాలయ ఉద్యమంతో పాటు స్వాతంత్ర్య సముపార్జన లక్ష్యం కూడ మిళితమై ఉద్యమం నడుపబడింది. స్వాతంత్ర్య సాధన పోరాటమే కాక గ్రంధాలయ ఉద్యమం కూడా బహుముఖంగా ఆనాటి పరిస్థితులను ప్రభావితం చేసిందనటంలో అతిశయోక్తి లేదు.

గ్రంథాలయ ఉద్యమం చేపట్టిన రోజుల్లో గ్రామాల్లో ఉన్న మూఢవిశ్వాసాలను రూపు మాపటానికి అక్షరాస్యత ఆవశ్యకతను ప్రచారం చేయటం జరిగింది. అలాగే, గ్రామాల్లో గ్రంథాలయ ఉద్యమ నాయకులు కార్యకర్తలు పుస్తక పఠనాభిరుచిని గురించి ప్రసంగాలు చేయటమే కాక, "కల్లు మానండోయ్ బాబు - కళ్ళు తెరవండోయ్" అంటూ మద్య నిషేధం లాంటి దురలవాట్ల గురించి కూడ ప్రచారం చేశారు. సామాజిక రుగ్మతల గురించి చెప్పి, పుస్తక - అధ్యయనం వల్ల లోకంలోని మంచి చెడు గురించి తెలుసుకోవటానికి వీలవుతుందనీ, పుస్తక పఠనం ద్వారా విచక్షణాజ్ఞానం అలవడుతుందనీ ప్రచారం - నిర్వహించేవారు. ఈ రకంగా ఆనాడు ప్రజలకు పౌరగ్రంధాలయాల వల్ల ఎంతో కొంత మేలు జరిగిందనే చెప్పవచ్చును.

## స్వాతంత్ర్యానంతరం గ్రంథాలయాల సేవలు

స్వాతంత్ర్యానంతరం పౌరగ్రంథాలయాల సేవల్లో మార్పులు చోటు చేసుకున్నాయి. గ్రంథాలయాల సంఖ్య కూడా పెరిగింది. అయితే ప్రజల దృష్టిలో పౌరగ్రాంధాలయాల సేవలు కేవలం విజ్ఞానం, వినోదం అన్నట్లుగా ఉంది. స్వాతంత్ర్యానికి పూర్వం గ్రంథాలయోద్యం

లక్ష్యం విస్తృతమైనది కాగా, ప్రస్తుతం పాక్షిక లక్ష్యంగా మారింది. అప్పట్లో పౌరగ్రంథాలయాలు సాహిత్య, సారస్వత కేంద్రాలుగా వెలుగొందుతూ ఉండేవి. కాగా, ఈనాడు విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, పరిశోధన, - అభివృద్ధి కేంద్రాల (R&D) గ్రంథాలయాలు దిన దిన ప్రవర్ధమానం అవుతుండగా పౌర గ్రంధాలయాల పరిస్థితి దీనికి భిన్నంగా ఉంది.

ఈనాటి సామాజిక పరిస్థితులకు, సమస్యలకు అనుగుణంగా పౌరగ్రంథాలయాల సేవల పని తీరును సంస్కరించాల్సి ఉంది. ఆనాడు ఏ విధంగానైతే గ్రామీణులు గ్రంధాలయ ఉద్యమం ద్వారా స్ఫూర్తిని పొందారో ఈనాడు కూడ గ్రంధాలయాల ద్వారా ప్రజలు లబ్ధిపొందాల్సిన అవసరం ఉంది. ప్రింట్ మీడియా ఎన్నో సవాళ్ళను ఎదుర్కొంటున్న రోజులివి. ఎలక్ట్రానిక్ మీడియా వరప్రసాదం అయిన సాటిలైట్ ప్రసారాలు పెరగడం ద్వారా దూరదర్శన్‌లో ఎన్నో చానళ్ళు ప్రజల ముంగిట్లోకి వాలుతున్నాయి. దీంతో పుస్తకాలు పఠించే ఆసక్తి ప్రజల్లో తగ్గుతున్నది. ఈ సమస్య రాబోయే రోజుల్లో మరింత జటిలం కావచ్చు. అసలే మన ప్రజలో అక్షరాస్యత తక్కువ. అక్షరాస్యులైన వారిలో కూడా పుస్తకాలు చదివే అలవాటున్న వారి శాతం మరింత తక్కువ. ఉన్న ఈ కొద్దిమంది కూడ ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావంలో కొట్టుకుపోతే పరిస్థితి ఏ విధంగా మారుతుందో ఊహించటం కష్టం కాదు. ఏది ఏమైనప్పటికి ఇప్పుడున్న పరిస్థితి ఇంకా వృద్ధి చెందితే రానున్న రోజుల్లో పౌరగ్రాంధాలయాలు మరిన్ని సవాళ్ళను ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడవచ్చు. అయితే రాబోయే సవాళ్ళను ఎదుర్కోటానికి ఇప్పటి నుండే తగిన చర్యలు చేపడితే ఇబ్బందులను అధిగమించటానికి అవకాశం ఉంది.

గ్రంథాలయాల్లో జనాకర్షణ శక్తిగల సాహిత్య ప్రక్రియ "నవల"కు పాఠకులలో ఎక్కువ డిమాండ్ ఇంది. అలాగే పోటీ పరీక్షలకు అవసరపడే పఠన సామాగ్రి కోసం విద్యార్థులు డిమాండ్ చేయటం సర్వసాధారణం. కనుక, ప్రజల ఆసక్తికి సరిపడే విధంగా పౌర మరియు శాఖా గ్రంధాలయాల్లో పఠన సామగ్రిని ఏర్పాటు చేయవలసిన అవసరం ఉంది.

## మహిళా పాఠకులను ఆకర్షించని గ్రంథాలయాలు

మహిళలు అనేక రంగాల్లో వెనుకబడి ఉన్నారు. వీరిలో అక్షరాస్యత శాతం కూడ తక్కువగా ఉంది. గృహ అవసరాలకు తగినట్టుగా వీరుపనులు చేయటమేకాక, వివిధ వృత్తులలో, ఉద్యోగాల్లో కూడ పాలుపంచుకుంటున్నారు. తమ సమస్యలను తామే పరిష్కరించుకోవటానికి తగిన మానసిక చైతన్యం వీరికి అవసరం. ఇందుకు పుస్తక పఠనం ఎంతో దోహదకారి. మహిళల సమస్యలు పరిష్కరించటానికి ఎన్నో చట్టాలు ఉన్నప్పటికీ, ఆచరణలో అవి అమలు కావటం లేదు. మహిళలకు రాజ్యాంగ పరంగా ఉన్న హక్కులు

పొందే వీలు ఎప్పుడు కలుగుతుందంటే, వాటిని వారు తెలుసుకొని అవగాహన చేసుకున్నప్పుడే. ఇలా తమ సమస్యలను తామే పరిష్కార కర్తలం కాగలమనే ఆత్మ విశ్వాసం మహిళలకు పుస్తక పఠనం ద్వారానే కలుగుతుంది. దురదృష్టవశాత్తు మహిళలకు పుస్తక పఠనం పట్ల ఆసక్తి చాల తక్కువగా ఉంది. పుస్తకాలు చదవటానికి తగిన ప్రోత్సాహక పరిస్థితులు కూడ వీరికి లేవు. పౌర, శాఖా గ్రంథాలయాల్లో మహిళా పాఠకుల సంఖ్య వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. నూతన పంచాయతీరాజ్ చట్టాల ప్రకారం మహిళలు గ్రామీణస్థాయి అంటే మండల ప్రాదేశిక (యం.పి.టి.సి)లనుండి జిల్లా పరిషత్ ప్రాదేశిక (జడ్.పి.టి.సి) సభ్యురాళ్ళవరకు, ఇతరత్రా ప్రజాప్రతినిధుల ఎన్నికకు రిజర్వేషన్లు కలిగి గెలుపొందుతున్నారు. వీరికి సామాజిక సమస్యలు పంచాయతీ రాజ్ చట్టం వివరాలు, మానసిక వికాసం, వ్యక్తిత్వ వికాసం కలిగించుకునేందుకు తమను ఆయా ప్రాంతాల్లో గెలిపించిన ప్రజలను చైతన్య పర్చటానికి కావల్సిన ప్రతిభను సామర్థ్యాన్ని పుస్తక పఠనం ద్వారానే పొందగలుగుతారు. గ్రంథాలయ సేవల వినియోగం (Users Education) గురించి మండల, తాలూక, జిల్లా స్థాయిల్లో నిర్ణీత కాలావధిలో కార్యక్రమాలను నిర్వహిస్తే బాగుంటుంది. ఒక్క మహిళలకే కాదు, వివిధ వర్గాల వారికి కూడ ఈ పద్ధతినే చేపట్టవచ్చును. తద్వారా పౌర గ్రంథాలయాల్లో పాఠకుల సంఖ్య గణనీయంగా పెరిగే వీలుంది.

## భవిష్యత్తులో గ్రంథాలయాల పాత్ర

రాబోయే కాలంలో గ్రంథాలయాల సేవలు మరింత విస్తృతం కావల్సిన అవసరం ఉంది. ప్రజల ఆసక్తులను అభిరుచులను డిమాండును పరిగణనలోకి తీసుకొని పఠన సామగ్రిని సేకరించటం జరగాలి. ముఖ్యంగా ఆధునిక పద్ధతుల్లో గ్రంథాలయాలను తీర్చిదిద్దటం ప్రధాన విషయం కావాలి. ఇంతే కాకుండా గ్రంథాలయాలు కేవలం పుస్తకాలను అందించే సంస్థలుగానే కాక సామాజిక విషయాలు, సంప్రదాయ రుగ్మతలకు ప్రజానీకం లోనుకాకుండ జనచైతన్య నిలయాలుగా గ్రంథాలయాలు రూపుదిద్దుకోవల్సిన అవసరం ఉంది. ఏ ఒక్కరి వైపు నుండో ప్రయత్నాలు జరిపితే ఈ కార్యక్రమం సఫలం కాదు. ఇందుకు ప్రభుత్వం, ప్రజలు, పౌర గ్రంథాలయాల ఉద్యోగులు సమిష్టిగా కృషి చేస్తేనే కార్యసిద్ధి కాగలదు.

# 3.18 ప్రజాస్వామ్య వ్యవస్థలో అంచెలంచెలుగా ఎదిగిన పౌర గ్రంథాలయాలు

- యల్.యస్.ఆర్.సి.వి. రమేష్,
- టి. దామోదరం,
- వి. సాంబశివరావు

సామాన్యునికి సైతం అందుబాటులో ఉండి, వారిని విద్యావికాస వంతులను చేయటంలో పౌరగ్రంథాలయాల పాత్ర ముఖ్యమైనది. ఒక్క మాటలో చెప్పాలంటే వాటిని 'పౌర విశ్వవిద్యాలయాలు'గా అభివర్ణించవచ్చు. సుదీర్ఘ పోరాటాల చరిత్ర, ఎందరో మహనీయుల శ్రమ ఫలితమే నేటి పౌరగ్రంథాలయాల పటిష్టతకు కారణాలుగా చెప్పవచ్చు. జాతీయ అభివృద్ధిలో వీటి పాత్ర ఎంతో విలువైనది. పౌర గ్రంధాలయాలు ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏ విధంగా అభివృద్ధిని సాధించాయో పరిశీలిద్దాం.

పుస్తకాలను సరియైన పద్ధతిలో ఉపయోగించని యెడల వాటి ద్వారా ఎలాంటి ప్రయోజనాన్ని పొందలేము. వాటిని సద్వినియోగ పరచటానికి చక్కని పుస్తక పరిజ్ఞానం అవసరం. విజ్ఞానాన్ని, సమాచారాన్ని అందించటం ద్వారా ప్రజలలో చైతన్యాన్ని తేవటంలో పౌరగ్రంధాలయాల భూమిక గురుతరమైనది. ప్రజలకు విజ్ఞానాన్ని అందించటమేగాక వారి ఆలోచనా సరళిని అభివృద్ధి చేయటానికి వీలు కల్పిస్తాయి. పౌరగ్రంధాలయాల స్థాపనకు అనేక పోరాటాలు మన చరిత్రలో దర్శనమిస్తాయి. ప్రజాస్వామ్య గమన సూత్రాలకు అనుగుణంగా పౌరగ్రంధాలయాలు అంచెలంచెలుగా పురోగతి సాధించిన తీరు అద్వితీయమైనది.

నిజానికి పౌరగ్రంధాలయాల స్థాపనకు ముఖ్యకారణం అచ్చు వేయబడిన వస్తువులను భద్రంగా పరిరక్షించటమే. చదువు అనేది ఆరోజుల్లో ఒక గొప్ప విషయం. గ్రంథాలయ సేవలు కేవలం ఉన్నత కుటుంబీకులకు మాత్రమే పరిమితంగా ఉండేవి. పుస్తకాలను పవిత్రంగా భావించి, కేవలం ఉన్నత కులాలవారు వాటిని ఉపయోగించేవారు. చీకటి గదులలో పుస్తకాలను భద్రపరిచి సూర్యకాంతి కూడాలోనికి పోకుండా చూసేవారు.

పందొమ్మిదవ శతాబ్దం మధ్యకాలంలో గ్రంధాలయ సేవలు అన్ని తరగతులు వారికి విస్తరించాయి. దీని కారణంగా ఉన్నత కులాల వారిలో ఈర్ష్యాద్వేషాలు, కుట్రలు

మొదలయ్యాయి. ఈ సమయంలో పౌరగ్రంథాలయాల ఉద్యమం రూపుదిద్దుకొంది. ఎడ్వార్డ్స్ మరియు ఎవార్ట్ అనే మహనీయులు పౌరగ్రంథాలయాల విశిష్టతను చాటి చెప్పారు. మాన్‌చెస్టర్ అనే ప్రదేశంలో పౌరగ్రంథాలయాన్ని స్థాపించి ఉచితంగా సేవలందించి సామాన్య ప్రజలను వ్యాపారస్తులను జాగృత పరిచారు. త్రాగుబోతులు నేరగాళ్ళను మత్తునుండి బయటకు తెచ్చేందుకు శ్రమపడ్డారు. పారిశ్రామికవేత్తలను ఆకర్షించిన విషయం ఏమిటంటే వారు శ్రమ జీవులలో సాంఘిక దృక్పథం కలిగేట్టు చేసిన వైనం. ఏది ఏమైనప్పటికి ఇంగ్లాండులో గ్రంథాలయాలు అభివృద్ధిని సాధించి ఆచరణలో ఉచిత గ్రంథాలయసేవలను విస్తరింపజేయటానికి చాలాకాలం పట్టింది.

ఇదే సమయంలో అమెరికాలో ఫిలాంత్రఫిష్టుల సహాయంతో పౌరగ్రంథాలయాలు అభివృద్ధి చెందాయి. ప్రజల సహకారంతో సరియైన అవగాహనతో ఆంగ్లేయ గ్రంథాలయాలవలె పురోభివృద్ధి సాధించాయి. మస్సాచుసెట్స్ గ్రంథాలయ బిల్లు (1851)లో పేర్కొనబడినట్లుగా మానవ పరిజ్ఞానం అభివృద్ధి పరిచే సాధనాలుగా పరిమిత ఖర్చుతో పౌరగ్రంథాలయాలు స్థాపించబడినాయి. మనము తెలుసుకున్న విషయం ఏమిటంటే పౌరగ్రంథాలయ వ్యవస్థలో పురోభివృద్ధి సాధించిన భారత్, ఇంగ్లాడ్, అమెరికా వంటి దేశాల్లో ప్రజాస్వామ్య వ్యవస్థ అమలులో ఉంది. ప్రతి వ్యక్తికీ విద్యా సదుపాయాలు, ప్రతి వ్యక్తి తన ఓటు హక్కును సక్రమంగా వినియోగించుకొనుట వంటి అంశాలు 1848 సంవత్సరం నుండి ప్రారంభమైనవి. అయితే గ్రంధాలయ సేవలను మాత్రం వారు వినియోగించుకోలేదు. ఈ నేపథ్యంలో ఇతర సంస్థలు, రాజకీయంగా ప్రజలను జాగృత పరిచేందుకు ఆవిర్భవించాయి. మొదటి ప్రపంచ యుద్ధం ఇంగ్లాడులోని గ్రంధాలయాలకు మంచి గుర్తింపునిచ్చింది. అప్పటినుంచి వాటిని విద్యా సంస్థలుగా పరిగణించటం ప్రారంభమైంది. 1927లో పౌరగ్రాంథాలయాల రిపోర్ట్ ప్రవేశపెట్టడం ద్వారా పౌరగ్రంధాలయాల ఉద్యమానికి మంచి చేయూత లభించింది.

పౌరగ్రంధాలయం ఒక సాంఘిక సంస్థగా ఆవిర్భవించి, పేద, ధనిక భేదం లేకుండా అందరికి ఉపయోగపడేలా అందుబాటులోకి వచ్చింది. ఇతర ప్రచారసాధనాలైన రేడియో, దూరదర్శన్, సినిమాతో పాటు పౌరగ్రంధాలయాలను కూడ ప్రచార సాధనాలుగా గుర్తించటం జరిగింది. ఒక సర్వే ప్రకారం అమెరికాలో పుస్తక పఠనం చాలా తక్కువని తేలింది. ప్రతి ఒక్కరూ రేడియో వింటారు. ప్రతి నలుగురిలో ఒక్కరు మాత్రమే పుస్తక పఠనం చేస్తారు. దీన్ని బట్టి రేడియో, దూరదర్శన్, సినిమాలకు పుస్తకం కంటే డిమాండ్ ఎక్కువని స్పష్టం అయింది. అయితే పుస్తక పఠనంపై మక్కువను పెంచి, ప్రజలను జాగృత పరచటంలో పౌరగ్రంథాలయాలు తమ భూమిక నిర్వహించాయి. విద్య, వృత్తి మరియు ఉద్యోగ పరంగా ప్రజలను ముందుకు

నడిపించటంలో తోడ్పడ్డాయి. పౌరగ్రంథాలయాల స్థాపనలో భారతదేశం గురించి నాలుగు మాటలు ఎక్కువ చెప్పవలసి ఉంటుంది. ఎందుకంటే ఇతర ప్రజాస్వామ్యం దేశాలైన ఇంగ్లాండు, అమెరికాలలో గ్రంథాలయ ఉద్యమం ఒక ప్రాంతానికే పరిమితమై తర్వాత అది వ్యాప్తి చెందినట్టు కనిపిస్తుంది. అయితే ప్రజాస్వామ్య వ్యవస్థకు అద్దం పట్టే భారతదేశంలో గ్రంథాలయ ఉద్యమాలు దేశం నలుమూలల ఒకేసారి ఉపందుకున్నాయి. స్వాతంత్ర్యం రాకమునుపే 1930లో ప్రారంభించారు. ఇందులో భారత గ్రంథాలయ పితామహునిగా డా॥ రంగనాథన్ చేసిన కృషి మహత్తరమైనది. దేశంలోని వివిధ రాష్ట్రాలలో గ్రంథాలయ ఉద్యమాలకు పునాది వేశారాయన.

ముందుగా 1930 సం॥లో బెంగాల్ రాష్ట్రంలో డా॥ రంగనాథన్ ఆధ్వర్యాన 'మోడల్ లైబ్రరీ బిల్"ను ప్రవేశపెట్టారు. కాని కొన్ని కారణాలవల్ల ప్రవేశ పెట్టిన బిల్లు జయప్రదం కాలేదు. అలాగే 1931లో మద్రాసు రాష్ట్రంలో గ్రంధాలయ శాసనం ప్రారంభించారు. అనేక మార్లు రాష్ట్ర శాసనసభలో ప్రవేశానంతరము చివరకు 1948లో ఆమోదం పొందింది. పౌరగ్రంథాలయాల స్థాపనలో ఆంధ్రప్రదేశ్‌కు ఒక ప్రత్యేక స్థానం ఉందని చెప్పాలి. ఆంధ్రప్రదేశ్ గ్రంధ భండాగార ప్రతినిధుల మహాసభ 1914 ఏప్రిల్ 10న విజయవాడలో జరిగింది. ఆనాటి నుంచి కొనసాగిన అనేక ఉద్యమాల ప్రతిఫలంగా 1961లో గ్రంథాలయ శాసనం అమలులోకి వచ్చింది. ఇలాగే కర్నాటక (1965), బొంబాయి (1967) ఇంకా జాతీయ స్థాయిలో 'యూనియన్ లైబ్రరీ బిల్లు (1965)' అమలులోకి వచ్చాయి.

పైన తెలిపిన విధంగా పౌరగ్రంధాలయాలు వడివడిగా పురోగతి సాధించాయి. డా॥ రంగనాథన్ తెలియజెప్పిన గ్రంథాలయ పంచ సూత్రాలను గమనిస్తే 'ప్రతి పుస్తకానికి ఒక పాఠకుడు, అలాగే ప్రతి పాఠకుడికి ఒక పుస్తకం, పుస్తకాలన్నీ ఉపయోగించుట కొరకు ఉద్దేశించినవిగా తెలుపబడ్డాయి. కాబట్టి ఒక పుస్తకం కొనేటప్పుడు సమాజ శ్రేయస్సుని దృష్టిలో పెట్టుకొని కొనటం, లేక సమాజ అవసరాలకు ఉపయోగ పడేటట్లు చూడటం ముఖ్యం.

విస్తరణా కార్యక్రమాల ద్వారా గ్రంధాలయాలలో పుస్తక పఠనం వల్ల కలిగే లాభాలను తెలియజేయవచ్చు. డా॥ రంగనాథన్ ప్రకారం దీన్ని ఒక సాంఘిక ఆలోచనా దృక్పధం ద్వారా పుస్తక పఠనానికి ప్రోత్సాహం ఇవ్వవచ్చు. ఒక గ్రంథాలయం విలువ దాన్ని ఎంత మంది పౌరులు వినియోగించుకుంటున్నారు అనే దానిమీద ఆధారపడి ఉంటుంది. అది క్రొత్తగా ప్రారంభించిన గ్రంథాలయ సంస్థ అయినప్పటికి ఏదో విధంగా ఎవరో ఒకరు దాన్ని వినియోగించుకొని లాభాన్ని పొందుతారు. అసలు గ్రంథాలయాన్ని ఉపయోగించుకోక పోవటానికి కారణాలు మూడు : 1. గ్రంథాలయసేవా దృక్పథం గురించి సరియైన అవగాహన

లేకపోవటం. 2. అపోహలు, మూఢ నమ్మకాలు, 3. అసలు పుస్తకాలను ఉపయోగించుకోవాలనే ఉద్దేశ్యం లేకపోవటం.

ప్రజలను జాగృత పరిచి గ్రంథాలయ విశిష్ట సేవలను ప్రచారం చేయటం ద్వారా కొంతవరకు పౌర గ్రంథాలయాల పురోగతి సాధ్యపడుతుంది. 1852లో ప్రజలను జాగృత పరిచేందుకు 'ఎడ్‌వార్డ్స్' అనేక ప్రసంగాలు చేయటం జరిగింది. అలాగే ప్రతి గ్రంథాలయ పాలకుడు ప్రజల వద్దకు వెళ్ళి గ్రంథాలయ సేవలను విశదీకరించి తెలియజేయటం ద్వారా ఈ సమస్య కొంతవరకు సుసాధ్యమవుతుంది. అయితే ఐరోపా దేశాలలో గ్రంథాలయ పాలకులు గ్రంథాలయ సేవలకు ఖరీదు కట్టడం ఇష్టపడరు. ఎందుకంటే వాటి ఉనికిని, వాటి స్థాపనా ఉద్దేశాన్ని అవి కోల్పోతాయని వారి నమ్మకం.

విస్తరణా కార్యక్రమాల ద్వారా గ్రంథాలయాల అభివృద్ధి చేసేందుకు డా॥ రంగనాథన్ కొన్ని అంశాలను సూచించారు.

1. చదువులేనివారికి పుస్తకాలను, అలాగే చదవుకోవటానికి ఒక ప్రత్యేక వ్యవస్థను స్థాపించటం.
2. చదువుకున్నవారి సంఘాల ఏర్పాటు, ఇంకా పుస్తకాల ద్వారా వివిధ కార్యక్రమాల ప్రతిపాదన.
3. పౌర సంబంధాలు అభివృద్ధి చేయుటకు, దృశ్య శ్రవణ కార్యక్రమాల ఏర్పాటు.
4. విషయ సంబంధమైన పుస్తక పట్టికలు తయారు చేయుట.
5. వైజ్ఞానిక ప్రదర్శనలు, పుస్తక ప్రదర్శనలు ఏర్పాటు చేయడం.
6. గ్రంథాలయ వారోత్సవాలు, పండుగలు మరియు సంవత్సరంలోని ముఖ్య తేదీలను ఆనందోత్సాహాలతో జరుపుకోవటం.

చివరగా, ఆధునిక సమాచార విజ్ఞానం గురించి నాలుగు మాటలు చెప్పుకుందాం! నిజానికి ఈ ఆధునిక సమాచార విజ్ఞానం అనేది కేవలం పరిశోధనా గ్రంథాలయాలకు, ప్రత్యేక గ్రంథాలయాలకు మాత్రమే పరిమితమైనది. దీనికి కారణాలు 1. సమాచార వ్యాప్తిలో జాప్యం. 2. నిరక్షరాస్యత కారణంగా గ్రామీణులలో ఆధునిక సమాచార విజ్ఞానం తెలుసుకోవాలనే ఆసక్తి లేకపోవడం. 3. ఆధునిక సమాచార విజ్ఞానం, దాని ప్రాముఖ్యతను తేలియపరిచేందుకు వృత్తిపరంగా సహాయకుల కొరత. 4. ప్రభుత్వం వారు తగినన్ని నిధులు మంజూరు చేయకపోవడం.

గ్రంథాలయసేవలు విస్తరింప చేయుటకు సమాజంలోని అపోహలను, మూఢనమ్మకాలను దూరం చేయవలసి ఉంటుంది. అలాగే గ్రంథాలయ పాలకులు తమశక్తి మేరకు గ్రంథాలయ సేవలను సామాన్య మానవునికి సైతం అందజేయడం ద్వారా అందరూ సమానమనే భావన ఏర్పడుతుంది. ఎన్నో ఉద్యమాల కృషిఫలితమే నేటి పౌరగ్రంథాలయాల సుస్థిరతకు కారణం. ఎందరో మహనీయుల శ్రమ ఫలితాన్ని పరిరక్షించి ప్రజాస్వామ్య వ్యవస్థకు వెన్నెముకలైన పౌరగ్రంథాలయాల పురోగతికి నడుంకడదాం!!

## 3.19 ప్రగతి సాధనకు గ్రంథాలయ ఆవశ్యకత

**- జి. నరసింహమూర్తి.**

గ్రంథాలయాలు విజ్ఞాన ఖనులు, సమాజానికి తలమానికాలు. విజ్ఞానాన్ని భద్రపరచటం, వినిమయం చేయటం వాటి బాధ్యత.

భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపజేసే విద్యావిధానం ఒక ప్రత్యేక పద్ధతిలో జరిగింది. ప్రాచీనకాలంలో విద్య గురుముఖంగా జరిగేది. గురుశిష్యుల మధ్యనే ఈ విద్యావిధానం కొనసాగింది. వక్త-శ్రోతల సంబంధంగా అనాదికాలంగాఅందించబడ్డ విజ్ఞానం ఆనువంశికంగాను, ముఖస్థంగాను తరతరాలకు అందించబడింది. సాంప్రదాయకంగా వేదవ్యాసుని ముఖం నుంచి చెప్పిన భారతానికి గణపతి వ్రాయసకాడుగా ఉండటం నాటి విద్యావిధాన విశిష్టత. విద్యాబుద్ధులు నేర్పటానికి గురుకులాలకు విద్యార్థులను పంపించేవారు. ఈ విద్యావిధానం కేవలం రాజకుటుంబాలకు, తదితర ఉన్నత కుటుంబాలకు మాత్రమే పరిమితం.మధ్యతరగతి కుటుంబాల వారికి విద్యాభ్యాసం మీద ఆలోచన గూడ రాలేదు. సామాన్యులు వారి కుల వృత్తులలో నిమగ్నమై కాలం గడిపేవారు.

వర్ణాశ్రమ ధర్మాలననుసరించి ప్రజలు తమ జీవితాలను సుఖమయం చేసుకునే వారు. కాలచక్రంలో క్రమంగా విద్యా జిజ్ఞాస ప్రబలమై కుల వృత్తులపై విస్తర ఆపేక్ష కలిగి ప్రజలు చైతన్యవంతులైనారు. నేటికీ వృత్తి విద్యకు ప్రభుత్వాలు ఎంతో ప్రాధాన్యతనిస్తున్నాయి.

విద్యావిధానం సరియైన పద్ధతిలో జరగాలంటే చైతన్యం రావాలంటే గ్రంథాలయాల ద్వారానే సాధ్యమవుతుంది. ప్రాచీన గ్రంధాలయాలు జ్ఞాన భండాగారాలుగా పనిచేస్తూ, ఏ కొద్ది మందికో అందుబాటులో ఉండేవి. మధ్యయుగ కాలంనాటికి గ్రంథాలయాల పరిధి కాస్త విస్తరించి కాగితం, ముద్రణ సౌకర్యాలు ఏర్పడ్డాయి. పుస్తకాలు అచ్చు వేయించటం ద్వారా గ్రంధాలయాల ప్రాముఖ్యత పెరిగింది. అచ్చు పుస్తకాలు, వ్రాతప్రతులు ఉన్న స్థలం అతి పవిత్రంగా చూడబడింది. ఈ కాలంనాటికి గ్రంధాలయాలు కేవలం రాజవంశీయులకు మాత్రమే ఉపయోగపడ్డాయి. సామాన్యులకు అవి గగనకుసుమాలే. పుస్తకాలు గ్రంథాలయ ప్రాంగణంలో మాత్రమే ఉపయోగించుకోవడానికి వీలుండేది. ఈ పద్ధతి క్రమేణ ఆచూకీ సేవకు, విలువ గలిగిన మరియు అపురూప గ్రంధాల ఆదాన ప్రదానాలకు నియంత్రణ ఆంక్షలకు రూపకల్పన చేసింది. "పుస్తకం.....పరహస్తం గతంగత:" అనేదే ఆనాటి విశ్వాసం.

ఆచూకీ సేవకు ప్రాముఖ్యత గూడా పెరిగింది. 16వ శతాబ్దంలో ముద్రణ యంత్రాలు భారతదేశంలో అమలులోకి రావటం ద్వారా గ్రంథ ప్రచురణలు అనేకంగా జరిగాయి. దీనితో పుస్తకాలు, వార్తాపత్రికలు, విస్తారంగా ప్రచారంలోకి రావటంతో గ్రంథాలయాలు సామాన్యులకందుబాటులోకి వచ్చాయి. సంచార గ్రంథాలయాలు ఏర్పడ్డాయి. విద్యావిధానం రానురాను గ్రంథాలయాల ద్వారా జరగడానికి అవకాశాలు కల్పించబడ్డాయి. నేటి గ్రంథాలయాలు గురుశిష్యులకు, పండితులకు, విమర్శకులకు, శాస్త్రజ్ఞులకు అవసరమై పఠన వస్తువల సమీకరణలో ఉపయోగపడుతున్నాయి. ప్రతిపౌరునికి గ్రంథాలయాలు అందుబాటులోకి రావడానికి ప్రజాసంస్థలు, వ్యక్తులు ముందుకువచ్చి ధర్మ గ్రంథాలయాలు ఏర్పరచి ఉచిత గ్రంథాలయ సేవలందిస్తున్నారు. రాష్ట్రవ్యాప్తంగా గ్రంథాలయాలు ఏర్పడ్డాయి. విస్తృత విజ్ఞాన ప్రసారానికి, స్వయం విద్యావిధానానికి గ్రంథాలయాలు దోహదకారులయ్యాయి.

ఇప్పటి పౌరగ్రంథాలయ ప్రయోజనం ఉచితంగా సమాచారాన్ని, సేవలనందించటమే. గ్రంథాలయ శాస్త్రవేత్త డాక్టర్ రంగనాథన్ ఆవిష్కరించిన గ్రంథాలయ పంచ సూత్రాలు గ్రంథ విమయానికి గీతోపదేశమయింది. అవరోధం లేకుండ గ్రంథాలయ ప్రవేశం అనే భావన పౌరగ్రంథాలయాలు విజయవంతంగా అమలు పరిచాయి. ఈ భావన క్రీస్తు పూర్వమే అంకురించినట్లు ఆధారాలున్నాయి.

గ్రంథాలయ విజ్ఞానాన్ని పాఠకులకందించే విధి గ్రంథపాలకులదే కాబట్టి ప్రారంభం నుండి విద్యాధికులయిన వారిని, సంస్కారవంతులను గ్రంథపాలకులుగా నియోగించేవారు. గ్రంథపాలక వృత్తి గౌరవమయినదిగాను, ఉన్నత హోదాగాను గుర్తింపబడింది.

పౌర గ్రంథాలయాన్ని శాసనం ద్వారా ఇప్పటివరకు దేశంలోని 10 రాష్ట్రాలలో ఏర్పరిచారు. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ చట్టం 1960లో ఏర్పడింది. గ్రంథాలయ సలహా సంఘాలు ఏర్పడ్డాయి. సిన్హా కమిటీ నివేదికలో పౌరగ్రంథాలయ నిర్వహణ గురించిన అంశాలను చేర్చారు అవి :

**(1)** ప్రజా ధనము చేతనే పౌరగ్రంథాలయాల నిర్వహణ,

**(2)** విద్యా సంస్థలకనుబంధంగా గ్రంథాలయ సేవలు,

**(3)** పాఠకులకు అవసరపడే సమాచారాన్ని ఉచితంగాను, నిష్పక్షపాతంగాను, ఈర్ష్యాద్వేషాలకతీతంగాను అందించే విధంగా గ్రంథాలయాలను గుర్తించటం.

గ్రంథాలయ శాసనం ఆస్తిపన్నులో రూపాయికి 8 పైసలవంతున గ్రంథాలయ పన్ను విధించింది. ప్రజలందరు తెలిసో, తెలియకో గ్రంథాలయ పన్ను చెల్లిస్తూనే ఉన్నారు. అయితే

గ్రంథాలయాలు, వాటిని ఉపయోగించుకునే విధానం మాత్రం గ్రామ ప్రాంతంలో ఉండేవారికంటె పట్టణవాసులకే ఎక్కువగా విదితమైంది.

గ్రామీణ ప్రాంతాలు గ్రంథాలయాల ఏర్పాటుకు నోచుకోలేదు. ప్రభుత్వము వారి లెక్కల ప్రకారం గ్రంథాలయాలు పట్టణాల్లోను, గ్రామ ప్రాంతాల్లోను ఏర్పాటు చేశారు.

| గ్రంథాలయాల వివరాలు | గ్రంథాలయాల సంఖ్య |
|---|---|
| 1. రాష్ట్ర ప్రభుత్వ గ్రంథాలయాలు | 8 |
| 2. జిల్లా కేంద్ర గ్రంథాలయాలు | 23 |
| 3. శాఖా గ్రంధాలయాలు | 1448 |
| 4. గ్రామీణ గ్రంథాలయాలు | 355 |
| 5. బుక్ డిపాజిట్ కేంద్రాలు | 576 |
| 6. సంచార గ్రంధాలయాలు | 98 |

రాష్ట్రంలోని 2508 గ్రంథాలయాలు ప్రజలకు సేవలందిస్తున్నాయి. అయితే వీనిలో 25% గ్రంధాలయాలు ధనాభావం కారణంగా నడపడమే లేదు. ప్రభుత్వం వారి గ్రంధాలయాలు 8 జిల్లా ముఖ్యకేంద్రాలలో మాత్రమే పనిచేస్తున్నాయి. జిల్లా గ్రంథాలయ సంస్థ వారి అధీనంలో అన్ని జిల్లా కేంద్రాలలోను 1448 మండల స్థాయి అంతకుమించి ఇతర ప్రాంతాలలో గ్రంథాలయాలకు, కావలసిన ఆర్థిక వనరులు గ్రంధాలయ సెస్సు నుండి ఏర్పాటు చేయడం జరిగింది. ఇంతేగాక గ్రామీణ గ్రంధాలయాలు, బుక్ డిపాజిట్ కేంద్రాలు, సంచార గ్రంథాలయాల సంఖ్య నామమాత్రమే. వీటి నిర్వహణపై ప్రభుత్వం వారి నియంత్రణ సరిగా లేక గ్రంధాలయాలు సరిగా నడవడంలేదు. దేశానికి స్వతంత్రం వచ్చి 50 సంవత్సరాలవుతున్నా గ్రంధాలయాలకు స్వంత భవనాలను కూడా సమకూర్చుకోలేకపోవడం గ్రంధాలయ రంగంపై మనకున్న నిరాదరణకు నిదర్శనం. గ్రంధాలయాలన్నింటికి భవనాలు విధిగా ప్రభుత్వం వారు ఏర్పాటు చేయాలి. దేశ భవిష్యత్తుకు అక్షరాస్యత, వయోజన విద్యలు వెన్నెముకలవంటివి. ఇవి గ్రంధాలయాలను ఆధారంగా చేసుకుని ప్రణాళిక చేపట్టినట్లయితే గ్రంథాలయాల అభివృద్ధితో పాటు దేశాభివృద్ధికి దోహదమవుతాయి. ప్రతి గ్రంధాలయానికి విధిగా ప్రతి సంవత్సరం కొంత ఆర్థిక నిధులు చేకూర్చాలి. అప్పుడే గ్రంధాలయం విలువ పెరిగి ఆదర్శప్రాయమై వెలుగొందగలదు. మండలానికో గ్రంథాలయం విధానం ద్వారా ప్రభుత్వం వారి విధానం సఫలీకృతమయింది. మండల సమాచార కేంద్రాలు నెలకొల్పటం విశేషమే అయితే సరియైన సమాచార కేంద్రాలుగా నిలదొక్కుకోవటానికి ప్రభుత్వం వారి చొరవ అవసరం. రాష్ట్ర జనాభాను దృష్టియందుంచుకొని చూచినట్లయితే ప్రస్తుత గ్రంధాలయాల

సంఖ్య అతి తక్కువగా కన్పిస్తుంది. గ్రంథాలయాల వినియోగాన్ని చూచినట్లయితే గ్రంథాలయాల ఆవశ్యవత విదితమవుతుంది.

| గ్రంథాలయాలు | పుస్తకాలసంఖ్య | వినియోగదారులు | పాఠకులు-దర్శకులు |
|---|---|---|---|
| (ఎ) ప్రభుత్వ గ్రంథాలయాలు | 7,87,481 | 7,40,800 | 3,50,00,000 |
| (బి) జిల్లా గ్రంధాలయ సంస్థ గ్రంధాలయాలు | 1,06,94,237 | | |

రాష్ట్ర జనాభాతో పోల్చినట్లయితే ప్రతి పౌరునికి కనీసం ఒక పుస్తకం చొప్పున గూడా గ్రంథాలయాల్లో సమకూర్చలేక పోవడం కనిపిస్తుంది. గ్రంథాలయ వినియోగం విషయానికి వస్తే 10% పౌరులు గూడా గ్రంథాలయాలను ఉపయోగించుకోవడంలేదు. దీనికి కారణం గ్రంథాలయాల్లో వారికి సరిపోయే పుస్తకాలు లభ్యం కాకపోవడమే. అక్షరాస్యతను సంరక్షించుకోవటానికి, పౌరగ్రంధాలయ సేవలు ఎంతో అవసరం. ఈ విధానం అమలులోకి ఖచ్చితంగా వచ్చినప్పుడే అక్షరాస్యత సార్ధకమవుతుంది. ప్రత్యేక ప్రణాళికల ద్వారా చేసే ఖర్చు వృధా కావడమేగాని సార్ధకతకు ప్రయోజనం లేదు.

విద్యా ప్రజాస్వామ్యం విద్యా ప్రణాళికల్లో మౌలికంగా చేర్చబడింది. అంటే పౌరులందరికి ప్రాంతీయ, ఆర్థిక, సాంస్కృతిక, మత తరతమ భేదాలు లేకుండా విద్య గరపడానికి ప్రవేశం కల్పించబడింది. స్వతంత్రం సిద్ధించి 50 సంవత్సరాలయినప్పటికి ఈ ప్రతిపాదన కాగితాలకే పరిమితమయింది. ఈ పాటికే నిరక్షరాస్యత నామరూపాలు లేకుండా పోవాల్సి ఉండేది. కాని 50 సంవత్సరాల పునర్విమర్శలో ప్రాథమిక అంశంగా నిరక్షరాస్యత నిర్మూలన చెప్పలేని దుస్థితిలో ఉందని పేర్కొనాలి. ఇప్పటికైనా అధికారులు గ్రంధాలయ సేవలనాధారంగా విద్యా వ్యాప్తి, అక్షరాస్యతలను అనుసంధానం చేసిట్లయితే కనీసం శతవార్షికోత్సవాల వరకైనా 100% అక్షరాస్యత సాధించగలగడానికి దోహదపడుతుంది. విద్యా వ్యాప్తి విషయంలో గ్రంధాలయాల పాత్ర అత్యున్నతమైనదిగా గుర్తింపబడాలి.

5 దశాబ్దాల భారతీయ స్వాతంత్ర్యం విద్యాపరంగా, అక్షరాస్యతా పరంగా ఇంకా సాంఘిక-ఆర్థిక పరంగా, సాంస్కృతిక పరంగా గ్రంథాలయాలను తోడు చేసుకొని ఏ మాత్రం ప్రగతి సాధించింది అని కనీసం గ్రంధపాలక వృత్తి సముదాయమైనా ఆలోచించాల్సి ఉంది. ఇది యావజ్జాతికి అవసరమైన విషయమే. ఎవరూ ఎక్కువగా ఈ సమస్యను పట్టించుకోలేదు. అందువల్ల గ్రంథపాలకులమైన మనం మన వంతు సేవ ఏం చేశాము అని ఆలోచించుకోవలసిన తరుణమిది. మన జాతీయ గ్రంధాలయం ఆశించిన ప్రగతిని సాధించలేదు. జాతీయ హెూదా పొందిన ఇతర గ్రంథాలయాలు కూడా పెద్దగా విజయవంతంఅయినాయని చెప్పలేము. విద్యా గ్రంథాలయాలు చాలా మట్టుకు అమలులోకి వచ్చి సంఖ్యాపరంగా, సంకలనాల

పరంగా వృద్ధి చెందటం కనిపిస్తున్నది. పౌర గ్రంథాలయాలు కూడా అక్కడక్కడ బలపడ్డాయి. అయితే సేవల విషయంగా సంతృప్తికరమైనటువంటి స్థాయిని అందుకోలేదు. సంకలనాలు తరచు ఉపయోక్తల అవసరాలకు, ఆసక్తులకు దూరంగానే ఉన్నాయి. ప్రజలకేమి కావాలి, వారి అవసరాలెటువంటివి, వారి ఆసక్త విషయాలేమి, ఎటువంటిపఠనా వస్తువులను ఎన్నుకోగలరు, ఏ విధమైనటువంటి సేవలు వారికి సంతృప్తికరం? మొదలైన కీలక విషయాలు మన గ్రంథాలయాల వ్యవస్థాపన, విర్వహణ మొదలైన కార్యకలాపాల్లో విలీనం కాలేదు. దూరదర్శన్, ఆకాశవాణి, వార్తాపత్రికలు మొదలైన బహుళ సంసర్గ మాధ్యాల ప్రభావం విపరీతంగా కానవస్తున్నది. వాటివల్ల సమాచార ప్రసారం, విజ్ఞాన వివరణ ఇత్యాది సదుపాయాలున్నా పుస్తకాల వల్ల ప్రాప్తించగల ప్రయోజనాలు లేవు. మనిషిని తీర్చిదిద్దేది పుస్తకాది పఠనవస్తువే. వ్యక్తిత్వాన్ని ప్రసాదించేదికూడా పుస్తక పఠనమే. నికరమైన, లాభదాయకమైన విజ్ఞానం మానవుని మేధా సంపత్తిని, దక్షతను, శక్తిసామర్ధ్యాలను పెంపొందించటానికి దోహదమయ్యేది కూడా మంచి పుస్తకమే. విద్యార్జనకు సాంస్కృతిక సముపార్జనకు, జాతీయతా లక్ష్యాభివృద్ధికి సమైక్యతకు సమతకు అన్నిటికి కూడా గ్రంథాలయ క్షేత్రం ఈ దేశంలో సాధించిన విజయంఎటువంటిది? అసలు ఏమైనా సాధించటం జరిగిందా? ఎటువంటి ఆధారాలున్నాయి? మొదలైనటువంటి విషయాలను గ్రంథపాలకులు ఆలోచించవలసిన అవసరమెంతైనా ఉంది. స్వర్ణోత్సవ కార్యకలాపాల్లో ఎక్కడా ఒక గ్రంథపాలకుడు కూడా కనపడకపోవడం విచిత్రమే.

# 3.20 ROLE OF VILLAGE LIBRARIES IN SOCIAL AND POLITICAL REFORM IN KERALA

**- R. Raman Nair**

High degree of participation by all classes of people at various levels was the distinctive feature of National movement in Kerala. This was made possible by the village libraries that existed far and wide in the State. They were established and maintained from the second half of the last century by a people's movement. It had its growth parallel to the movements for political, economic, and social reform; supporting them and at the same time getting inspiration from them.

Congress and a few other political parties were the important vehicles that carried on the National Movement in other parts of the country. In Kerala even though their influence was significant they were not the main vehicles. There were other significant movements that came in a series which are to be considered as parts of a lengthy process of the evolution of National Movement. Most of these were geared up by groups of people connected to the local libraries and literary clubs. These movements emerged as local and regional organizations aiming at social and cultural development. At the initial stage their activities were non-distinguishable from the extension activities of the village libraries and connnected cultural groups. Later they developed into or merged into elite based quasi-revolutionary organizations with political motives. These movements applied the techniques perfected through continuous discussions on how the opposition might best be expressed in the political situation in which the people were. In most places the libraries and people connected to the movement facilitated these discussions and planning.

With the libraries enabling the emergence and marshalling of people's opinion all classes of people in Kerala exhibited a high degree of political and social consciousness. They got themselves

actively involved in mass agitations against royal autocracy, bureaucratic misrule, caste tyranny and alien domination. So no account of national movement in pre 1947 Kerala can be limited merely to the growth and work of political parties. Underlying everything was the nature of the Society in which they operated and the institutions like the local libraries that blend in with the society and enable the political organizations to establish their foothold.

The situations that existed in Kerala also necessitated a people's library movement for the existence and activities of the political parties that emerged, the social reform movements that became urgent, the communal and religious organizations that came into existence, and the struggle for responsible government in the State.

Creating public opinion and spreading political ideas waranted an educated and informed public. Political workers therefore have to give more emphasis to social education activities. It necessitated the establishment in villages some centres for the communities education and information. Small reading rooms and libraries were found to be the centres that could be established and maintained by village communities with their own contributions and without any outside support.

It was the curiosity for the daily news that prompted the speedy establishment of thousends of village libraries in a very short period. As most people cannot afford a daily newspaper at their home, at every house where a paper was subscribed or persons connected to political movement lived people of nearby houses assembled. Sri P.N. Panikkar who was the leading figure in Kerala's library movement remembered the starting of one village library. Sanathana Dharma Vayanasala which originated from such house assemblies. "Only a few important wealthy persons could subscribe to newspapers in villages. Due to my thirst to know about the social and political movements that were blowing around I somehow managed to subscribe a newspaper at my house. It was 'Sreevaz humkodu National Daily'. Five to eight persons assembled daily at my house and they asked me to read the paper aloud. I felt

happy about it. I also used to read them biographies of great men on the days when we missed the paper. Sri P.N. Madhavan Pillai a friend of mine subscribed two other dailies and he had a small collection of books. Pooling together these books and newspapers in the room freely rented out for the purpose, we started a small village library". Like this houses in many of the villages of Kerala became places of reading and discussion and later got transformed into small libraries. People donated their personal collections and also subscribed newspapers and periodicals for these libraries. Educated youngsters from the villages offered their voluntary service to organize and manage these village libraries and reading rooms.

Sugunaposhini established in 1880 at Vanchiyoor, Trivandrum was the earliest notable attempt to establish a people's library. It organized a very big collection of Malayalam books. The SRMV Association Library at Karamana, Trivandrum started functioning in 1888. Janapradayini Library of Neyyattinkara, Sankara Vilasam Library of Chengannoor, and Chithira Tirunal Smaraka Granthasala of Trivandrum came into existence before 1920, due to peoples' intiative and effort. All these libraries conducted literary and cultural activities and discussions on topics of current interest. The contributions of Chithira Thirunal Smaraka Granthasala of Vanchiyoor to Kerala Culture and literature was enormous. For almost six decades it functioned in close association with the most notable political, cultural and literary figures of Kerala and spread the ideas of national movement.

The political and social activists found their natural base in these libraries, a local point from where they could spread their reform movements and activities. With this motive they infiltered in the existing people's libraries. They used the existing libraries and also established thousands of new ones in the places where they were not already existing.

The beginning of the Twentieth Century saw libraries sprouting up throughout the length and breadth of Kerala like mushrooms. While hundreds of libraries took birth every year, hundreds withered

away. The difficulties experienced in running them and the break down and collapse of several of them necessitated a well organized library movement to support them. In 1931 the first association of libraries 'Samastha Kerala Pustakalaya Samithi' was formed by the people. Later, 'All Travancore Granthasala Sangham, was formed and it assumed the title, 'Kerala Grandhasala Sangham, when Kerala State was formed. The contribution of these associations in training Keralas' rural people in democratic form of government and in creating political and social consciousness was immense.

Like the tea shops and pan shops in villages, the libraries, reading rooms and recreation clubs also became the centres that villagers could approach without any psychological barriers. There they shared their news and views. It was in such centres that the first political organizations of Kerala were formed; movements and the ideas of national unity and even independence tentatively put forward.

The influence of western education along with the awareness created by the discussions and debates at village libraries and reading rooms initiated most of the agitations and reform movements in Kerala. The exclusion of natives from higher grades in government service was severely criticised at the discussions in the libraries by youth within the state possessing high academic qualifications. This resulted in the constitutional agitation which began with the presentation of Malayali and Ezhava memorials in the last decade of Nineteenth century. They marked the emergence of new educated middle class as a force to be reckoned within the public life of Kerala. The vigourous public, compaigning which followed the submission of the memorials was also done through the village libraries, reading rooms and groups formed at such centres. Such agitations of the educated people for getting a share in administration awakened the middle class of Kerala to a sense of their inherent rights.

The western educated and progressive minded younger generation resisted outdated customs, traditions and family

organization. They .engaged themselves in many social reform activities forming groups; for which libraries served as bases

The rural libraries extended the influence of the press and together they supported the progress and success of national movement. In early period the Malayalam press was also concerned with social and religious affairs. Later politics assumed greater importance. Curiosity of the masses for the information and daily news caused by the eventual days of the freedom struggle further developed the spirit of library movement. In 1903 Indian National Congress held a large public meeting at Calicut. In 1916 a branch of Home Rule Movement was formed in Malabar. Civil Disobediance Movement of 1930-33 stirred the Kerala Society. In the fourties besides "Quite India Movement" the agitation for self Government in the Princely states of Kerala gathered momentum.

The newspaper, Malayala Monarma came into existence in 1890 followed by numerous other dailies and periodicals. Between 1899 and 1910 Swadeshabhimani K. Ramakirshnan Pillai edited the papers: 'Darpanam', 'Kerala panchika', 'Malayali', and Swadeshabhimani'. Copies of these news papers reached every village library. The articles which he wrote under the pseudonym, 'Keralan' were highly critical of the administration. He came to be hailed everywhere as a stout champion of popular liberties. In 1910 he was deported from the state and his paper and the press were confiscated to the circar. The secret meetings organised in libraries in Travancore condemned, the highhanded action of Government. But there were no public protests. In 1923 Sri K.P. Kesava Menon who has been connected for long to political, social and religious reform movements, associating with some other leaders raised public subscriptions and started Mathrubhoomi' to spread the message of freedom movement among the masses. In October 1924 another newspaper named 'Al-amin' was also started from Calicut under the Editorship of Mohammad Abdur Rahiman with the object of bringing the Muslims into the stream of national movement. Like this many people connected to the freedom struggle associated

Rs. 25,000/- to 30,000/-. The local candidate is being appointed to look after the library and he is paid nominal salary. The remaining Grama Panchayats are proposed to get the rural libraries at a phased manner. We have aimed to design these libraries to be not only reading centres but also a centre equipped with text books, reference books. Ultimately it is aimed to make these libraries as useful cultural and information centres for the village. I feel that the role of rural libraries is very important to accomplish these aims. The personnel strength in such libraries being skeletile, the potential and drive of the librarian become crucial. The Librarian not only a book-man for the readers but also is a Teacher-educator and a successful organiser of cultural and educational activities in the village. Some times I affraid how for our collegues at the grass route level succeed in fulfilling such obligations with obvious constants. Yet one can look forword towards betterment.

I wish authorities provide all required aminities and a conginial atmosphere for the rural libraries to dedicate themselves for a social cause on the way to our national re-construction among the host of activities at the library-cum-cultural centre are Audio Video Education, organising cultural activities and competitions like singing, drawing, quiz programmes, general knowledge programmes etc.

To conclude, I wish to share some of mine experiences in bringing between how things are and how they ought to be. First of all financial constraints are not permitting us to provide sufficient funds and inputs to our rural libraries to come out with the expected results and output. Owing to the shift of some of the responsibilities to the Zilla Panchayats there lies some confusion in personnel administration including problems arising out of decnetralization.

Despite all these one can look forward for a more meaningful use of rural libraries in the near future.

# 4.1 పౌర గ్రంథాలయాలు : ఉన్న వనరులతో ఉత్తమ సేవలు

- కస్తూరి రాంచందర్‌రావు

- జె. రమాదేవి

గ్రంథాలయాలు సేవా సంస్థలు. ముఖ్యంగా పౌర గ్రంధాలయాలు ప్రజల మానసిక, సాంస్కృతిక, ఆర్థిక అభివృద్ధిని పెంపొందించడానికి తోడ్పడతాయి. చదువరులు, పఠన సామగ్రి, ఆర్థిక వనరులు గ్రంథాలయ సిబ్బంది, గ్రంథాలయ భవనం, ఫర్నిచర్ మొదలగు అంశాలపై గ్రంధాలయ పనితీరు ఆధారపడి ఉంటుంది. ఈ అంశాలన్నీ ఒకదానిపై మరొకటి ప్రభావాన్ని చూపెడ్తూ వుంటాయి. ఉదాహరణకు ఔత్సాహిక చదువరులు, మంచి విద్యార్హతలు, శిక్షణ కలిగిన సిబ్బంది ఉండికూడా ఇరుకుగది, చాలీచాలని పఠన సామాగ్రి కలిగిన గ్రంథాలయం చదువరులకు సంతృప్తినిచ్చే సేవలను అందించలేదు.

అలాగే ప్రపంచంలో అధిక పుస్తక సంపద గలిగిన ఏ గ్రంథాలయానికైనా అన్ని రకాల పఠన సామగ్రిని సేకరించటానికిగానీ వాటిని చదువరులకు అందుబాటులోకి తేవటానికి గానీ వీలుపడదు. ఎందుకంటే, అందుకు కావల్సిన ధనం, స్థలం, సిబ్బందిని ఏదేశ ప్రభుత్వమూ సమకూర్చలేదు. అది అసాధ్యం కూడా.

పౌర గ్రంధాలయాలు ప్రజల నుండి సేకరించిన పన్నులు ప్రభుత్వం నుండి లభించే గ్రాంట్లతో నిర్వహింపబడతాయి. ఈ ఆర్థిక సహాయం కూడా పరిమితంగానే ఉంటుంది. ఒకవైపు వార్తాపత్రికలు విషయ పత్రికలు మ్యాగజైన్స్, పుస్తకాల ధరలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. కాని అందుకు తగినట్లు వార్షిక బడ్జెట్‌ను పెంచకపోగా, అందులోనే ప్రభుత్వం కోత విధిస్తున్నది. ఇటు చదువరుల సంఖ్య పెరుగుతూ ఉండి, వారికి అందించవలసిన స్వభావంలోనూ మార్పులు అనివార్యమవుతున్నాయి. ఇలాటి సమయంలో గ్రంథపాలకులు ఉన్న వనరులతోనే తమ గ్రంధాలయాలకువచ్చే చదువరులకు ఉత్తమ సేవలను అందించి వారిని ఎలా సంతృప్తి పరచాలన్నది ప్రస్తుత సమస్య.

ఈ సమస్యకు దిగువ తెలిపిన మూడు అంశాలు పరిష్కార మార్గాలుగా చెప్పవచ్చు.

1. గ్రంథాలయ సహకారం.
2. పౌర సంబంధాలు / ప్రజా సంబంధాలు.
3. మానవ వనరుల అభివృద్ధి.

## గ్రంథాలయ సహకారం

దేశానికి రాజైనా ఏదోఒక సందర్భంలో ఓ పేద ముసలమ్మ సహాయం కూడా కోరవల్సి రావచ్చనే సామెత మనం వింటూవుంటాం. మన నిత్య జీవితంలో ఒకరికొకరు సహకరించు కొనకపోతే ఏ పనీ చేయలేం. ఇంతకు ముందే చెప్పినట్లు ఏ గ్రంథాలయం స్వీయ వనరులపై (self sufficient) ఆధారపడియుండలేదు. కాబట్టి గ్రంథాలయాల మధ్య సహకారం తప్పనిసరి. తమ గ్రంథాలయంలో లభించని పఠన సామగ్రిని గురించి చదువరి అడిగినప్పుడు అది ఏ గ్రంథాలయంలో లభిస్తుందో తెలుసుకొని దానిని "అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతి" (ఇంటర్ లైబ్రరీలోన్) ద్వారా తెప్పించి ఆ చదువరికి ఇవ్వాలి. ఇందుకోసం పౌర గ్రంథాలయాలకు మరియు విశ్వవిద్యాలయ, ప్రత్యేక గ్రంథాలయాలకు మధ్య "అంతర్ గ్రంథాలయ అరువు ఒప్పందం" కుదుర్చుకోవాల్సి ఉంటుంది. ఈ సౌకర్యం ద్వారా ప్రస్తుతం ఉన్న పఠన సామగ్రితోనే చదువరులకు కొంత మేరకు సంతృప్తికరమైన సేవలను అందించవచ్చు.

## పౌర సంబంధాలు / ప్రజా సంబంధాలు

"నోరు మంచిదయితే ఊరంతా మంచిదంటారు" పెద్దలు. వివిధ రకాల మనస్తత్త్వం గలవారు, చీటికి మాటికి ఏదో ఒకటి అడిగే వారు .......... ఇలా ఎన్నో రకాల చదువరులు నిత్యం తటస్తపడుతుంటారు. ఇలాంటి వారితో ఓపికగా, చాకచక్యంగా మెలగాల్సి ఉంటుంది. అయితే ఒక విషయం మనం ఎల్లప్పుడు జ్ఞాపకం పెట్టుకోవాలి. మనది సేవాదృక్పథంతో విధి నిర్వహించే వృత్తి. చదువరులు పోట్లాటకు దిగారని మనం పోట్లాట పెట్టుకోగూడదు. వారికి సామరస్యంతో నచ్చచెప్పి సమస్యను పరిష్కరించాలి. చదువరులలో ఎక్కువ శాతం మంచి వారే ఉంటారు. వీరిని "ఫ్రెండ్స్ ఆఫ్‌ది లైబ్రరీ" అనవచ్చు. వీరి సహకారం గ్రంథాలయానికి తప్పక వుండాలి. సిటీ సెంట్రల్ లైబ్రరీ పరిధిలోని ఎన్నో శాఖాగ్రంథాలయాల్లో కూర్చునేందుకు కుర్చీలు, బెంచీలు లేవు. ఉన్నా విరిగిపోయి, కూర్చొని చదువుకోవడానికి వీలులేని స్థితిలో ఉంటాయి. కొన్ని గ్రంథాలయాలు, ఒకే గదిలో ఇరుకుగా, గాలి, వెలుతురు లేని ప్రదేశాల్లో వున్నాయి. ఇలాంటి గ్రంథాలయాల్లో గ్రంధపాలకులు, సహనంతో విధులను నిర్వర్తించవలసి ఉంటుంది. క్రొత్తగా వచ్చిన పుస్తకాలు, పత్రికల సమాచారాన్ని, అలాగే ఉద్యోగ ప్రకటనలు, ప్రవేశ పరీక్షల ప్రకటనల సమాచారాన్ని చదువరులకు అందిస్తూ వుండాలి. తద్వారా ప్రజా సంబంధాలు మెరుగుపడి ఉన్న వనరులతోనే ఉత్తమ సేవలను అందించేందుకు వీలుకలుగుతుంది.

## మానవ వనరుల అభివృద్ధి

విశాలమైన భవనం, ధారాళమైన గాలి, వెలుతురు, ఇతర సౌకర్యాలు మరియు ప్రామాణికమైన పఠన సామగ్రి వుండికూడా, సరియైన విద్యార్హతలు, శిక్షణ, అంకితభావంలేని సిబ్బంది వుంటే - మిగతావన్నీ నిరర్ధకమౌతాయి. ఏ దేశస్థులైనా మానవులంతా ఒకటే. కాని వారిలో వున్న నిగూఢమైన శక్తిని పూర్తిగా వినియోగించుకోవడంపైనే ఆ దేశపుఅభివృద్ధి ఆధారపడి ఉంటుంది. రెండు ప్రపంచ యుద్ధాలలో సర్వనాశనమైన జపాన్ అతికొద్ది కాలంలోనే వేగం పుంజుకుని అమెరికాలాంటి దేశానికి ధీటుగా అన్ని రంగాలలో అభివృద్ధి సాధించిందంటే, మానవ వనరుల అభివృద్ధికి ఆ దేశపు ప్రభుత్వం చేసిన కృషి, ప్రయత్నాలే అందుకు కారణం. కాబట్టి పౌర గ్రంథాలయాల్లో పనిచేసే సిబ్బంది సర్వతోముఖాభివృద్ధికి యాజమాన్యం తోడ్పడాలి. అందుకోసం, దిగువపేర్కొన్న నాలుగు అంశాలను దృష్టిలో వుంచుకోవాలి. **1.** సిబ్బంది యొక్క నిరంతర విద్య; **2.** వృత్తిలో శిక్షణ; **3.** పదోన్నతి మార్గాలు; **4.** మోటివేషన్.

## సిబ్బంది యొక్క నిరంతర విద్య

ఇంటర్మీడియట్‌తో బాటుగ్రంధాలయ శాస్త్రంలో సర్టిఫికేట్ కోర్సు ఉత్తీర్ణతలు - గ్రేడ్ III గ్రంధపాలకులకు కావల్సిన ప్రాథమిక విద్యార్ణతలు. ఉద్యోగంలో చేరిన తర్వాత గ్రంథాలయ శాస్త్రంలో డిగ్రీ, పి.జి. కోర్సుల వంటి ఉన్నత విద్యలను అభ్యసించటానికి ఆసక్తిని కనబరచే ఉద్యోగులకు పౌర గ్రంధాలయ యాజమాన్యాలు ఇప్పటికీ అనుమతిని ఇచ్చి ప్రోత్సాహిస్తూనే వున్నాయి. ఓపెన్ యూనివర్సిటీ కోర్సులు, ఎక్స్‌టర్నల్ కోర్సులు సిబ్బందికి దేవుడిచ్చిన వరాలు. కాని ఆదివారాలలో కాంటాక్టు క్లాసులు, సంవత్సరం చివర్లో సమ్మర్ క్లాసులు, పరీక్షలు వ్రాసే సమయంలో ఒకే గ్రంథపాలకుడున్న శాఖా గ్రంధాలయ సిబ్బంది ఇక్కట్లకు గురికావల్సి వస్తున్నది. ముఖ్యంగా సెలవు పెడితే చదువరులకు ఇబ్బంది, ప్రత్యామ్యాయ సిబ్బంది దొరకడం కష్టం. ఉన్నత విద్యార్హతలు గల సిబ్బంది నాణ్యమైన, విశిష్ఠ సేవలను అందించగల్గుతారనే అంశాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ సమస్యను పౌర గ్రంధాలయాల యాజమాన్యం సానుభూతితో పరిశీలించి పరిష్కరించవలసి ఉంటుంది.

## వృత్తిలోశిక్షణ

గ్రంథాలయ శాస్త్రం పరిధి విస్తృతమవుతున్నది. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, గ్రంథాలయ, సమాచార రంగాలలో వినూత్నమైన, విప్లవాత్మక మార్పులకు దారితీస్తున్నది. కంప్యూటర్

మరియు టెలికమ్యునికేషన్స్ అనుసంధానంతో నెట్‌వర్క్‌ల ద్వారా సమాచార ప్రసరణ వేగవంతమైంది. ఎప్పుడో చదివిన విషయాలను అప్‌డేట్ చేసుకోవడం, కొత్త విషయాలలో పరిజ్ఞానం సంపాదించుకోవడం గ్రంథపాలకులకు చాలా అవసరం. ఇందుకొరకు పౌరగ్రంథాల యాల యాజమాన్యం (నగర కేంద్ర గ్రంథాలయం, జిల్లా గ్రంథాలయ సంస్థలు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం), గ్రంధాలయ సిబ్బందికి పునశ్చరణ తరగతులు (రిఫ్రెషర్ కోర్సులు) నిర్వహించాలి. పౌర గ్రంథాలయాలు భవిష్యత్తులో తమ కార్యకలాపాలను కంప్యూటీకరణ చేయక తప్పదు. కాబట్టి సిబ్బందికి కంప్యూటర్ లైబ్రరీ సాఫ్ట్‌వేర్‌లలో శిక్షణా తరగతులను నిర్వహించాలి. అన్ని శాఖా గ్రంథాలయాలు, కేంద్ర గ్రంథాలయంతో నెట్ వర్క్ ద్వారా అనుసంధానం చేయబడితే సరియైన చదువరికి సరియైన సమయంలో సరియైన సేవలనందించవచ్చు.

## పదోన్నతి మార్గాలు

విద్యార్హతలు, సీనియారిటీ వుండి కూడా ఏ పదోన్నతి లేక, గ్రేడ్ III ఉద్యోగంలో చేరి గ్రేడ్ III గ్రంథ పాలకులుగానే పదవీ విరమణ చేసే సిబ్బందికి ఉద్యోగంలో అసంతృప్తి, స్తబ్దత, నిరాశ చోటు చేసుకుంటున్నది. ముఖ్యంగా గ్రేడు II గ్రంథపాలకుల నియామకం, క్రొత్తగా బయటినుండిగాక అంతర్గతంగా పనిచేసే గ్రేడ్ III గ్రంధపాలకులనే ఎంపిక చేసి పదోన్నతి ద్వారా భర్తీ చేయాలి. ఎనిమిది సంవత్సరాలు ఒకే ఉద్యోగంలో (పోస్టులో) పనిచేసిన సిబ్బందికి, తదుపరి సీనియారిటీ స్కేలును వర్తింప చేయాలి. పదోన్నతి మార్గాలు లేక రిటైరయ్యే వరకుఒకే పోస్టులో పనిచేసే గ్రంధపాలకులు గ్రంథాలయ అభివృద్ధిపై దృష్టి సారించక, యాంత్రికంగా తన పని తాను చేస్తూ కాలంగడుపుతాడు. కాబట్టి ఉద్యోగుల పదవిలో అభివృద్ధి మార్గాలను సమగ్రంగా పరిశీలించి ఒక విధానాన్ని రూపొందించుటలో పౌర గ్రంధాలయ యాజమాన్యాలు శ్రద్ధ వహించాలి.

## మోటివేషన్

గ్రంథాలయ సిబ్బంది విద్యార్హతలను పెంపొందించుటకు, వారిలోసేవాభావాలను వృద్ధిచేయటానికి మోటివేషన్ చాలా అవసరం. గ్రంథాలయ సిబ్బందికి గూడా ఆర్థిక సమస్యలు, కుటుంబ సమస్యలు, తాము పనిచేసే గ్రంధాలయానికి సంబంధించిన సమస్యలు ఎన్నో వుంటాయి. యాజమాన్యానికి, సిబ్బందికి మధ్య తరచుగా సమావేశాలు జరుగుతూ

వుండాలి. ఈ సమావేశాల వలన సమస్యలను అర్థం చేసుకుని పరిష్కార మార్గాలను అన్వేషించుటకు వీలు కలుగుతుంది.

పౌర గ్రంథాలయ వ్యవస్థ ఒక కుటుంబంగా, అందులో పనిచేసే ప్రతి ఉ్యోగి ఒక కుటుంబ సభ్యునిగా, కలసి మెలసి సహకార భావంతో పనిచేయాలి. ఒక సంస్థ అభివృద్ధి పథంలో నడవాలంటే, పేరు ప్రఖ్యాతులు పొందాలంటే, అది ఏ ఒక్కరి వల్లనో సాధ్యంకాదు. ఉమ్మడి భాగస్వామ్యం, సమిష్టికృషి, పార్టిసిపేటిక్ మేనేజ్‌మెంటు వల్లనే ఇది సాధ్యమవుతుంది.

కాబట్టి పై అంశాలన్నీ సమకూరినప్పుడు ఉన్న వనరులతోనే ఉత్తమ గ్రంథాలయ సేవలను అందించవచ్చును. అందుకు అందరూ ప్రయత్నించాలి.

# 4.2 గ్రంథాలయ వారోత్సవాలు–జాతీయ పర్వదినాలు

- డా॥ ఎం. కనకాచారి

## ఉపోద్ఘాతం

ఏదేశమైనా ఆర్థికంగా, పారిశ్రామికంగా ముందంజ వేయాలంటే అన్ని రంగాల అభివృద్ధికి ఆయువు పట్టయిన విద్యా రంగంలో స్వయం సమృద్ధిని సాధించాలి. అందుకు గ్రంథాలయ వ్యవస్థను పటిష్టం చేయాలి. తద్వారా పరిశోధనా రంగం బలపడి ఆధునిక పద్ధతుల్లో దేశం అన్ని రంగాల్లోనూ అభివృద్ధిని కాంచగలదు. అయితే ఇంతటి ప్రాముఖ్యతను సంతరించుకున్న గ్రంధాలయాల అభివృద్ధికి భారత ప్రభుత్వం తగినంత శ్రద్ధను కనబరచటం లేదనేది నిర్వివాదాంశం.

స్వాతంత్ర్యానంతరం 1968లో ప్రారంభించబడిన గ్రంథాలయ వారోత్సవాలు 29 సంవత్సరాలు పూర్తిచేసుకున్న సందర్భంగా గ్రంథాలయ వారోత్సవాల విశిష్టతను, గ్రంథాలయ వ్యవస్థ స్థితిగతులను ఒక్కసారి అవలోకించడం అవసరం - అనివార్యం కూడా. గ్రంథాలయ వారోత్సవాలను మొట్టమొదట అమెరికాలోని గ్రంధాలయ సంఘం ప్రారంభించింది. ఈ విధంగా ప్రారంభించబడిన వారోత్సవాలను ఇంగ్లాండు దేశంతో పాటు మనదేశంలో కూడా ప్రతిసంవత్సరం జరుపుకుంటున్నాము.

## జాతీయ గ్రంథాలయ దినం, వారం

మనదేశంలో ప్రతి సంవత్సరం నవంబరు 14-20 తేదీల్లో (7 రోజులు) గ్రంథాలయ వారోత్సవాలు జరుపుకోవటం ఆనవాయితీగా మారింది. ఈ తేదీలను నిర్ణయించటానికి ప్రత్యేకంగా రెండు కారణాలున్నాయి. అవి:

1) 1919వ సంవత్సరం నవంబరు 14వ తేదీన భారత పౌరగ్రంథాలయాల పితామహులు పద్మశ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి సంకల్ప బలంతో కర్మయోగి, గ్రంథాలయ తపస్వి, బరోడా మహారాజుగారి దర్బార్ గ్రంథపాలకులు, స్వర్ణకారుడు, ఆచార్య జనార్దన్ ఎస్. కుడాల్కర్‌గారి అధ్యక్షతన చెన్నాయ్‌లోని గోఖలే సమావేశ మందిరంలో అఖిల భారత పౌరగ్రంథాలయ మహాసభలు వైభవంగా నిర్వహింపబడ్డాయి.

2) భారతదేశ తొలి ప్రధానమంత్రి, శాంతి దూత, గ్రంధాలయ ప్రేమికుడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారి జన్మదినాన్ని (14 నవంబర్) బాలల దినంగా ప్రకటించడం.

ఈ రెండు ముఖ్యమైన సంఘటలను దృష్టియందుంచుకొని 1933లో ఏర్పడిన అఖిల భారతీయ గ్రంథాలయ సంఘం 1968లో నవంబర్ 14ను జాతీయ గ్రంధాలయ దినంగాను, 14 నుండి 20 వరకు గ్రంథాలయ వారంగాను ప్రకటించింది.

అలాగే 12 ఆగస్టును భారత గ్రంథాలయ పితామహులు, పద్మశ్రీ ఎస్.ఆర్. అయ్యర్ రంగానాథన్ గారి జన్మదినం (ఆఫీషియల్ జన్మదినం) గ్రంథపాలకుల దినంగాను ప్రకటించబడింది. దరిమిలా ప్రతి సంవత్సరం జాతీయ గ్రంథాలయ దినం నాడు అనగా 14 నవంబర్‌నాడు ఈ గ్రంధాలయ వారోత్సవాలు ప్రారంభమై 20వ తేదీతో సమాప్తం కావటం పద్ధతిగా మారింది. 1996లో 29వ సంవత్సరపువారొత్సవాలు జరుపుకున్నాం.

## వారోత్సవాల ఆశయాలు

1. ప్రజల్లో పఠనాసక్తిని పెంపొందింపజేయటం.
2. గ్రంధాలయాల్లో పుస్తకాలను, పుస్తకేతర పఠన సామగ్రిని అభివృద్ధి పరచడం.
3. గ్రంధాలయాలను ప్రజలకు ఉపయోగపడేలా తీర్చిదిద్దడం.

పై మూడు లక్ష్యాల సాధనకు గ్రంధాలయ వారోత్సవాలు జరిగే వారం రోజుల్లో మహానగరాలు మొదలుకొని, మారుమూల ప్రాంతాల వరకు వాడవాడలా వివిధ కార్యక్రమాలు నిర్వహించబడాలి. ముఖ్యంగా విజ్ఞాన వ్యాప్తిలో గ్రంథాలయాల పాత్రను ప్రజలకు తెలియజేయడం, వారిలో పఠనాసక్తిని కలుగజేయడం, వారిని వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా ఎదిగేలా తీర్చిదిద్దడం, గ్రంథాలయాలను ఎక్కువ సమయం తెరిచివుంచడం, గ్రంధాలయాలకు అన్ని రకాల ప్రజలను ఆహ్వానించడం, పుస్తక ప్రదర్శనలు, సంతలు నిర్వహించడం, గ్రంధాలయ ప్రచారం, గ్రంధాలయాల్లోని వివిధ పఠన సామగ్రులను, సూచీలను, అనుక్రమణికలను పరిచయడం చేయడం, గ్రంథాలయాల్లోని సేవలను, వనరులను, సౌకర్యాలను గూర్చి తెలియజెప్పటం, సమావేశాలు, సదస్సులు, గోష్టులు, ఉపన్యాసాలు, చర్చలు నిర్వహించడం, ప్రజల అవసరాలను, కోరికలను, డిమాండులను సేకరించడం, తదనుగుణంగా మంచి పఠన సామగ్రి, పఠన పరికరాల సేకరణకు విధాన నిర్ణయాలు రూపొందించుకోవడం, ఉపయోక్తలకు శిక్షణ నివ్వటం మొదలైనవి ఒక పద్ధతి ప్రకారం నిర్వహింపబడాలి.

ఈ కార్యక్రమాలను కేవలం గ్రంధాలయాలు మాత్రమే నిర్వహించాలనే అపోహ ప్రజల్లో వుంది. అదే విధంగా కేవలం పౌరగ్రంధాలయాలు మాత్రమే చేపట్టాలనే అపోహ గ్రంథాలయ సిబ్బందిలో కూడా ఉంది. కాని అది తప్పు. ఈ బృహత్తర కార్యక్రమాలను పుస్తక పరిశ్రమతో

ముడిబడివున్న వివిధ గ్రంధాలయాలు అనగా ప్రభుత్వ ప్రైవేటు గ్రంథాలయాలు, స్వచ్ఛంధ సంస్థలు, పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు, జాతీయ సంస్థల గ్రంధాలయాలు, వివిధ కేంద్ర రాష్ట్ర అకాడమీలు, సాహిత్య సాంస్కృతిక సంస్థలు, వివిధ గ్రంధాలయ సంఘాలు, సమాచార వ్యాప్తితో సంబంధం వున్న ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు, ప్రచురణసంస్థలు, ముద్రణాలయాలు, టోకు చిల్లర పుస్తక వ్యాపార సంస్థలు, కేంద్ర రాష్ట్ర రచయితల సంఘాలు,........ ఇలా అందరూ కలిసికట్టుగా పూనుకోవాలి. అలాగే ఈ వారోత్సవ కార్యక్రమాల్లో గ్రంథాలయ సిబ్బంది, ప్రచురణ కర్తలు, ముద్రాపకులు, రచయితలు, పుస్తక విక్రేతలు, సాధారణ చదువరులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, పరిశోధకులు, మేధావులు, గ్రంధాలయ ఉపయోక్తలు, గ్రంథాలయాభిమానులు, గ్రంథాలయ నిర్వాహకులు, గ్రంథాలయ పోషకులు, పుస్తకదాతలు, ఇతరత్రా ప్రజలందరూ పాలు పంచుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## గ్రంథాలయాల పాత్ర

మిగతా సంస్థల సంగతెలా ఉన్నా, ముఖ్యంగా గ్రంధాలయ సిబ్బంది, గ్రంధాలయాలు ఈ బృహత్తర కార్యక్రమంలో ఎక్కువ కృషి చేయవలసి ఉంటుంది. ఎందుకంటే తరతరాలుగా మేధావులు అందించిన విజ్ఞాన సంపదను పఠన సామగ్రి రూపంలో భద్రపరచి వలసిన వారికి అందించటంలో గ్రంథాలయాలు నిర్వహిస్తున్న పాత్ర నిరుపమానం. అందుకే యునెస్కో వీటిని "ప్రజా విశ్వవిద్యాలయాలు" అని తేల్చి చెప్పింది. ఇలాంటి మహోన్నత విలువలు కలిగిన గ్రంథాలయాలను విజయవంతంగా నిర్వహిస్తూ, వీటి ఆశయ సిద్ధికై గ్రంధాలయ సిబ్బంది అహో రాత్రులు సేవా తత్పరతతో కృషి చేయాల్సి వుంది. 1968లో ప్రథమ గ్రంధాలయ వారోత్సవాల సందర్భంగా భారత రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరిగారు మాట్లాడుతూ "గ్రంధాలయాల ముఖ్య ఉద్దేశ్యం కేవలం గ్రంథాలను సేకరించి భద్రపరచటమే గాదు, వాటిని ప్రజలచేత చదివించి పుస్తకాలలోని విషయాలను వారికి తెలియజేసి వారిలో పఠనాసక్తిని రేకెత్తించడం" అని అన్నారు. అందుచేత గ్రంథాలయ వారోత్సవాలను సంప్రదాయ సిద్ధంగా కాకుండా, ఆధునిక నాగరికతకు అనుగుణంగా జరుపుకొని ఆశయ సాధనకు కృషి చేయాలి. ఈ ఆశయాలు నూటికి నూటుపాళ్ళు విజయవంతం కావాలంటే నిస్వార్థసేవ, అకుంఠిత దీక్ష అత్యవసరం.

# 4.3 గ్రంథాలయాలు - వాటి వినియోగం

- కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

"గ్రంధాలయం ఒక జ్ఞానాలయం. చరిత్రలో ఇప్పటివరకు జరిగిన మొత్తం యుద్ధాలవలన స్వేచ్ఛనందిన ప్రజా సమూహంకంటె అధిక సంఖ్యాకులయిన జను గ్రంధాలయం ప్రసాదించే జ్ఞానం వలన స్వేచ్ఛా జీవులయినారు-" ఇవి కార్ల్‌రొశాన్ అనే పాశ్చాత్య విద్వాంసుడు చెప్పిన మాటలు. అజ్ఞానాంధకారం నుండి విడివడి జ్ఞాన ప్రకాశము లోనికిరా, అనే 'తమ సోమా జ్యోతిర్గమయా' ఉపనిషత్సూక్తిలో నిగూఢమైన భావం యిదే - దేవుని గుడికి గల పవిత్రత, ప్రాముఖ్యం గ్రంథభాండాగారానికి ఉన్నాయి. జీవనయాత్రలో తప్పు దారిలో నడిచే మానవుడిని సరియైన దారిలోనికి తీసికొని రాగలిగిన మహత్తు గ్రంథాలకు ఉందనే సత్యం పై సూక్తుల ద్వారా విశదమవుతున్నది.

'లోకోభిన్నరుచి:' ఒక్కొక్కరికి ఒక్కొక్క వృత్తిమీద, విద్యమీద ఆసక్తి ఉంటుంది. వృత్తి ఏదయినా మరోప్రవృత్తిపై మనిషికి అభిలాష ఉండవచ్చు. నాగరికత బహుముఖ వికాసం పొందిన నేటి యుగంలోమనిషి మనో వికాసానికి తొడ్పడే విజ్ఞాన వృక్షానికి నలువైపుల అనేక శాఖోపశాఖలేర్పడినవి. చరిత్ర, సాహిత్యం, రాజనీతి, ధర్మతత్త్వం మొదలైనవేకాక, మనుగడ వృత్తి పరిశ్రమలకు కావలసిన సాంకేతికశాస్త్ర విజ్ఞాన విషయాలెన్నో నేటి ప్రజానీకమున కావశ్యకములైనవి. ఇవి ఒక దానితో ఒకటి యేదో విధంగా పరస్పర సంబంధ అనుబంధములుగా నున్నవేగాని విడివిడిగా నుంచుటకు అనుకూలముగావు. ఏ ఒక్కరూ అన్ని గ్రంథాలను ఒకచోట సమకూర్చుకొనుట అసాధ్యము. చాలవరకు ఒకచోటనే లభ్యమయినచో అందరికీ ప్రయోజనం. గ్రంథాలయాల ఏర్పాటుకు ఇదొక ముఖ్యకారణం. ఒక్కొక్క శాస్త్రానికి అంతర్లీనముగ ఎన్నో విభాగాలుంటాయి. ఒక గ్రంథం ఒక విద్యావంతుని విద్యాతపఃఫలము -సమాజంకోసం అతడొనర్చిన పరిశ్రమ, త్యాగం. అవగాహనతో, చదవాలేగాని, ఆ గ్రంథంతోపాటు గ్రంథకర్తకూడా మనతోమాట్లాడుతూ మనకెదురుగా ఉన్నట్లే ఉంటుంది. ఒక భారతం, ఒక భాగవతం లేదా మరొకటి - దేన్ని అధ్యయనం చేసినా, ఆ అనుభూతి ఆనందం కలిగి తీరుతుంది. ఆ గ్రంథముల నుండి ప్రసరించు జ్ఞానధారా ప్రభావమది - గ్రంథమునకు పఠితకు మధ్యగల సంబంధ బాంధవ్యమది.

ప్రస్తుతం దేశంలో గ్రంథాలయాలకు కొదువలేదు. 1947లో దేశానికి స్వాతంత్ర్యం

వచ్చిన నాటి నుండీ పట్టణాల్లో పల్లెల్లో, గ్రంధాలయాలు వెలిశాయి. నానాటికి వాని సంఖ్యా పెరుగుతున్నది. నిర్వహణకు వలయు నిధులందుతున్నాయి. వేలాది గ్రంథములు సమకూరుతున్నాయి. కొన్ని పెద్ద గ్రంధాలయాల్లో పుస్తకములు లక్షలాదిగ నున్నవనుట అతిశయోక్తికాదు. అన్యశాస్త్రములకు వలెనే గ్రంధాలయ సమాచార శాస్త్రంలో ఉత్తీర్ణులైన నిపుణులు గ్రంధాలయ అధికారులుగా ఉండి ఏటేటా గ్రంథసంపదను పెంపొందిస్తున్నారు. గ్రంధాలయాలను వివిధ ప్రదేశాల్లో, వివిధ రకాలుగా ప్రజలకందుబాటులో ఉండే విధంగా ఏర్పాటు చేస్తున్నారు. ప్రభుత్వ ప్రాంతీయ గ్రంధాలయాలు, జిల్లా కేంద్ర శాఖాగ్రంధాలయాలు, పాఠశాల కళాశాల విశ్వవిద్యాలయాల్లో వారివారి కనువగు గ్రంధాలయాలు, ఇవిగాక ప్రజలు స్వయంగా ఏర్పరచుకొన్న గ్రంధాలయాలు మనకు ఎల్లెడలా కనిపిస్తుంటాయి.

సుందరమైన భవనాలు, విశాలమైన గదులు, బీరువాల నిండా పుస్తకాలు, బల్లలు, కుర్చీలు ఏర్పాటు చేయగానే సరిపోదు. వ్యాస ప్రారంభంలోనే గ్రంధాలయాల ప్రయోజనం, లక్ష్యం ఎట్టిదో చర్చించినాము. ఆ పరమార్థమును గ్రంధాలయాలు ప్రజలకు అందిస్తున్నాయా? గ్రంధాలయానికి ప్రజలు ఆసక్తితో చదువుటకే వస్తున్నారా? కావలసిన పొత్తములు అందుబాటులో ఉన్నాయా? ఈ ప్రశ్నలకు సంతృప్తికరములగు సమాధానములు రాకపోయినచో ఎక్కడో లోపం ఉన్నట్లు భావించాలి. అన్ని సదుపాయములను కలుగజేసితిమి. వచ్చి వినియోగించుకొనుట ప్రజల బాధ్యత అనుకుంటే సరిపోదు. ప్రజా ప్రయోజనం కొరకు పాలకులేర్పఱచిన సౌకర్యాలను ఉపయోగించుకొనుట ప్రజలకెంత ముఖ్యమో వారికా ఆసక్తిని కలుగజేయు కర్తవ్యం కూడ గ్రంధాలయ నిర్వాహకులకు అంతే ముఖ్యం.

ఈ రెండు అంశాలను మరికొంత నిశితంగా పరిశీలించటం అవసరం. గ్రంధాలయాలకు వచ్చే వారిలో వివిధ దశల వారుంటారు. ప్రారంభ పాఠములను చదివేవారు., కొంతవరకు ప్రవేశం గడించినవారు, విశేష జ్ఞానమునకై పరిశోధన చేసేవారు, ఆయా స్థాయిలలో వారికి అవసరపడే పఠన సామగ్రి ఉందా? ముఖ్యంగాప్రారంభకులకు వివిధ విషయములపై కావలసిన సులభశైలి చిన్న చిన్న పొత్తములు ఉన్నాయా? పుస్తకపట్టికలు, ర్యాక్స్‌ల్లో సర్దుబాటు వరుసలు ఒక క్రమంగా ఉన్నాయా? అప్పటి కప్పుడు తీసికొని చదువదలచిన వారికి వెంట వెంటనే పుస్తకాలు లభిస్తాయా? కంటికి చేతికి గ్రంధాలు అందుబాటులో ఉన్నాయా?

పుస్తకాలు, వాపసు వచ్చిన పుస్తకాలు యధాపూర్వ స్థానాల్లో అమర్చబడుతున్నాయా? లేక కలగూరగంపలాగా పడి ఉంటున్నాయా? చదువరులకు పుస్తకాలనుతీసుకునే పద్ధతులను, అలాగే చౌర్యము, బొమ్మలు పుటలు చింపుకొని పట్టుకొనిపోవుట, నలిపి వేయటం మొదలైన దురలవాట్లను నివారించే కరపత్రాలు, ప్రకటన ఫలకాలున్నాయా? కూర్చొని చదువుకొనుటకు

ప్రదేశము నిశ్శబ్దంగా, శాంతంగా కనులకు ఇంపుగా ఉన్నదా? ఈ అంశాలన్నీ పరిశీలనార్హములు. ఎవరి పనులు వారే చేసుకుంటారు. ఇబ్బంది లేదనుకుంటే ప్రమాదమే! అనుక్షణం పర్యవేక్షణ లేని పని నిరర్థకం. నష్టదాయకం. ప్రస్తుత పరిస్థితుల్లో సిబ్బంది చేసే పనులపై నిరంతర పర్యవేక్షణ అందరికీ శ్రేయోదాయకం. తద్వారా లోపాలను సరిదిద్దవచ్చును. క్రొత్త, మంచి పద్ధతులను నేర్పవచ్చును.

ఇక పుస్తకాల వినియోగం ఎలా ఉంది? పరిసర ప్రాంతమువారికి రోజూవచ్చే వారికి నచ్చే పొత్తములున్నాయా? అవి మన సంస్కృతికి ఆచార విచారములకు తగినవేనా? ఉన్న పుస్తకాలన్నింటిని వినియోగపరుచుకుంటున్నారా? అనేవి గమనించవలసిన విషయాలు. ఎందుకంటే ఆయా పుస్తకాలపై ప్రతివారం ఎవరో ఒకరు తీసికొని చదువుతున్న గుర్తులు కనబడతాయి. కొన్ని పుస్తకాలను ఎవరూ ఎప్పుడును తీసి చదివిన గుర్తులే ఉండవు. అయితే చాల తక్కువ మంది చదువుతున్నారని, అంతమాత్రాన ఆ వస్తువుయొక్క విలువగాని, ప్రాముఖ్యముగాని తక్కువని ఊహించుటకు వీలులేదు.

ఒక ఉదాహరణ చూద్దాం. గ్రంథాలయంలో బల్లనిండా పత్రికలే ఉంటాయి. కథల పత్రికలు, వినోదకథలు, ప్రేమకథలు, మరేవో కథలు చమత్కారములు - మొదలైనవి చాలా పత్రికలుంటాయి. అయితే కావలసినన్ని సాహిత్య పత్రికలనుతెప్పిస్తారా అనేది అనుమానమే! సాహిత్య పత్రికలను చదివే వారు చాలా తక్కువ. కాని ఒక్క సాహిత్య పత్రిక కున్న విలువకు కథల పత్రికలు ఇరువదియైనను సాటిరావు. సాహిత్య పత్రికను ఇద్దరు చదివినా చాలు ముప్పయ్ మంది ఇతర పత్రికలు చదివిన ఫలమున్నది.

మరో విషయం. గ్రంధాలయం సార్ధకం కావాలంటే దాని వినియోగం ప్రజలకుఅందాలి. అయ్యో, మా ప్రాంతానికి ఈ ఒక్క గ్రంథాలయము చాలదు. మరియొకటి కావాలని ప్రజలు ఆందోళన పడేలా ఉండాలి. ఈ ఆసక్తిని ప్రజలలో గ్రంధాలయ నిర్వాహకులు కల్గించుట ఉత్తమమే కాదు చేయవలసిన విధికూడ. గ్రంధాలయ సంస్థకు సార్ధకతనిచ్చే మార్గమిదే. గ్రంథాలయ నిర్వహణకయ్యే ధనం సద్వినియోగమయ్యే పద్ధతికూడా ఇదే. ఈ విషయం అవగాహన ఆలోచన, అభిరుచితో ముడిపడి ఉంటుంది. గ్రంధాలయ అధికారులు వ్యక్తిగత అభిరుచితో చేపట్టి నిర్వహింపవలసిన పనియిది. ఏడాదికోసారి వారోత్సవాలను చేస్తున్నాము గదాయని సమాధానం చెప్పుటసరికాదు. ప్రతి మాసంలోనూ వారోత్సవాలు జరగాలి. ప్రతివారం వివిధ విషయాలపై సభలు ఏర్పాటుచేసి అనుభవజ్ఞులు, పండితులైన వారిచేత ఉపన్యాసాలు ఇప్పించాలి.గ్రంథాలయానికివచ్చే వారు కూడ ఆ సభల్లో పాల్గొనేలా చూడాలి. గ్రంథాలయంలో ఆయా విషయాలపై ఉన్న గ్రంథ సముదాయాన్ని గూర్చి చెప్పినచో

గ్రంథపఠనంలో మరింత ఆసక్తి కలుగుతుంది. ముఖ్యంగా ఏ విషయం, ఏ గ్రంథం ఏ విధంగా సమాజ జీవనానికి ఉపయోగపడుతుందో విశదీకరించటం మంచిది. ఆ వారం వచ్చిన పత్రికల్లో నుండి ముఖ్యమైన ప్రయోజనకరమైన విషయాలను కొన్నిటిని చదువరులకు చదివి వినిపింపవచ్చును. ఈ విధంగా చదువరులకు ఆసక్తి ప్రదములైన పద్ధతులను కల్పించి గ్రంథాలయంపై ప్రజానీకానికి ఎక్కువ గౌరవాదరాలు కలిగే విధంగా చేసినచో గ్రంథాలయ లక్ష్యం, వినియోగం పరిపూర్ణముగ సిద్ధిస్తుంది.

చివరిమాట - జనసామాన్యంలో విద్యాభివృద్ధి జ్ఞాన వికాసముకల్గుటకు ఏర్పడిన పవిత్ర సంస్థలు గ్రంథాలయాలు. తల్లి దండ్రులు, బంధుమిత్రులు, గురువులు ఆప్యాయత ఆదరణ చూపి మంచి మార్గములు బోధించినట్లుగా ఉత్తమమైన ప్రతిగ్రంథం అంతకంటె ఎక్కువ ఆదరణతో మనకు మంచి మార్గాన్ని చూపగలదు. ఒకగ్రంథం గురువు, ఒక పుస్తకం గురువు, ఒకటి మిత్రుడు. ఇట్లే మనకు గల ఆసక్తిని బట్టి అవి మనకు ప్రేమతో అన్ని విషయాలను నేర్పుతాయి. సరస్వతి సర్వవిద్యాదేవి. పురాణాలు, కావ్యాలు, ఇతిహాసాలు, శాస్త్రాలు, విజ్ఞాన గ్రంథాలు, ధర్మగ్రంథాలు, చరిత్రలో ఇవన్నీ సన్మార్గాన్ని చూపే సరస్వతీ స్వరూపాలే. గ్రంథపఠనం, శ్రవణం, గ్రంథాలయసేవ సరస్వతీదేవి పూజయే. ఆ పూజాఫలం విద్యాలబ్ధి. విద్యవల్లనే మానవుని మనుగడ - జీవిత పరమార్థమును - విద్యలేనివాడు పశుప్రాయుడే. మనకు అభిరుచిగల ఏ విద్య నేర్చినా అది సకల సంపద్ప్రదమే.

అందుకే -

విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము,పురుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్యగురుండు విదేశ బంధుడున్
విద్యనృపాల పూజితము . . . . . . . .

అని భర్తృహరి మహాత్ముడు వేద వాక్యాలవలె చెప్పాడు. సర్వ విద్యా ప్రబోధకములైన గ్రంథాలయాలు సరస్వతీదేవి ఆలయాలు. జాతి అభ్యుదయానికి గ్రంథాలయ సంస్థలు దీపస్తంభాలు. అవి విజయవంతంగా సద్వినియోగమయ్యేటట్లు చూడవలసిన బాధ్యత అందరిది.

# 4.4 MODERNIZATION OF PUBLIC LIBRARY SYSTEM IN ANDHRA PRADESH

**- Prof. A.A.N. Raju**

## Introduction

The enactment of an integrated A.P. Public Libraries Act, 1960 ushered in an orderly development and spread of public library services throughout the State. The present structure of Public Library System in the State consists of a State Central Library (SCL) in Hyderabad, as an apex library of the system, the Regional Libraries (RLs), the District Central Libraries (DCLs) and Branch Libraries (BLs). Further below the BLs, there exist Village Libraries (VLs), Book Deposit Centres (BDCs) and Mobile Libraries (MLs). Besides these, Aided Libraries (ALs), Panchayat Libraries (PLs) and Cooperative Societies Libraries (CSLs) are also functioning in the State.

## Problems Faced by the Public Library System

Ever since the act came into force three and half decades ago, the Public Library System in the State has been facing severe administrative, political and financial constraints. Of the several problems mention may be made of : a)non-remittance of library cess, b) ban on recruitment, c) new libraries without proper collections, d) ambiguous book selection policy, e) ban on book purchases, f) ban on expenditure and last but not the least g) Committees recommendations in cold storage.

## Emerging Information Society

In spite of these problems the Public Library System as a whole made some progress in meeting the information requirements of the society. The emerging Information Society in India has cast more responsibilities on all types of Libraries and Information Centres in the country. Public Libraries are no exception to this phenomenon. The traditional services offered by the Public Library

System have to be transformed and enhanced by application of Information Technology (IT). The Public Library System in the State must be technologically advanced so that they have access to national and international data bases and networks. The output of various types of documents, proliferation of information, increase in the number and types of users are forcing the libraries to change and adopt new methods of cooperation and new tools of IT, so that they can meet the demands of emerging Information Society.

## Networking of Public Libraries

The UNESCO Library manifesto 1994 clearly states the need for Public Library Networks at national and regional levels. There is ever growing need for network of public libraries presently functioning at different levels viz. rural, district and regional in the State. The advantage that accrue from a network are: (a) free flow of information among different types of public libraries, (b) increased access to collections, (c) quick and efficient information services to user community, (d) resource sharing through cooperation and to achieve near self sufficiency, (e) production of union catalogues and (f) rationalization of all types of resources available in the Public Library System.

## Computerization

In the context of emerging information society, computerization of Public Libraries in sine-quo-non, to meet the varied information needs of user community. The Public Library System in the State has not yet been computerized and still the system is very much dependent on manual operations. The hardware and software required for computerization has to be selected with the experts guidance and advise. Some experts have suggested that it would be advisable to go ahead in most cases with the minimum hardware configuration. That is a 486 machine. So far as software is concerned it would be ideal that the State Central Library uses BASIS Plus and TECHLIB plus being distributed by National Informatic Centre.

The suggested hardware and software may hold good even for District Central Library also.

## Bibliographic Standards

In order to conform to national and international bibliographic practices, the public library system should conform to certain international standards. A standard has to be used for creation of a bibliographic record for hardware/software interface specifications. UNESCO has been promoting Common Communication Format (CCF) and this would suit the requirements of Public Library System. The system should also follow Anglo American Cataloguing Rules (AACR-II) and for giving subject headings, LC Subject Headings List may serve as a basic tool.

## Manpower Training

The staff in the public library system, with exception to few, are not exposed to and conversant with the application of computers in libraries. Training of the personnel working in the system in the use of computers and library software is one of the basic requirements of computerization and networking. The Department of Public Libraries or the State Central Library for its staff as well as the staff in the Regional Libraries, and the District Central Libraries (DCLs) should arrange 2 to 3 months State level and/or District level training programs. These training programs should include familiarization of AACR-II, use of CCf and LCSH, basics of computers, software, etc. and the use of E-Mail and if possible INTERNET. The expertise for organizing training programs can be drawn from NIC, DELNET, INFLIBNET and also from Departments of Library & Information Science in the State.

## Conclusion

In order to meet the requirements of emerging information society, and to maximize the use of resources available in the Public Library System in the State, there is an urgent need to modernize

the Public Library System in the State. The authorities who are at the helm of Public Library affairs in the State cannot shut their eyes to the emerging Information and Communication Technology scenario in the country. Unless the system is completely modernized, it cannot meet ever growing demands for information from the emerging Information Society. Andhra Pradesh Public Library System should take lead in this respect and show way to other States in India where such Public Library System exists.

## REFERENCES

1. The UNESCO Public Library Manifesto. Unisist News Letter, V23, N1, 1995, pp. 8-11.
2. Kaul, H.K. Networking of Public Libraries in South Asia. DELNET News Letter, V3, N1, July 1996. pp.5-9.
3. Public Libraries in the Information Society. Managiing Information. V3, Nos. 7/8, July-August, 96. p.19.
4. Raju, A.A.N. The Rot in our Public Libraries. Deccan Chronicle, 18th June, 1995, p.19.

## 4.5 STATE POLICY FOR PUBLIC LIBRARY AND INFORMATION SERVICES

(A draft)

- Dr. Velaga Venkatappaiah

As per the Constitution of India, Public Libraries form the part of the State List whereas Education is part of the concurrent List (No. 25). So it is obligatory on the part of the State Government to formulate a policy for public Library Service and pass laws for implementation of the Policy so framed. It should contain the essential components like Library, Education, provision for Information and Culture. To support these components, there is a need to enact library legislation or restructure the existing Public Library Acts in view of the recent developments in library and information services, such as :

- New Panchayat and Municipal Acts after amending the Constitution in 1992, implimented from 1993.
- UNESCO Public Library Manifesto, 1994 (3rd revision).
- Rural Library Scheme of the Government of India, 1994.
- Unprecendented growth of literacy through the crash programmes like National Adult Education programme, National Literacy Mission, Total Literacy Campaign, Education for All Programmes, etc.
- Emerging necessity of right to information
- Information explosion in the Third World Countries
- Use of information as a source of knowledge
- Final Report of the National Policy of the Library and Information system and the recommendations of the Empowered Committee
- National Book Policy; and
- lastly to keep pace with the warnings of new technology and new wave of the future.

Hence, it is necessary that each State should have Policy for Public Library and Information Services and this Policy shall be

drafted, passed and adopted based on the facts mentioned above. The draft to such State Policy is given below:

**1 Preamble**

The State Government is firmly convinced that

"freedom, prosperity and the development of society and of individuals are fundamental human values. They will only be attained through the ability of well-informed citizens to exercise their democratic rights and to play an active role in society. Constructive participation and the development of democracy depend on statisfactory education as well as on free and unlimited access to knowledge, thought, culture and information. The Public Library, the local gateway to knowledge, provides a basic condition for lifelong learning, independent decision-making and cultural development of the individual and social groups."

**2 Areas of Service**

The State Government believes that public library is a people's university and a living force for education. It is an information centre and a place where the people can make proper use of leisure. Therefore, the Government desires to establish, maintain and encourage public libraries including information centres on modern lines to cater to the needs of all sections of the community in the following areas:

- irrespective of age, sex, caste, religion or social status;
- more particularly, it should cater to the needs of human beings starting from illiterates, neoliterates, semi-literates, dropouts, etc.;
- to the people living in rural areas, backward and remote areas;
- to the people belonging to linguistic minorities;
- to the physically handicapped, prisoners and patients in the hospitals; and lastly
- to the people at all levels with certain limitations.

**3.1 Literacy and Education**

The Government of India with the support of State Governments, launched National Adult Education Programme (NAEP) in 1978,

National Literacy Mission (NLM) in 1989, Total Literacy Campaign (TLC) in 1991 and recently Education for All (EFA) and achieved total literacy in the Kerala State and cent percent literacy in some districts of the country. The TLC is in the final stage in several districts in the country. In the wake of this emergency, the priorities concerning the public library and information services have to be changed.

It is also obligatory on the part of the District Library Authorities that they should render library service to the illiterates and neo-literates since the library cess is being collected from them also. It is really a social injustice that since long literates are getting benefitted with the library cess paid by the illiterates and neo-literates. According to the position of funds available with the authorities, library service should be extended to all the people. The PG centre libraries and University Libraries must be kept open for the people of higher learning, whether they are students/faculty members of the said institution or not. It is not desirable for the public libraries to extend much facilities to the research scholars and people who make indepth study in public libraries, when sufficient funds are available at PG centres and Universities. In this background, the proposed policy shall be as follows:

#### 3.1.1. Proposed Policy

The Public Libraries shall serve the community on the following on priority basis:

- illiterates and neo-litertes, semi-literates and the participants of non-formal education;
- people pursuing self-education;
- people interested in self-employment shcemes;
- semi-skilled;
- children and youth;
- casual readers, housewives; and
- higher education and research etc.

### 3. 2 Information

Now it is recognised that information is a valuable and indispensable commodity for socio-economic development of the

society. The Public Libraries should takeup the responsibility of spreading the information to the common person to elevate his/her position after the minimum needs. To activate this primary function, the public libraries should rise to the occasion.

**Proposed Policy**

In this connection, for arranging free access to information the public libraries should act as Information Centres. The Public Libraries should-

- provide access to all citizens for all types of information at all levels;
- provide information on local enterprises, associations and local interest groups;
- develop local histories;
- develop community information services;
- utilise the services of National Informatics Centres; and
- introduce computer skills for achieving speed, accuracy and bulk in service.

## 3.3 Culture

A public library should act as a principal centre for promoting awareness about cultural heritage, appreciation of arts, scientific achievements and innovations. It should encourage the members of the society for keener participation and involvement in common enjoyment of performing and non-performing arts.

**Proposed Policy**

The Public Libraries in a developing society should-

- preserve cultural heritage;
- provide access to all forms of cultural expression;
- make efforts to foster inter-cultural dialogue;
- favour cultural diversity; and
- support oral tradtion.

## 3. 4 Library at the Door Steps

In some states people have much leisure. This leisure must be spent peacefully and functionally with the latest audio and video

material preferably at the doorsteps of the citizens. Library at the Doorsteps is the order of the day.

**Proposed Policy**

Therefore the public libraries should -

- establish mobile libraries to cover the villages and hamlets which don't have any access to library facilities;
- provide soft reading material to the society for proper utilisation of the leisure for change and recreation; and
- stimulate imagination and creativity in all sections of the people.

### 3. 5 Peace and Understanding

Lastly, a public library should act as a place for free thinking and a community centre for fostering of peace and spiritual welfare, through the minds of people belonging to various sections of the community. Finally it should pave the way for the ultimate concept of Complete Human Being.

**Proposed Policy**

The public libraries through various activities such as

- group meetings and discussions;
- common prayers; and
- carnivals and festivals, etc.

should help the community in peaceful coexistence and develop fraternal understanding.

## 4 Public Library System

A federal country like India needs a two-tier Public Library System in the state, that is, one at the state level as an apex body and the other at the District level for spreading its activities to the village level.

There is a need for statutory body with a corporate status at the district level for rendering comprehensive library and information service from district headquarters to the village and even to the

hamlet level. It is called as the District Library Authority. Its main objective must be that every tax payer must be offered library and information service to the possible extent.

**Proposed Policy**

In view of the existing situation of public administrative system, there is a need for the following:

1. A State Library Authority (SLA) at the state level and One District Library Authority (DLA) for each district and one City Library Authority (CLA) for each Municipal Corporation. These bodies should be vested with executive powers.
2. The SLA shall be headed by the Minister for libraries and assisted by a small group of LIS professionals;
3. The CLA/DLA shall be constituted with a nominated or preferably elected Chairperson. CLA/DLA will be assisted by a small body of LIS professionals and a very few non-official members with library literacy;
4. The department at the state level shall be called as the Department of Public Library and Information Services;
5. In future the names of the Libraries can be called as follows:-
    1. State Public Library and Information Centre
    2. Regional Public Library and Information Centre
    3. District/City Public Library and Information Centre
    4. Mandal/Block Public Library and Information Centre
    5. Rural/Mobile Public Library and Information Centre and likewise.

## 5 Reading Material

The Public Library including information centre should be equipped with the material suited to the chaning conditions.

**Proposed Policy**

The State Government will formulate a comprehensive Book Selection Policy for Public Libraries in the State. The public libraries should acquire all kinds of documents including multimedia.

The reading/audio/video materials should fulfil the following guidelines. They should be

- value-based and culturally oriented;
- suited to all groups;
- creative and strengthen the reading habits of children;
- relevant to the local needs;
- conducive to encourage local traditions; and
- reflect the current trends and evolution of the society and also serve as the memory of human endeavour and imagination.

## 6 Human Resources

It is felt that adequate human resources are necessary for rendering library and information services affectively. For this purpose creation of a separate State Library and Information Service and sub-ordinate service is essential. It should be on par with other State Government Services.

### Proposed Policy

In case of human resources, the Government will take the following steps:

- By constituting a State Library and Information Service and Subordinate Service;
- it will see that all members of the said service shall be Government servants;
- The recruitment for the said Service and conditions of service shall be subject to the provisions of Article 309 of the Constitution of India.

## 7 Library Education

For the speedy growth of libraries and to meet the challenges of changing character of library and information services, the development of manpower to suit the growing needs becomes essential.

### Proposed Policy

- The courses run by the existing institutions may be continued if there is a deapth of qualified candidates;

- The course syllabus should be more functional and restructured to suit the changing needs.
- Inservice orientation programmes should be encouraged.

## 8 Finances

It is strongly felt that public library services will be rendered freely without charging any fee for general services. However, a nominal fee will be collected for special services. It is also strongly felt by the Government that the library cess is the only dependable and perennial source of income for the library authorities. Whenever the Government feels that the library cess is not sufficient to maintain certain standards in services, the Government will come to the rescue of public libraries to raise the fund of the library authorities. The Government will take care of the people living in backward areas and the disadvantaged groups.

### Proposed Policy

Through library legislation, the State Government will impose library cess like educational cess as surcharge.

- The rate of library cess can be decided as per the local conditions.
- The Government will bear the establishment charges.
- The Government Common Good Fund of the banks and other local resources to provide funds for the development of public library services.

## 9 Libraries Maintained by other Agencies

The Policy of the Government is to encourage the local talent and resources. For maintenance of these private/local libraries, the Government will financially support to the possible extent where there is no service point of the District Library Authority in that locality.

### Proposed Policy

The Government will encourage the libraries maintained by local bodies and voluntary agencies, Government clubs and Mahila mandals.

- For this purpose, a Grant-in-Aid code is to be prepared and implemented.
- The City/District Library Authorities shall be insisted upon to assist the libraries maintained by other agencies which are serving the same cause.

**10 Registration of Reading Material**

The Registration of books and periodicals will be taken up in each State to:

- Check-up obsolete, obscene and unwanted material;
- preserve the books for posterity; and
- publish a classified list of books at frequent intervals.

**11 Library Legislation**

Considering the issues accepted in the State Policy of Public Library and Information Services, it is decided to have comprehensive legislation to -

- go in for a public library and the information system in the State;
- utilize the Public library and Information system in the State for the Socio-economic growth of the masses;
- maintain standards in library and information services;
- arrange for perennial growth of income for financing the public libraries;
- provide for people's participation in public library development at all levels.

In the light of the above, the decision makers and administrators at the State level in India are hereby urged to pass legislation for Public Library and Information Services in order to provide better future for the Indian masses.

# 4.6 NEED FOR NETWORKING THE CITY CENTRAL LIBRARY SYSTEM - A PROPOSAL FOR COMPUTERISATION OF CATALOGUING

- Dr. M. Kanakachary

## Introduction

Hyderabad, the capital of Andhra Pradesh bustling 400 years old metropolities, in culturally and historically an important academic and research centre in India. Both Hyderabad and Secunderabad grew together and named as twin cities. These twin cities about in number of libraries of various types such as public, private, academic, special and personal.

Being a multilingual city, Hyderabad is going to be expanded into a Megacıty. In this context, it is essential that the vast quantum of information and the source materials available in the City Central Library System, which is a public library system, are easily and quickly accessible to the public including students, scholars, researchers, professionals.

## Objective of the Paper

The main objective of this paper is to discuss the need and necessity for networking the City Central Library System (hereinafter called CCLS) and to propose a practically-viable method of computerising the existing cataloguing system. CCLS denotes the main library located at Ashok Nager and its 85 Branch Libraries located in twin cities.

At the outset, it is necessary to know briefly about the profile of CCLS and the existing infrastructural facilities before suggesting a proposal for computerisation of catalouging system, one of the in-house functıons.

## Profile and Infrastructural Facilities of CCLS

City Central Library was set up under A P Public Library Act 1960. There were 40 branch libraries upto 1986 and during 1987 three branches were opened and after 1987 the remaining 46 branches were opened.These 89 branch libraries includes two women libraries and three mobile libraries (touching 30 points daily in two shifts). These branch libraries are scattered in an area of about 250 k.ms. and serves the public of the twin cities. The flow of the users into all these libraries including main library throughout the year was approximately 40 lakhs for the year 1992-93 (As per the Gate Registers in 87 libraries). It means, on an average of 1.4 lakhs per month and 4.5 thousand per day out of a population of 40 lakhs use these libraries. The total number of registered members was approximately 60 thousands (after withdrawals are deducted as on 31.3.1995. The book stock of the system is 12,02,776 lakhs in all languages such as English, Hindi, Kannada, Marathi, Sanskrit, Tamil and Telugu. In addition to these, there are 75,912 books, of which 39,241 books received under RRRLF grant and 36,671 books received on gratis (language-wise book stock is given in Appendix-B).

The CCL has the facilities like Audio-Video, reference service, document delivery, and newspapers preservation. Though the figure varies roughly, a budget of 40 lakhs rupees is allotted to the system towards the books, magazines and newspapers. More than one crore rupees towards library cess is being collected @ 0.8 paise per rupee in the form of house tax from the public by the Hyderabad Municipal Corporation. Keeping 0.2 paise with them towards service charges and the Coporation is giving only some part of the amount collected. Still nearly Rs. 7 crores is due from Hyderabad Municipal Corporation to the City Granthalaya Samstha.

CCL adopted centralised method for acquisition of books and their technical processing, i.e. classification (as per DDC 16th ed.) and cataloguing (as per AACR-I) and decentralised acquisition of

